లీలా ప్రచురణలు।
సంపాదకుడు,
యం. జగన్నాధరెడ్డి

ప్రథమ ముద్రణ
1960
లీలా ప్రెస్, విజయవాడ-2.

వెల: రూ 2-0-0

ఇందులో........

# ఉపాధ్యాయుడు

కాలేజీలో తోటివిద్యార్థులందరిలో నేను మంచిపేరు సంపాదించుకొన్నాను. అన్నివిషయాలలోనూ, నేను నేర్పు గలవాడనని అందరూ విశ్వసించేవారు. ప్రతివిషయంలోనూ నాకు 'నాది' అనదగిన అభిప్రాయం వుండటమే దీనంతటికీ ముఖ్యకారణం. ఆ 'నాది' అనదగిన అభిప్రాయం సరైనది కావచ్చు, కాకపోవచ్చు కాని ఆ అభిప్రాయంమాత్రం నా స్వంత అభిప్రాయమే. అనేకమంది చాలావిషయాలలో అవునని గాని, కాదనిగాని తేల్చి చెప్పలేరు, ఆవిధంగా నేను చెప్పగలిగేవాడను.

అంతమాత్రాన నాకున్నవన్నీ ఒక్క అభిప్రాయాలు మాత్రమే, అని అనుకోనేరుసుమా! నేను కవిత్వం వ్రాయ గలను, ఉపన్యాసాలివ్వగలను, వాదనచేయగలను అందుకే నేనంటే మాక్లాసులోని విద్యార్థులందరికీ భక్తి, ఈర్ష్య కూడావుండేవి. కాలేజి చదువుసాగినంతకాలమూ ఈవిధం గానే జరిగివుండేది. కాని నాపేరు ప్రఖ్యాతుల్ని మంటగలప టానికి హఠాత్తుగా మాకాలేజీకి క్రొత్తప్రొఫెసరు ఒకడుమ్మ తని గాడివలె దాపురించాడు.

అతను మంచిపేరుసంపాదించాడు. ఇప్పుడు మంచి పదవిలోకికూడా వచ్చాడు కనుక నేను చెప్తూవున్నస్వీయ చరిత్రలో అతని అసలుపేరు ఉదహరించదలచలేదు; అందు వల్ల అతనికీర్తికి ఏమీ నష్టంకలుగలేదు. నావిషయంలో

అతని ప్రవర్తనకు అనుగుణంగా వుండేలాగు అతనికి నామా చరణబాబు అని నామకరణం చేద్దాము.

వయస్సులో అతను నాకంటే పెద్దవాడేమీ కాదు. కొద్ది రోజుల క్రితమే ఎం. ఎ. ప్రథమతరగతిలో ప్యాసయ్యాడు. దానికితోడు టానీవారగారిచే యోగ్యుడనిసర్టిఫికెట్ కూడాపొంది ప్రొఫెసర్‌గావచ్చాడు. అతను బ్రహ్మసమాజానికి చెందినవాడు. అందుకని మాకెంతో దూరమైనవాడివలె, మాతో ఏవిధమైనసంబంధమూ లేనివాడివలె కన్పించేవాడు. అతడు మాసంఘంలోనిమనిషినిగాని, లేదా మాఈడువాడనిగాని మాకెంతమాత్రమూతోచేదికాదు. ఆధునిక హిందూ సమాజానికి చెందినమేము అతనిని 'బ్రహ్మదైత్యుడు' అని మాలో మేము అనుకొంటూ వుండేవాళ్ళం.

మేము ఏర్పరచుకొన్నతర్కసభకు నేనువిక్రమాదిత్యుడనేగాక అందులో ఒక పండితరత్నాన్నికూడాను. దానికి మొత్తం ముప్పైఆరుమంది సభ్యులు వుండేవారు. అందులో ముప్పైఅయిదుగురిని తీసివేసినా మాసభకువచ్చేనష్టం ఏమీ వుండదు. ఈవిధంగా అభిప్రాయపడేది నేనొక్కడినే కాదు. మిగిలినముప్ఫైఅయిదుగురికికూడా ఇటువంటి అభిప్రాయమే వుండేది.

మాసభయొక్క వార్షికోత్సవసందర్భంలో నేనుకార్లైల్ భావాలనుగురించి ఒకవిమర్శవ్రాశాను. అందరికీ చాలా ఆశ్చర్యంకల్గుతుందని ఆశించాను. నిజానికి అదిఆశ్చర్యంకల్గించాలికూడాను. ఎందుకని అంటే ఆవ్యాసంలో నేను పూర్తిగా కార్లైల్‌ను తీవ్రంగా విమర్శించాను.

ఆసభకు వామాచరణబాబే అధ్యక్షతవహించారు. నాఉపన్యాసం ముగించికూర్చున్నాను. నాభక్తులు, అంటే సహోధ్యాయులంతా నాఉపన్యాసంలో నేను సాహసంతో వ్యక్తంచేసిన తీవ్రవిమర్శను, నేను సంతరించిన ఇంగ్లీషుభాషా పాండిత్యాన్ని చూచిముగ్ధులైపోయారు. ఎదురుచెప్పగల సాహసం చేయలేక ఆశ్చర్యంతో చూస్తూకూర్చున్నారు. మరెవ్వరూ మాట్లాడేవారు లేకపోవటంవల్ల అప్పుడిక వామా చరణబాబే లేచాడు. ఎంతో ప్రశాంతంగా, గంభీరంగా తన ఉపన్యాసం ప్రారంభించారు. నేను చెప్పినదానిని గురించి చెప్తూ అమెరికా దేశపు ప్రసిద్ధవిమర్శకుడైన లవెల్ దొరగారి విమర్శనుంచి నేనుదొంగిలించినభాగాలు చాలా బాగున్నా యనీ, నేనుస్వంతంగా వ్రాసినదానిని దానితో చేర్చకుండా వుంటే బాగుండేదనీ అన్నారు.

ఆనాటినుంచి నాసహపాఠకులకు నాయందుగల భక్తి శ్రద్ధలు క్షీణించిపోయాయి. కాని నాయందు శాశ్వతాను రాగంగల నా భక్తాగ్రగణ్యుడైన అమూల్యచరణునితో కొంచమైనా మార్పురాలేదు. 'నువ్వువ్రాసిన 'విద్యావతి' నాటకాన్ని ఆబ్రహ్మదైత్యునికి చదివివిన్పించాలి. దానిని గురించి ఏమివిమర్శిస్తాడో చూద్దాము' అని అమూల్యచర ణుడు మాటిమాటికినాతో అంటూవుండేవాడు.

విద్యాపతి శివసింహామహారాజుగారి పట్టమహిషి 'లఖి మాదేవిని' ప్రేమిస్తూవుండేవాడు. ఆమె కళ్ళఎదుటకన్పిం చకపోతే కవిత్వంసాగేదికాదు. ఆవిషయాన్ని ఆధారంచేసు కొని దుఃఖాన్వితమైన ఒకపద్యనాటకం వ్రాశాను. అంతకు

ముందు దానిని విన్నవాళ్లు కొందరు దానిలోని కొన్ని ఘటనలు చరిత్రవిరుద్ధమైనవని చెప్పారు. అందుకు జవాబుగా నేను అదిచరిత్రయొక్క దురదృష్టమనీ, ఆఘటనలు చరిత్రలో చేర్చివుంటే అదిఅప్పుడు వాస్తవమైనదీ, ఎంతో రసవంత మైనదీ అయివుండేదని చెప్పాను.

ఇది ఉన్నతశ్రేణిలో లెక్కించదగిననాటకం అని నేనిదివరకే చెప్పాను. అది ప్రథమశ్రేణికి చెందిందంటాడు అమూల్యచరణుడు. నా తెలివితేటల్ని గురించి నాకంటే అమూల్యచరణునికి గొప్పఅభిప్రాయం వుండేది. నా ప్రతి రూపం అతని మనస్సులో ఎంత బ్రహ్మాండమైనరూపం ధరిం చిందో నేనే నిర్ణయించలేక పోయాను.

నా నాటకం శ్యామాచరణబాబుకు చదివి వినిపించ మని అమూల్య ఇచ్చినసలహా నాకేమీ చెడుగా కన్పించ లేదు. ఆనాటకంలో అతను తప్పుపట్టగల్గిందేమీ లేదని నా దృఢవిశ్వాసం. అందుకని మాతరగ సభతరఫున ఒకప్రత్యేక సమావేశం ఏర్పాటుచేసి శ్యామాచరణబాబును ఆహ్వానిం చాము. మావిద్యార్థిమండలి సమక్షాన నాటకం చదివివిన్పిం చాను. శ్యామాచరణబాబు నానాటకాన్ని గురించి విమర్శిస్తూ మాట్లాడాడు.

నానాటకాన్ని గురించి శ్యామాచరణబాబు వెలిబుచ్చిన అభిప్రాయాలను ఇక్కడ విపులంగా తెలియచేయటం నాకు ఇష్టంలేదు. అతనిఅభిప్రాయాలను రెండుమాటల్లో క్లుప్తంగా చెబుతాను. నా ప్రవాలసుగురించి అతనేమీ అనుకోలేదు. నానాటకంలో పాత్రపోషణ బాగులేదనీ, భావాలనుస్పష్టం

చేయలేకపోయాననీ అన్నారు. ఏవో పెద్దపెద్ద భావాలను తెలియచేయ ప్రయత్నించాను. కాని వాటికిసరియైనరూపం ఇవ్వలేక పోవటంవల్ల అవన్నీ వట్టిఛాయామాత్రంగా వుండిపోయాయనిచెప్పారు.

తేలుకు కొండెంచివర విషంవున్నట్లే, వామాచరణ బాబుగారి ఉపన్యాస ఉపసంహారంలో అతనిలోవున్న విషమంతా బయటపడింది. అధ్యక్షులవారు చివరకు నానాటకంలో మూలభాగమూ ఇంకా అనేక దృశ్యాలూ ప్రఖ్యాత జర్మన్‌కవి 'గెతె' రచించిన 'టాసో' అనేనాటకానికి అనుకరణఅనీ, ముఖ్యంగాచాలాచోట్ల అనువాదంకూడాను అని చెప్పి ఉపన్యాసం ముగించారు.

ప్రొఫెసర్ చెప్పినదానికిసూటిగా సమాధానంచెప్పవచ్చు, 'అనుకరణం అయితేకావచ్చు, అంతమాత్రాన అది నిందావిషయం కాదే' అని జవాబిద్దామనుకున్నాను. సాహిత్యలోకంలో చౌర్యం చాలాగొప్పవిద్య. చౌర్యం బయటపడినప్పటికీ కవిత్వానికి వుండేఘనత తగ్గిపోదు. సాహిత్యరంగంలో గొప్పగొప్ప మేధావంతులుకూడా, ఆపనిచేస్తున్నారు. షేక్‌స్పియరువంటివాడుకూడా, ఆపని చేయటానికి సంకోచించలేదు. సాహిత్య ప్రపంచంలో మౌలిక సృజనాత్మకశక్తి (Originality) వున్నవాడే చౌర్యానికి సాహసించగలవాడు. ఇతరులవస్తువునుపూర్తిగా తనదిచేసుకునే శక్తి వుంటుంది గనుకనే అతను అందుకుసాహసిస్తాడు.

వామాచరణబాబుగారు చెప్పినదానిని ఖండిస్తూ ఇంకా ఇటువంటి మంచిజవాబులెన్నో చెప్పవచ్చును.

కాని ఆవాళ నేను ఒక్కజవాబుకూడా చెప్పలేకపోయాను. అందుకు నేను ఆయనయెడల వినయ విధేయతలు చూపించటమనేది కారణంకాదు. వీటిల్లో ఒక్కటికూడా ఆసమయంలో నాకుతట్టకపోవటమే యదార్థమైనకారణం. అయిదారురోజులయినతరువాత ఈజవాబులుఅదృష్టవశాత్తు లభించిన దివ్యాస్త్రాలవలె ఒక్కొక్కటే నామనస్సుకు తట్టసాగాయి. శత్రుపక్షం వాళ్ళెవరూ ఎదురుగాలేకపోవటం వల్ల ఆ అస్త్రాలు నాకేగుచ్చుకోసాగాయి. కనీసం అవి మా సహపాఠకులతోనైనా చెప్పాలనుకున్నాను. కాని వాటిల్లో వుండే సూక్ష్మత మాక్లాసు గాడిదలకు అర్థంఅయిచావదు. వాళ్ళకు అర్థమయింది- చౌర్యం అంటే చౌర్యమే అనేదే. ఇతరదొంగతనాలకు నాదొంగతనానికి ఉన్న తేడా అర్థంచేసుకోగలశక్తి వాళ్ళకువుంటే అప్పుడు వాళ్ళకూ నాకూ ఈ భేదమే వుండేదికాదు.

బి. ఎ పరీక్షకువెళ్ళాను. నెగ్గటం విషయంలో ఏమాత్రం సందేహంలేదు. కాని అదిగుర్తుచేసుకుంటే నా కేమీ సంతోషంగాలేదు. ఆనాడు అధ్యక్షుడు చెప్పిన ఆనాలుగు మాటలతో నాకున్నకీర్తిప్రతిష్టలన్నీ మంటకలిసిపోయాయి. గగనభేది అయిన నాఆశామందిరం ముక్కలై నేలకూలింది. బుద్ధికూలిన ఆ అమూల్యచరణానికి ఒక్కడికిమాత్రం నాయందుండే భక్తి రవ్వంతకూడా తగ్గలేదు. నిత్యమూ సూర్యోదయమైనప్పుడూ, సూర్యాస్తమయమైనప్పుడూ మనసీడఎంతో ఘాఢవుగా పడుతూవుంటుంది; ఆవిధంగానే అమూల్యునిభక్తి నాయెడ సూర్యుడు ఉదయించినప్పుడు ఎలావుందో అస్తమిం

చేటప్పుడుకూడా అలాగే నాపాదాలనుఅంటివుంది, కాని వట్టి నీడమాదిరి, నిస్సారమైన ఆభక్తివల్ల నాకేమీ సంతృప్తి కలుగలేదు. మూఢుడైన భక్తుని హృదయంలో వుండే మోహాంధకారం అది, జ్ఞానానికివుండే ఉజ్జ్వలకాంతి అందులోవుండదు.

## ౨

వివాహంచేసుకోటానికి వెంటనే బయలుదేరి ఇంటికి రమ్మని నాన్న వ్రాశాడు. కాని నేనుకొంతసమయంకోరాను.

వామాచరణబాబుగారివిమర్శ విన్నప్పటినుంచీ నాలో నాకే విరోధంకల్గింది. నాపైన నేనే తిరుగుబాటు ప్రారంభించాను. అదివిన్నతరువాతనుంచీ నాలోవున్న విమర్శకుడు నాలోని రచయితను లోలోపల బాధపెట్టనారంభించాడు.

అందుకు నాలోని రచయిత అంశం 'నేను మరొకటి ఏదైనా వ్రాస్తాను, వ్రాసిచూపిస్తాను, నువ్వుగొప్పో, నేను గొప్పో, అనేది నాలోని విమర్శకునితో.

'విశ్వప్రేమలో ఆత్మసమర్పణకావించుట, శత్రువులను క్షమించుట' అనే విషయాన్ని ఆధారంగా తీసుకొని చాలా ఉదాత్తమైన కావ్యం వ్రాయాలని నేనునిశ్చయించుకొన్నాను. మనదేశంలోని విమర్శకులకు బాగా పనికల్పించగలఘనమైన వస్తువునొకదానిని గ్రాసంగా ఇద్దామని సంకల్పించుకొన్నాను.

మనోహరమైన నిర్జనప్రదేశంలో నివాసంచేస్తూ మహోన్నతమైన కీర్తిని తెచ్చిపెట్టే ఆకావ్యాన్ని ప్రారంభిం

చాలని కూడా నిశ్చయించుకొన్నాను. కనీసంగా ఒక నెల రోజులు బంధుమిత్రులెవరితో కూసంబంధం లేకుండా అటువంటి ప్రదేశంలో వుండి ఆపనిని సాధించాలని దృఢంగా సంకల్పించు కొన్నాను.

ఈ స్థానంతా అమూల్యుడికి చెప్పివస్తూవుంటే అవివి నేసరికి అతడు ప్రమాన్పడిపోయాడు. వాని సూచంగా మన దేశానికి కలుగబోయే మహత్తు యొక్క అపూర్వరేఖలు ఆ క్షణంలో నే అతనికి, నానోసటను కప్పించాయి. గంభీర ముద్రదాల్చి నా చేతిని పట్టుకొని నాముఖంలోకి చూస్తూ 'అన్నా, వెళ్లు. తప్పక వెళ్లు. వెళ్ళి అమరకీర్తి అక్షయగౌరవమూ సంపాదించుకొని తిరిగిరా!' అనిఅన్నాడు

నా ఒడలు పులకించింది. గౌరవం కలుగబోతున్నందుకు గర్విస్తూ, భక్తి విహ్వలుడై మన దేశపు ప్రతినిధిగా వచ్చి అమూల్య నాతో ఆనందిస్తున్నట్లనిపించింది. ఇందులో అమూల్యుడు చేసిన త్యాగం తక్కువైనదేమీ కాదు. దేశంయొక్క కీర్తి ప్రతిష్ఠల కోసం ఒక నెలరోజులు పూర్తిగా నన్ను చూడకుండా వుండటానికి అంగీకరించాడు; దీర్ఘంగా నిట్టూర్చి అప్పుడే నన్ను వదలి ట్రాముతో కార్న్‌వాలీసువీధి లోని తనబసకు వెళ్ళిపోయాడు. అమరకీర్తి, అక్షయగౌరవము సాధించుటకు నేను నిర్ణయించుకొన్న ఫరాశ్ డంగాలో గంగాతీరానవున్న తోటలోనికి బయలుదేరి వచ్చేశాను.

గంగాతీరానవున్న ఆనిర్జన ప్రదేశంలో వెల్లికిలపడుకొని విశ్వప్రేమను గూర్చి ఆలోచిస్తూ ఆలోచిస్తూ గాఢ నిద్రలో మునిగిపోయేవాడిని. తెల్లవచ్చి లేచేసరికి

సాయంత్రం ఐదుగంటలయేది. మనస్సు, శరీరమూ చాలా అలసిపోయినట్లుండేవి. అప్పుడిక కోటలోవున్న చిన్న తోట్లో బెంచీమీదకూర్చొని రోడ్డువెంట వచ్చేపోయే జనాన్ని, బళ్ళనూచూస్తూ కాలక్షేపం చేస్తూవుండేవాడను. మరీఏమీ తోచకపోతే రైలుస్టేషనువరకు వెళ్ళికూర్చొని వచ్చేవాడను; టెలిగ్రాఫ్‌యంత్రాల టకటకలు వినబడుతూవుండేవి. రైలు గంటలు వినిపించేవి. వచ్చేపోయే జనంతో సందడిగావుండేది. రక్తనేత్రాలతో గుప్ గుప్ మంటూ వెయ్యిపాదాల లోహసరీసృపంవచ్చేది. భయంకర శబ్దం చేసుకొంటూ వెళ్ళిపోయేది. ఇదంతా చూడటానికి చాలా సరదాగావుండేది. ఇంటికి తిరిగి వచ్చిన తరువాత, ఎవరూ తోడు లేకపోవటంవల్ల పెందలాడే పడుకొని నిద్రపోయేవాడను. ఉదయమే లేచి చేయవలసిన పనేమీవుండేదికాదు గనుక ఎనిమిది తొమ్మిది గంటలవరకు మంచంవదలి లేచేవాడనుకాదు. శరీరం బాగా చెడిపోయింది. విశ్వప్రేమ అనేదాని దర్శనమే కాలేదు ఇంతవరకూ. ఎన్నడూ ఒంటరిగా వుండే అలవాటులేని నాకు ఆనిర్జన గంగాతీరం స్మశానభూమివలె కన్పించేది. ఆగాడిద, అమూల్యకు కూడా బుద్ధిలేదు – నెలరోజులవరకు ఇటు తొంగిచూడవని చేసిన ప్రతిజ్ఞకు కట్టుబడిపోయాడు.

అంతకుముందు కలకత్తాలోవుంటూ వుండగా నాలో నేను ఎన్నోవూహించుకొంటూ వుండేవాడను – ఈవిధంగా చల్లనినీడనిచ్చే దట్టమైన వటవృక్షం క్రింద కాళ్ళు చాచుకొని కూర్చుంటాను; కాళ్ళదగ్గరకలకలనాదంతో నదీజలంపారుతూ వుంటుంది. చుట్టూ ప్రకృతి సౌందర్యమూ, భావప్రపం

చసూ ఉంటాయి. వాటిమధ్య స్వప్నలోకంలో లీనమైన కవిని నేనుంటాను. నానావిధ పుష్పజాతులతో నిండినచెట్లు, రకరకాల పక్షుల కలరవం, ఆకాశాన నక్షత్రమాలికలు, హృదయంనిండా విశ్వప్రేమ, అప్పుడిక క్షణకాలంకూడా ఆగకుండా కలంలోనుంచి చిత్రవిచిత్రమైన కవిత్వం పుట్టుకొస్తుంది. కాని ఇప్పుడు చూద్దునుకదా - ప్రకృతిఎక్కడ, ప్రకృతికవిఎక్కడ! విశ్వమెక్కడ, విశ్వప్రేమికుడెక్కడ! నేను అక్కడికి వచ్చినతరువాత ఒక్కనాడయినా ఆతోటలో తిరగలేదు. చెట్లమీదపువ్వులు వికసిస్తూనేవుండేవి, ఆకాశాన నక్షత్రాలు ఉదయించేవి, చెట్లనీడ చెట్లక్రిందనేవుండేది; ఇంటిలో పెరిగిననేను ఇంటిలోనే వుండిపోయేవాడిని. నాగో ప్పతనానికి ఇంతవరకు ఏవిధమైన నిదర్శనమూ కన్పించలేదు, దానితో వామాచరణబాబు మీాద నాకున్న ద్వేషము మరింత అధికమవుతూవచ్చింది.

ఆకాలములో మనదేశములో బాల్యవివాహాలను గురించి తీవ్రవాదోపవాదాలు జరుగుతూ వుండేవి. వామాచరణబాబు బాల్యవివాహాలకు వ్యతిరేకి, అతను ఒక అవివాహిత యువతియొక్క ప్రేమను కాంక్షిస్తున్నాడని రహస్యముగా విన్నాను. అది విన్నప్పుడు చాలా కుతూహలము కల్గినదినాకు. ఇంకాఅప్పటివరకు, విశ్వప్రేమను ఆధారముగా తీసుకొని నేను వ్రాయాలనుకొన్న కావ్యానికి ఒకరూపము ఏర్పడలేదు. అందుకని వామాచరణబాబులాంటి హీరోను తీసుకొని 'కదంబకలి' అనేపేరుతో ఒకనాయికను సృష్టించి ఘాటైన ప్రహసనం ఒకటివ్రాశాను. అమరకీర్తికి సోపానము

వేసుకొని కలకత్తాకు తిరిగి వెళ్దామనుకొన్నాను. ప్రయాణా నికి సిద్ధమవుతూవుండగా అడుగులోనే విఘ్నముకల్గింది.

ఒకనాడు, మధ్యాహ్నము కొంచెముబద్ధకముగావుండి స్టేషనుకు వెళ్ళలేదు. నేను నివసించే తోట ఇంటిలోని గదు లన్నీతనిఖీప్రారంభించాను. ఇన్నాళ్లూ నేనాగదుల్లోకిఎన్నడూ పోలేదు, అటువంటిపనులంటే నాకుకుతూహలమూ లేదు, ఇంత వరకు అటువంటి అవసరమూ కలుగలేదు. ఆవాళ మరేమీ పనిలేక కేవలము కాలక్షేపముకోసమని, గాలికి ఎగురుతున్న కాగితము ముక్కవలె అదంతా తిరుగుతున్నాను. ఉత్తర దిక్కున వున్నగది తలుపు తెరచి పక్కనున్నచిన్నవరండాలోకి వచ్చినిల్చున్నాను. ఆ వరండాఎదుట ఉత్తరపుప్రహరీ గోడనుఆనుకొని జంటగా రెండుపెద్దపెద్ద నేరేడుచెట్లున్నాయి. ఆరెండుచెట్ల మధ్యనుంచి ఆపక్కతోటలోని పొగడచెట్ల వరుస కొంతకన్పిస్తుంది.

కాని, అప్పుడు ఇదంతానాకు అంతస్పష్టంగా కన్పించ లేదు, ఆతరువాత సావకాశముగా చూచి తెలుసు కొన్నాను అప్పుడునాకు పదహారేళ్ళ కన్య ఒకామె చేత్తో పుస్తకముపట్టుకొని తలవంచుకొని పుస్తకము చదువుతూ పచారుచేస్తూవుంది. అప్పుడునాకు జీవితతత్వాన్ని గురించి ఆలోచించే శక్తిలేకపోయింది కాని, కొన్నాళ్ళకు నాలో నేను ఈవిధంగా అనుకొన్నాను – దుష్యంతుడు విల్లునంబులు ధరించి వేటకోసమైఅరణ్యానికివెళ్ళాడు. జంతువులేమీలభించ లేదుకాని ఆచెట్లమధ్య అప్పుడతనికి లభించినలాంటి వస్తువు జీవితములో మరెప్పుడూ అతనికిలభించలేదు. నేనూ

అదేవిధముగా కవిత్వానికై బహుమతులు చేరివచ్చాను. అదృష్ట వశాత్తు ఆవిశ్వప్రేమ నన్నుతప్పించుకొని బ్రతికిపోయింది. చూడదగినదేదో ఆరెండు నేరేడుచెట్లమధ్యనుండి నాకు కన్పించింది - అటువంటివి మానవజీవితాలలో ఎప్పుడో ఒకటొక సారి లభ్యమవుతాయి.

ప్రపంచములో నేనుచూడనటువంటివీ, చేయనటువంటివీ ఎన్నోవున్నాయి - నేనెన్నడూ ఓడలో ప్రయాణము చేయలేదు, విమానముఎక్కలేదు, బొగ్గుగనుల్లోకి వెళ్ళలేదు. కాని ఆవాళ ఆతోట యింటిఉత్తరవరండాలోకి వచ్చేవరకు మానసిక విషయాలలోకూడా నాకు అంతర్జ్ఞానమూ, ఆంతర్భ్రాంతివున్నాయని నేనెన్నడూ అనుకోలేదు. నావయస్సు ఇప్పుడు ఇరవై ఒకటి. అప్పటివరకు స్త్రీ సౌందర్యాన్ని గురించి నామనస్సులో ఒకఆదర్శ స్వరూపాన్ని వూహించుకొనివుండ లేదని చెప్పలేను. నా ఆదర్శమూర్తిని అనేక అవస్థలలోనూ, ఎన్నోరకాలవేషభాషలలోనూ వూహించుకొనేవాడను. ఆమె జాకెట్టూ జోడూధరించి చేతిలోపుస్తకముపట్టుకొని ఈవిధముగా కనబడుతుందని నేనుకలలోకూడాఎన్నడూఅనుకోలేదు: కన్పించాలనికూడా కోరుకోలేదు. అయినా, ఆ ఫాల్గుణమాసపు చివరిరోజుల్లో సాయంత్రముకావస్తున్న సమయాన ఆ ప్రాచీనవృక్ష శ్రేణిప్రక్కన, ఆచెట్లనీడలోవున్న పువ్వులవన మార్గములో జాకెట్టూ జోడూ ధరించి, పుస్తకముచేతపుచ్చుకొని నావ్హృదయేశ్వరి రెండునేరేడుచెట్లమధ్యనుంచి హఠాత్తుగా నాకంటపడింది. నేనేమీ మాట్లాడలేదు.

రెండు నిముషాలు ఘూర్తమే ఆమెనాకు కన్పించింది. ఏసందుర్భాలో మంచైనా మాట్లాడాలని చాలా ప్రయత్నించాను. కాని ప్రయోజనమేమీ లేకపోయింది. ఆవాళ సాయంత్రము మర్రిచెట్టుక్రింద కూర్చొనివున్నాను నదికి అవతలగట్టున గుబురుగావున్న చెట్లగుంపు ఒకటి కన్పిస్తూవున్నది. ఆకాశములో ప్రశాంతముగా చిరునవ్వు నవ్వుతూ అప్పుడే సంధ్యతార ఉదయించింది. చూస్తూ వుండగానే సంధ్యశ్రీ తనపతిహీన, నిర్జన, శయ్యాగృహద్వారాన్ని తెరిచి నిశ్శబ్దముగా నిల్చొనివున్నది.

ఆమె చేతిలోవున్న పుస్తకమునాకు రహస్య నిలయమనితోచింది. ఆగ్రంథము ఏమైవుంటుందాఅని ఆలోచన ప్రారంభించాను – అది కావ్యమా, నవలా? అందులో ఏవిధమైన భావాలున్నాయి? తెరచివున్న పేజీమీద సాయంత్రపు నీడ, సూర్యకిరణాలు పడుతున్నాయి. ఎంతోకుతూహలముతో తదేకముగా ఆమెచదువుతున్న ఆపేజీలో కథలోని ఏభాగమువున్నదో? ఆపేజీలో కావ్యములోని ఏభాగము వున్నదో? ఇటువంటి వూహాలతోపాటు నాలోకూడా కొన్ని వూహాలు తలెత్తాయి. అభాగముచదువుతూ వున్నప్పుడు, నిగలోసిన అనల్లనిజుట్టు క్రిందపడుతున్న సుకుమారలలాట మండపముమధ్యన ఎటువంటి చిత్రవిచిత్ర భావావేశము వున్నదో కదా! ఆకుమారి హృదయములోలోపల ఒంటరిగా ఏమధుర లోకాలను సృష్టించుకొంటుందోకదా! ఆనాడు, అర్ధరాత్రివరకు రాత్రులలోకి ఇటువంటివి ఎన్నివూహాలు వచ్చాయో

చెప్పలేను, వాటిని ఇప్పుడు వర్ణించిచెప్పటముకూడా నాకు సాధ్యమయేపనికాదు.

అయితే ఆమె అవివాహిత అనినాకెలా తెలిసింది? పూర్వముఎప్పుడో ప్రేమికుడైన దుష్యంతునికి ధైర్యముచెప్పినవాడే నాకీసంగతి తెలియచేశాడు. మానవునిమనస్సులో వుండేవాసన అతడు; మనుష్యులకు అతడు చాలావిషయాలు చెపుతూవుంటాడు. అందులో కొన్ని నిజమూఅవుతాయి, కొన్ని అబద్ధమూఅవుతాయి దుష్యంతునితో చెప్పినదీ నిజము అయింది, నాతో చెప్పినదీ నిజముఅయింది.

అపరిచితురాలైన ఆపొరుగు అమ్మాయికి వివాహమైనదాకాలేదా, ఆమెదిఏజాతి, బ్రాహ్మణులా, శూద్రులా-ఈవిషయాలన్నీ తేలిగ్గా తెలుసుకోగలిగేవాడనే కాని అందుకై నేనుప్రయత్నించలేదు. అనేకవేల యోజనాలదూరమునుంచి, ముఖముపైకెత్తి నిశ్చలముగా చంద్రునివైపు చూస్తూవుండే చకోరపక్షివలె ఆమెనుచూస్తూ వుండాలని కోర్కె కల్గిందినాకు. మర్నాడు మధ్యాహ్నము ఒకచిన్న నావను అద్దెకుతీసుకొని, నదిలోషికారుకు బయలుదేరాను. తీరమువైపు దృష్టినిలిపాను. ప్రవాహమువాలు వెంట పడవ మెల్లగాపోతూవుంది. గడ వేయవద్దని పడవవాళ్ళతో చెప్పాను. నాశకుంతలవుండే తపోవనకుటీరము నదీతీరానేవుంది. ఆకుటీరము కణ్వమహర్షి కుటీరమువలె లేదు. గంగాతీరము నుంచి ఇంటి వరండావరకు పెద్ద పెద్ద మెట్లున్నాయి. నా నావ ఆ రేవులోకి చేరుకొన్నప్పుడు నా ఆధునిక శకుంతల దర్శనమయింది. వరండాలో కూర్చొనివుంది, ఆమెవెనుక

ప్రక్క ఒకకుర్చీ, దానిమీదనాలుగైదుపుస్తకాలువున్నాయి; విరబోసుకొనివున్న ఆమె కేశరాశి ఆ పుస్తకాలమీద పడివుంది. కుర్చీకి ఆనుకొని కూర్చొనివుంది. ఆమెముఖము అంతస్పష్టముగా కన్పించటములేదు, కాని ఆకోమల ముఖము యొక్క సుకుమార రేఖమాత్రము కనబడుతూవుంది. ఏదో స్వప్నలోకములో వున్నట్టుంది. చేతిలోవున్న పుస్తకముక్రింద జారిపడిందికూడా గమనించలేదు. మూర్తీభవించిన మధ్యాహ్నమహాలక్ష్మివలెవుంది. పాదాలముందు గంగ. ఎదురుగా దూరక్షితిజము, పైన తప్తనీలాకాశము - ఇవన్నీ తమఅంతరాత్మరూపిణి అయిన ఆ యువతివైపు, ఆమెపాదాలవైపు, అలసటతో చాచిన ఆమెచేతివైపు, నిశ్శబ్దముగా, తదేకధ్యానముతో చూస్తున్నాయి.

చూడగల్గినంతసేపు చూచాను - కళ్లునులుపుకొని ఆరెండు పాదాలనూ తన్మయుడనై చూచాను.

నావ ముందుకు సాగిపోయింది. గట్టుమీదవున్న చెట్టొకటి అడ్డువచ్చింది. అప్పుడు హఠాత్తుగా ఏదోగుర్తొచ్చినట్టు 'పడవను వెనక్కితిప్పు, త్వరగాఇంటికివెళ్ళాలి' అని చెప్పాను పడవవానితో. ఇప్పుడు ప్రయాణము చేసేది ప్రవాహానికి ఎదురుగనుక గడవేయకతప్పలేదు. ఆగడ వేసినప్పుడు కలిగేశబ్దం సుకుమారమైన ఆసుందరికి తగులుతున్నట్టనిపించింది. నావతిరిగి ఆమెవున్న రేవువద్దకురాగానే ఆమె కుతూహలముగా తలెత్తి నావైపుచూచింది. ఆతురతతో ఆమెనుచూస్తున్న నాకళ్ళను చూడగానే ఆమెత్రుళ్ళిపడి

అవ్యక్తస్వనాన్ని అభినవలో కొన్ని స్వరపరచిన రాగతాళాల సహాయంతో మానవభాషద్వారా వెలిబుచ్చమని నన్ను కోరుతున్నది. ప్రకృతిరామణీయకత్వానికి ప్రకృతినిర్మాణానుసరణం సాహృదయ తంత్రులను స్పృశించే సుందరీ, ఓ సుందరీ, ఓ మనోహారిణీ, ప్రాణపతాంగాన్ని ఆకర్షించు ఓ దీపశిఖా, ఓ అనంత అపారజీవమా, ఓ అపరిమిత మధురమృత్యువా!' అనేమాటలు అనవరతం నాకు వినబడుతూవున్నాయి. ఆపాట ఎంతకూ ఆగటంలేదు. దానిలోని మాటలను ఒకదానితో ఒకదానిని అన్వయించలేను. దానికి ఒకరూపం ఇచ్చి వ్యక్తంచేయలేను. రాగతాళాలనేర్పరచి దానిని పాడలేను. అనివార్యమైన సముద్రపుపోటువంటి వర్ణనాతీతమైన శక్తియేదో నాలో జనించుతుందని తెలిసింది. ఇంతవరకు దానిని స్వాధీనపర్చుకో లేకపోయాను-స్వాధీనపర్చుకోవటమే జరిగినప్పుడు నాకంఠంలోనుంచి అత్యంత మధురమైన సంగీతం వెలువడుతుందని నావిశ్వాసం. ఆసమయాన నాలలాటభాగం దివ్యతేజస్సుతో భాసించుతుంది.

నేనీ ఆలోచనల్లో మైమరచివున్న సమయంలోనే ఒక పడవ నేనున్న ఇంటిదగ్గర రేవులోకివచ్చి ఆగింది. చంకలో గొడుగు, భుజంమీదకండువాతో అమూల్య నవ్వుతూ పడవదిగాడు. అకస్మాత్తుగా నాస్నేహితుని చూడగానే నాలో కల్గిన భావోద్రేకం శత్రువులయందుకూడా ఎవరికి కలగకూడదని నాకోర్కె. మిట్టమధ్యాహ్నం రెండుగంటలవేళ, ఒంటరిగా మర్రిచెట్టుక్రింద పిచ్చివానివలె కూర్చొనివున్న నన్ను చూచి అమూల్యునికి చాలా ఆశకల్గింది. మనుష్యుల పాదధ్వనివిని నిరాశచెంది రాజహంస నీటిలోకి పారిపోయినట్లుగా

సర్వ శ్రేష్ఠమైన నాకవిత్వానికి ఎక్కడ భంగంకల్గుతుందో అని భయపడ్డట్టు అమూల్య మెల్లగా అడుగులు వేసుకొంటూ నేనున్నచోటుకు వస్తున్నాడు. ఆవైఖరిచూచికోపంతో 'ఏమిటి సమాచారం అమూల్యా! కాలిలోముల్లు గుచ్చుకొన్న దావేం?' అని అడిగాను. నేనేదో అద్భుతమైనమాట మాట్లాడినట్లుగా అమూల్య నవ్వుతూ నాదగ్గరకువచ్చాడు. కండువాతో నేలమీది దుమ్ముదులిపి జేబురుమాల పరచి తాపీగా కూర్చున్నాడు. 'నువ్వు వ్రాసిపంపిన ఆప్రహసనం చదివి నవ్వుఆగక చచ్చాననుకో' అనిఅంటూ అమూల్య ఆప్రహసనంలోని మాటలుచెప్తూ ఊపిరాడక ప్రాణాలెక్కడపోతాయో అన్నట్టుగా నవ్వసాగాడు. నేను కవిత్వం వ్రాసినకలం ఏచెట్టుకొమ్మతో తయారయిందో ఆచెట్టును మొదలంటా ఊడబెరికి దానితోమంటవేసి నాకవిత్వాన్ని ఆమంటలోవేసి తగలబెట్టినా అప్పుడు నాకుకల్గినదుఃఖం చల్లారదనిపించింది నాకు.

'నీకావ్యం ఎంతవరకువచ్చింది?' అని అడిగాడు అమూల్య కొంటెగాంపంకించిస్తూ. ఆప్రశ్నవిని నాకుఒళ్లుమండిపోయింది. 'నాకావ్యమూ, నీబుద్ధీ రెండూ ఒకమాదిరివే!' అని అనుకున్నాను మనస్సులో. 'ఆవిషయాలన్నీ తరువాత మాట్లాడుకుందాము, ఇప్పుడు నన్ను విసిగించకు' అన్నాను అతనితో.

ఎక్కడ ఏమున్నదో అన్నీ చూడాలనే కుతూహల స్వభావం గలవాడు అమూల్య. అందుచేత భయపడి ఉత్తరం [illegible] వున్న తలుపుమూసివేశాను. అదిమాచి. '[illegible]

ఏమున్నదో?' అని అతడు అడగనే అడిగాడు. 'అబ్బే, ఏమీ లేదు' అని జీవితంలో ఎన్నడూ ఆడనంత అబద్ధం ఆడేశాను.

రెండురోజులపాటు ఎన్నివిధాల విసిగించాలో అన్ని విధాలా నన్ను విసిగించి మూడోరోజు సాయంత్రం రైలుకు అతడు వెళ్ళిపోయాడు. ఆ రెండురోజులూ నేను తోటఉత్తర భాగంవైపు తొంగిచూడనైనాలేదు, ఎవరికంటపడకుండా లోభి తన రత్నాలరాశిని దాచుకున్నంత జాగ్రత్తగా రెండు రోజులూ నేను తోటఉత్తరభాగాన్ని కాపాడుకొంటూ తిరి గాను. అమూల్య అటువెళ్ళిపోగానే పరుగుపరుగున పైకివెళ్ళి ఉత్తరంవైపు తలుపుతెరచి వరండాలోకివచ్చి నిల్చున్నాను.

ఆకాశం ఎంతోనిర్మలంగా వుంది. కృష్ణపక్షపు తొలి దినాల్లోవుండే లేతవెన్నెల గుబురుగావున్న చెట్లతోదోబూచు లాడుతూ వుంది. కిందనురాలివున్న ఆకులగలగల, సువా సనలు విరచిమ్మే పొగడపూవులు నిశ్చలంగావున్న ఆతోట లోని గాఢనిశ్శబ్దత పీటినిపూర్తిగా నింపివేసింది. అటువంటి సమయమందు నాపొరుగు ఇంటిలోవుండే యువతి వృద్ధుడైన తనతండ్రిచేతిని పట్టుకొని, ఏవోకబుర్లు చెబుతూ పచారు చేస్తూ వుంది. ఆవృద్ధుడు కుమార్తె చెప్పేమాటలు చాలా శ్రద్ధగా వింటున్నాడు. తండ్రీకుమార్తెల సంభాషణ చాలా శాంతంగా జరుగుతూవుంది. గంగానదిలోనుంచి మధ్యమధ్య విన్పిస్తూవున్న తెడ్లచప్పుడు చీకటిపడుతున్నకొద్దీ దూరమవు తూవచ్చింది. నాహృదయం ఆనందంతోనో, వేదనతోనో నిండి పగిలిపోతుందేమో అనిపించింది. వెలుగు నీడలతో నిండి వున్న నేలమీద అంతటా నాఅస్తిత్వంవ్యాపించి భూమిలో

ఏకమై పోయినట్టుంది. యువతి తన మెత్తని పాదాలతో నా గుండెపైన నడుస్తున్నట్టుగా, చుట్టూవున్న తరుపల్లవాలతో ఐక్యమైపోయిన ఆ యువతియొక్క మధుర స్వరం వినిపిస్తున్నట్టనిపించింది. చుట్టూవున్న సూక్ష్మ ప్రకృతియొక్క అంతర్వేదన నాహృదయంలో ప్రతిధ్వనిస్తూవుంది. భూమి ఆయువతి పాదాలక్రిందనే వుండికూడా మీదనడిచే ఆమెపాదాలను పట్టుకోలేక పోతున్నందుకు ఎంత బాధపడుతుందో నేను గ్రహించాను. క్రిందికి వంగివున్న చెట్లు వారిమాటలను విని కూడా అర్థంచేసుకోలేక దుఃఖిస్తూ ఆకుల గలగలద్వారా పిచ్చిగా కేకలు వేయప్రయత్నిస్తున్నాయి. అమృతమైన నడకనూ, ఆప్రశాంత సంభాషణనూ మనసారా అనుభవించి ఆనందించాను. కాని వారిమాటలు వినలేకపోయినందుకు ఎంతో దుఃఖించాను.

మరినాలోని ఓర్పునశించింది. ఆమర్నాడు ఉదయమే ఆమెను కలుసుకుందామని వాళ్ళఇంటికి వెళ్లాను. భవనాథ్ బాబుగారు కళ్ళజోడుపెట్టుకొని నీలిరంగు గీతలుపెట్టిన హామిల్టన్ గ్రంథమేదో ఏకాగ్రతతో చదువుతున్నారు—పక్కనే బల్లమీద ఒకపెద్దకప్పునిండా టీవుంది. నేనుగదిలో అడుగు పెట్టగానే సులోచనాల మీదినుంచి పరధ్యానంగా నావైపు చూచారు— పుస్తకం మీదనుంచి వెంటనే మనస్సుమరలించుకోలేక పోయారు.

ఆమరుక్షణంలోనే త్రుళ్ళిపడి ఆతిథ్యంమాట గుర్తు వచ్చి తడబడుతూ లేచారు. క్లుప్తంగా నన్ను నేను పరిచయం చేసుకొన్నాను. ఆయనకళ్ళజోడుకేసుకోసం వెదికారు, అది

అక్కడకన్పించలేదు. వెంటనే నన్నుద్దేశించి 'టీ త్రాగుతారా?' అని అడిగారు ఎంతో ఆదరంగా.

నాకు టీ అలవాటు లేకపోయినప్పటికీ 'అభ్యంతరం లేదు' అనే అన్నాను. భవనాధబాబుగారు కంగారుగా లేచి 'కిరణ్, కిరణ్' అని కేకవేశారు.

'ఏమిటి నాన్నగారూ?' అని ద్వారం దగ్గరనుంచి ఎంతో మధురంగావున్న కంఠం వినిపించింది. నేను ఆవైపు చూచేసరికి ఆకర్షణీయమైన కన్య అకస్మాత్తుగా నన్ను చూచి బెదిరిన లేడిపిల్లలాగ లోనికి పారిపోతూవుంది. భవనాథ్ బాబుగారు మళ్ళీ ఆమెను పిలిచి 'వీరు మహేంద్రకుమార్ బాబు. మన పక్కింటిలో వుంటున్నారు' అని ఆమెతో చెప్పి, 'ఈమె నాకుమార్తె కిరణ్ బాల' అని నాతో చెప్పారు. ఆమె ఎంతో వినయంగా నాకు నమస్కారం చేసింది. నేనూ ప్రతినమస్కారం చేశాను. భవనాధబాబుగారు కుమార్తెతో 'మహేంద్ర బాబుగారికి టీ తీసుకురా అమ్మా' అని చెప్పారు. ఏమి మాట్లాడాలో ఏమీ తోచక సిగ్గుతో తలవంచుకుని వున్నంతలో కిరణ్ టీ తీసుకుని రావటానికి లోనికి వెళ్ళిపోయింది.

ఆనాటినుంచీ ఇక నేను నిత్యమూ భవనాధబాబుగారి అతిథినే. ప్రతిరోజు ఉదయము, సాయంత్రము టీ త్రాగటం ఇప్పుడు నాకొక దుర్వ్యసనమై పోయింది.

నేను బి. ఎ. పరీక్షకోసమని చదివిన ఒక జర్మను పండితుని దర్శనశాస్త్రగ్రంధంలోని తత్వవిషయాలను గురించి వాదనచేయుటకు అక్కడికి వస్తూవున్నట్లు నటించాను. భవనాథబాబుగారు ఇంకా హెమిల్టన్ లాంటి ప్రాచీన తత్వజ్ఞుల

గ్రంథాలనే ఇంకాపట్టుకొని కూర్చోవటంచూచి, నేనుజాలి చెంది, ఆధునిక కాలానికి చెందిన కొత్తవిషయాలను ఎంతో ఆడంబరంగా వ్యక్తంచేసేవాడను. భవనాథ్ బాబుగారు అతి సాధుస్వభావం గలవారు. ప్రతివిషయంలోనూ ఆయనకి సంకోచమే. నావంటికుర్రవాడి అభిప్రాయాలుకూడామన్నించే వారు. వాటికి వ్యతిరేకంగా తానేదైనాఅంటే నామనస్సు ఎక్కడబాధపడుతుందోనని భయపడేవారు కిరణ్ ఏనాడూ మావాదనలో కల్గించుకొనేది కాదు. ఏదో ఒకనెపంతో ఇంట్లోకి వెళ్ళిపోయేది. అదిచూచి కొంచెంవిచారం కల్గినా అందుకు నాలోనేను గర్వపడుతూ వుండేవాడను. మేము చర్చించే తత్వవిషయాలు కిరణ్‌కు తేలిగ్గా బోధపడవనీ, నావిద్యాగిరి శిఖరంయొక్క ఎత్తును నిర్ణయించాలంటే ఆమె పైకి చూడాలని నాఉద్దేశం దూరంనుంచి చూస్తున్నం తసేపు ఆమెను అనేకవిధాల వూహించుకొంటూ, శకుం తలఅనీ, దమయంతి అనీ పేర్లు పెట్టేవాడను. ఆఇంట్లో ఇప్పుడు నాకుకన్పించింది సాక్షాత్తుకిరణ్ కాని కావ్యనాయి కల ఛాయారూపంకాదు. అనేక శతాబ్దాలనాటి కావ్య లోకంనుండి దిగి, అనాదిగాయువకుల మనోస్వర్గంలో వున్న తనహోదాను వదులుకొని ఒకానొక హిందూగృహంలో కన్యకారూపాన అవతరించింది. ఆమె నామాతృభాషలోనే సాధారణమైన వాడుకమాటలతోనే నాతోమాట్లాడుతూ వుంది. మామూలుమాటలకే ఆమెచాలా సరళంగా నవ్వు తూవుంటుంది. సాధారణంగా ప్రతిఅమ్మాయికి వున్నట్టు ఆమెరెండుచేతులకూ రెండేసి గాజులున్నాయి. ఆభరణాలా

తగా లేకపోయినా బహుశా ఖరీదైన బంగారుహారం ఒకటి వున్నది.

ఆమెను చూచినప్పుడు నాకుఎంతో ఆనందంగావుం డేది. ఇటువంటి, వూహాతీతమైన, యదార్థమైన ఆమె సాక్షాత్తు కిరణమే.

'జ్ఞానికి మితిఅంటూవున్నదా, లేదా! జ్ఞానంలో అమోఘ జ్ఞానమంటూ ఏదైనావున్నదా!' అనేవిషయాన్ని గురించి ఒకనాడు భవనాథబాబుతో నా తెలివితేటలన్నీ ఉప యోగించి చాలా ఉత్సాహంగా వాదిస్తున్నాను. వాదన ప్రారంభమై కొంచెంసాగేసరికి కిరణ్ లోపలినుంచి కుంపటి వంటసామాన్లు తీసుకొని పక్కవసారాలోకి వచ్చింది.

'నాన్నగారూ, అటువంటి చిక్కువిషయాలనుగురించి వాదిస్తూ మహేంద్రబాబుగారిని ఎందుకలావాగిస్తారు!' అని అంది తండ్రితో. తరువాత నావేపుతిరిగి' మహేంద్రబాబు గారూ, మీరిటురండి. నాకు వంటసాయంచేయండి, అంత కంటె ఇదిచాలాలాభిస్తుంది' అనిఅంది.

ఆవిషయంలో ఆవృద్ధుని దోషమేమీలేదని కిరణ్‌కు తెలియకపోలేదు. అయినా ఆయన తప్పుచేసిన వానివలె కొంచెంవిచారించి, చిరునవ్వునవ్వుతూ 'నిజమే అని ఒప్పు కున్నాడు తాను అంతకుముందు చదువుతూవున్న గ్రంథాన్ని అందుకొంటూ 'సరే, ఆ విషయాన్నిగురించి మరొకసారి చర్చిద్దాం' అన్నాడు.

మరొకనాడు సాయంత్రం భవనాథబాబుగారింటికి వెళ్ళి ఇంకొక గంభీరవిషయాన్ని గురించి వారికి నా అభి

ప్రాయం తెలియజేశాను. అదివిని ఆయన ఆశ్చర్యపోయాడు. ఇంతలో కిరణ్ అడ్డువచ్చి 'మహేంద్ర బాబుగారూ, అబలకు మీరు కొంచెం సాయంచేయాలి. నాకు అందకుండా వుంది, ఈ మేకులుకొంచెం పైనకొట్టాలి' అనిఅంది. నేనుచాలా ఆనందంగాలేచి వెళ్ళాను. భవనాథబాబుగారుకూడా మిక్కిలి ఆనందంతో తిరిగి తన గ్రంథ పఠనంలో మునిగిపోయారు.

ఈవిధంగా నేను ఏదోఒక గొప్పవిషయాన్ని పురస్కరించుకొని భవనాథబాబుగారితో వాదిస్తూవుండేవాడను. సరిగ్గా అదేసమయానికి కిరణ్ అడ్డువచ్చి ఏదోఒక నెపంతో మావాదనను ఆపివేసేది. అందువల్ల నాశరీరం పులకిస్తూ వుండేది. నాదొంగతనం దొరికిపోయిందని గ్రహించాను. భవనాథబాబుగారితోవాదిస్తూకూర్చోవటం నాకెంతమాత్రమూ ఆనందంగా వుండదనేవిషయం ఆమె ఎలాగో గ్రహించింది.

బాహ్యవస్తువులకూ మనఇంద్రియ జ్ఞానానికీగల సంబంధాన్ని గురించివాదిస్తూ అంతూదరీలేని వ్యూహంలో దిగబడి వుండగా ఒకనాడు అకస్మాత్తుగా కిరణవచ్చి 'మహేంద్ర బాబూ, నేనుపెంచే వంగతోటచూద్దాం రండి' అని పిలవటం వల్ల బ్రతికిపోయాను.

మరొకనాడు 'ఈఆకాశం అనాదని మనఅనుమానం మాత్రమే, మన అనుభవానికీ, ప్రాణానికీ మించి ఎక్కడో దానికి అంతులంటూ వుండటం ఎంతమాత్రం అసంభవం కాదు' అని నాఅభిప్రాయాన్ని వ్యక్తంచేస్తూవుండగా అకస్మాత్తుగా కిరణ్ అక్కడికివచ్చి 'మహేంద్రబాబూ, ఈ

కొమ్మన కెందుకు నువ్వు వెతుక్కున్నావు, మీరొకసారి ఇటు వచ్చి కొమ్మ కిందికి వంచి పట్టుకోవాలి అని అంది.

ఈవిధంగా ప్రతిపర్యాయమూ అంతూపంతూలేని ఆవాదననుంచి బ్రతికిపోయేవాణ్ణి - అప్పుడు నాకు సముద్రం మధ్యనుండి క్షణంలో బ్రతికి దరిజేరినట్టు అనిపించేది. అనంత ఆకాశమూ, కావ్యవస్తువులూ - వీటి సంబంధించిన సంశయాలు దుర్భేధ్యమైనవి కావచ్చునేమో కాని, వంకతోటలు, మామిడిచెట్లు-వీటిల్లో ఎటువంటిసంశయానికీ తావు లేదు. ఇవి కావ్యవస్తువులు కాకపోవచ్చునేమోగాని సముద్రం మధ్య వుండే ద్వీపంవలె అతిమనోహరమైనవి. గంటలకొద్దీ ఈదుతూ వున్న మనిషికే కాలికి నేలతగలటంలో వుండే ఆనందం తెలుస్తుంది. నేను ఇంతకాలంనుంచి వూహాలతో నిర్మించుకున్న ప్రేమసముద్రం వాస్తవమైనదే, అయితే అందులో చిరకాలమూ ఏవిధంగా తేలుతూవుంటానో చెప్పలేను. అక్కడి ఆకాశము అనంతం, మనం ప్రతిరోజూ ఇక్కడ చేస్తూవుండే సాధారణమైన పనులకు అక్కడ తావులేదు. సామాన్యవిషయాలకు అక్కడ అవకాశంలేదు. అక్కడ లయరాగయుక్తమైన సంగీతం ద్వారానే మనభావాలను వ్యక్తంచేస్తూవుండాలి. కాలు ఆనించటానికి ఎక్కడా నేలఅందక మునిగిపోతూ వున్నప్పుడు జుట్టుపట్టుకొని నన్ను బయటికి లాగితీసుకొచ్చింది. కాలికింద నేలతగిలి నేను బ్రతికిపోయాను. వసారాలో కుర్చీ పట్టుకొని యింటెదుట ఎండలోనూ, నిచ్చెనఎక్కి గోడకు మేకులు కొట్టటంలోనూ, గుబురుగా వున్ననిమ్మచెట్టు ఆకుల్లో దాగివున్న నిమ్మకాయలు వెతికికోయటంలోనూ వూహించ

లేనంత ఆనందం పొందవచ్చునని నేను కనిపెట్టాను. ఆ ఆనందంకోసం అక్కడ ప్రయాస పడనవసరంలేదు. ఆలోచించి మాట్లాడాల్సిన పనిలేదు. నిస్సంకోచంగా నవ్వేయవచ్చు. ఏకాంతం వెలుగు, నీడలభించినా అవేచాలు. ఇవికాక నాదగ్గర నయనావ్వానంఅనేసువర్ణమంత్రదండం ఒకటివుండేది ప్రేమఅనే పాశుపతం వుండేది ఆత్మవిశ్వాసమనే అక్షయ కల్పతరువువుండేది. నేను ఇంద్రుడను, నాకేదీ అడ్డులేదు. కిరణ్ నాదే అనటంలో ఏమాత్రమూ సందేహంలేదు. ఆమాట ఇంతవరకు నేనుస్పష్టంగా చెప్పలేదు. కాని ఆవార్త నాహృదయంలో ప్రతిధ్వనిస్తూ పరుగులెడుతూవుంది. కిరణ్ నాదే. ఇంతకుపూర్వం బంధువులుకాని స్త్రీలెవరితోనూ నాకుపరిచయంలేదు. కాలేజిల్లో చదివి ఘోషావదలి బయటకు వచ్చిన ఈనాటి యువతుల నీతినియమాలను గురించినాకేమీ తెలియదు. కనుక వాళ్ళనడవడిలో విశిష్టతనుదాటి ఎటువంటివి ప్రేమోద్రేకం అనిపించుకుంటుందో నాకు తెలియదు. నాలో ఏవిధమైన కొరతలేదుగనుక నన్ను ప్రేమించనివాళ్ళు ఎవరూ వుండరనిమాత్రం నాకు తెలుసు.

కిరణ్ నాకుకప్పుతో టీ అందించినప్పుడు ఆటీతో పాటు దానినిండా ప్రేమకూడా నాకులభించేది దానినిస్వీకరించి నేనుసార్థకం చేసేవాడను. ప్రతిరోజూ నేను వెళ్ళిపోయేటప్పుడుఆమెనాతో మహేంద్రబాబూ రేపుఉదయమేవస్తారు కదూ 'అనిఅడిగేది. 'ఎనిమిది ఆవకముందేవస్తాను' అని నేను జవాబుచెప్పేవాడను. కాని ఈమామూలు మాటలలో మాయిద్దరికీకూడా ప్రణయగీతాలు విన్పించేవని నా విశ్వాసం.

ఎప్పుడూ నా హృదయం ఆనందామృతంతో నిండి వుండేది. నా వూహాలు, ఆలోచనలు లతలవలె అల్లుకొని ఆమెను నాతో కలిపి బంధించివుంచేవి. అవకాశం లభించిన శుభదినాలలో, కిరణ్‌చేత ఏమిచదివించాలి, ఆమెకు ఏమి నేర్పాలి, ఏమి విన్పించాలి, ఏమిచూపించాలి అనే లెక్క లేనన్ని ప్రశ్నలు నామనస్సులో ఎల్లప్పుడూ రాజ్యంచేస్తూ వుండేవి. జర్మనుపండితుడు వ్రాసిన ఆధునిక దర్శనశాస్త్రాన్ని గురించికూడా ఆమెలో కుతూహలంకలిగించాలని నిశ్చయించుకొన్నాను. లేకపోతే ఆమెనన్ను పూర్తిగా అర్థం చేసుకోలేదు. ఇంగ్లీషులోవున్న మధురమైన కావ్యాలను ఆమె స్వయంగా చదువుకోగలిగేట్టుకూడా చేయాలి.

'కిరణ్, నీవుపెంచిన వంగతోట ఇంతవరకు నాకుపరిచయంలేని కొత్తరాజ్యము. అక్కడవంకాయలు, గాలికి రాలిన మామిడికాయలు మాత్రమే దొరుకుతాయనుకున్నాను. దుర్లభమైన అమృతం ఇంత తేలిగ్గా లభించగలదని నేనెన్నడూ అనుకోలేదు. కానితగినశుభసమయంవచ్చినప్పుడు నేనుకూడా నిన్ను ఆశ్చర్యపరిచే రాజ్యంలోకి తీసుకువెళ్తాను- అక్కడ వంకాయలుతేనిలోటు నీకు కన్పించదు, అదిజ్ఞాన రాజ్యము, భావస్వర్గము.

సూర్యాస్తమయసమయాన ఆకాశంలోని నక్షత్రాలు వెలవెలబోతూ వుంటాయి. చీకటి దట్టమవుతున్నకొద్దీ మరింత స్పష్టంగా ప్రకాశిస్తాయి. అదేవిధంగా కిరణ్‌లోని నారీత్వం ఆనందంవల్ల లావణ్యంపొంది స్పష్టమయింది. ఆమెస్వగృహంలో తనప్రపంచపు ఆకాశంమధ్యనుంచి చుట్టూ మంగళ

జ్యోతిని వెదజల్లుతూ వున్నట్టుంది. ఆకాంతే నాఆందోళిత హృదయసముద్రంమీద పడి ప్రతిఅలపైన కిరణ్ యొక్క మధురహాసం ముద్రించి అంతటా వెలుగువిరజిమ్మింది.

ఇంతలో నా సెలవులు అయిపోవచ్చాయి పెళ్లి చేసుకోటానికిరమ్మని నాన్నగారు వ్రాసేఉత్తరాలు కఠిన ఆదేశాలను మోసుకొస్తున్నాయి. ఇటు అమూల్యనుకూడా అట్టే కాలం ఆపివుంచటం సాధ్యంకాదు. రాక్షసుడిలా ఈనందన వనంలోకి ఏనాడు విరుచుకుపడతాడో అని భయంగావుంది. నాకోర్కెను వ్యక్తంచేసి ప్రేమను పరిణయరూపంలోకి తేవటం ఎలాగాఅని ఆలోచించసాగాను

ఒకనాడునేను మధ్యాహ్నంవేళ భవనాథబాబుగారి ఇంటికివెళ్ళేసరికిఆయన ఎండవేడికి కుర్చీమీదే వెనక్కివాలి నిద్రపోతున్నారు. ఎదురుగావున్న గంగఒడ్డున మెట్లమీద కూర్చొని కిరణ్ ఆంగ్లకావ్య సంకలనం చదువుతూవుంది. నేనువెళ్ళినప్పుడు ఆమెషెల్లీ కవిరచించిన పద్యంఒకటి చదువుతూవుంది-ఆపద్యంపక్క ఎర్రపెన్సిల్ గీతవుంది-ఆపద్యంచదివి దీర్ఘనిశ్వాసవదలి ఆమె కలగంటున్నదానివలె ఆకాశంవేపు చూస్తూవుంది. అనేక ఆలోచనలతో ఆనందావేశంవల్ల పులకరించిన నాహృదయాన్ని స్థిమితపర్చుకొనిఅతిసహజంగా అడిగినట్టు 'ఏమి చదువుతున్నారండీ?' అని అడిగాను. స్వప్నలోకంలో విహరించే ఆమెనావ హఠాత్తుగా ఆగిపోయింది. కిరణ్ త్రుళ్లిపడి పుస్తకంమూసి పైట కొంగుచాటున దాచేసింది. నేనునవ్వుతూ 'ఆపుస్తకం నేనొకసారి చూడవచ్చునా?' అని అడిగాను. ఆమెకంగారుపడుతూ 'వద్దండీ వద్దండీ' అన్నది.

మిట్టమధ్యాహ్నం, అంతానిశ్శబ్దంగావుంది. గంగానది చిరుకెరటాల కలకలధ్వని కరుణారసంతో నిండిన జోలపాటవలె వుంది. నేను రెండుమెట్లు కిందకు కొంచెందూరంగా కూర్చొని ఇంగ్లీషు కావ్యసాహిత్యాన్ని గురించి చెప్పనారంభించాను.

కిరణ్ తడబడపడుతూ 'నాన్నగారు ఒక్కరేకూర్చున్నారు, ఆకాశంయొక్క అనంతాన్ని గురించి చర్చించరా!' అనిఅంటూ అక్కడినుంచి లేచివెళ్ళిపోయింది. అనంతాకాశం శాశ్వతంగా వుండేదే. దానిని ఛేదించిన చర్చకూడా ఎన్నటికీ అంతంకాదు. కాని మానవజీవితం శాశ్వతంగా వుండేది కాదు, దానిలో మనకులభించే శుభసుఘడియలు చాలా తక్కువ.

'నేను వ్రాసినపద్యాలు చదివివినిపిస్తాను' అన్నాను నేనుకిరణ్‌తో, 'రేపువింటాను' అని జవాబుచెప్పి ఇంటి ద్వారంవేపుచూస్తూ 'నాన్నా, మహేంద్రబాబుగారువచ్చారు' అనిఅంది.

భవనాథబాబు చిన్నపిల్లాడివలె త్రుళ్ళిపడి నిద్రలేచి కళ్ళునులుముకుంటూ కంగారుగా ఇటుచూచాడు, నాకేదో గుండెలో పొడిచినట్టయింది. భవనాథబాబుగారితో అనంతాకాశాన్నిగురించి వాదన ప్రారంభించాను. నిరాటంకంగా చదువుకోవచ్చునని కాబోలు కిరణ్ పుస్తకంతీసుకొని మేడమీదికి వెళ్ళిపోయింది.

ఆమరునాడు ఉదయంపోస్టులో బి. ఎ. పరీక్ష ఫలితాలు ప్రకటించినస్టేట్స్‌మన్ పేపరువచ్చింది. మొదటితర

గతిలో పాసయినవాళ్ళలో మొదటకిరణ్ బాల, వంద్యో పాధ్యాయ అనే పేరువుంది. నా పేరు ఏ తరగతిలోనూ కన్పించ లేదు. నేనుపరీక్షతప్పాను అనే బాధతోపాటు పిడుగుపడ్డట్టుగా ఒకసందేహం బాధించసాగింది. కిరణ్ బాల, కిరణ్ బాల వంద్యోపాధ్యాయ ఒక్కరేకాదుగదా! ఆమె కాలేజీలో చదువు తున్నట్టుగాని, పరీక్షఇచ్చినట్లుగాని నాకు తెలియనేలేదే? ఆతండ్రికూతుర్లు తమవిషయాలు ఎన్నడూ నాతో ఏమీ చెప్పనేలేదు ఎప్పుడూ నేను నాపాండిత్యము, నాచదువు, నాసంగతులు చెప్పటమేతప్ప వాళ్ళను ఏమీ అడగనేలేదు.

కిరణ్ బాల ఈమే అయితే దర్శనశాస్త్రంలో ఆనర్సు శ్రేణిలోనూ, ఇంగ్లీషులో ప్రథమశ్రేణిలోనూ ప్యాసయింది.

చివరకు నన్ను నేను వూరడించుకొని 'అయితేకానీ' నాజయపతాకం నాకావ్యాలు వుండనేవున్నాయి' అని అను కొన్నాను. నేనువ్రాసిన కవిత్వపుస్తకంతీసుకొని ధీమాగా తలెత్తుకొని జోరుగా అడుగులువేస్తూ భవనాథబాబుగారి ఇంటికివెళ్లాను.

అప్పుడు ముందుగదిలో ఎవరూలేరు. ఆముసలాయన పుస్తకాలన్నీచూచాను. నేనుచెప్పిన జర్మను పండితుని దర్శ నశాస్త్రం అజాగ్రత్తగా ఒకమూల పడేసివుంది. ఆ పుస్తకం తెరిచిచూచాను. దానినిండా ముసలాయన వ్రాసిన నోట్సు కన్పించింది. అయితే, భవనాథబాబుగారే కుమార్తెకు ఈపు స్తకంబోధించి వుండాలి!

రోజుకంటె భవనాథబాబుగారిముఖం చాలాసంతో షంగా వున్నట్టుకన్పించింది, నాకు నేనుగర్వంగా నవ్వుతూ

'భవభనాథబాబుగారూ, నేను పరీక్షతప్పాను' అనిచెప్పాను. కాలేజీ పరీక్షలోతప్పినా జీవితపరీక్షలో ప్రథమశ్రేణిలో నెగ్గాననుకొన్నాను. పరీక్షలలోనూ, వ్యాపారంలోనూ, ఉద్యోగంలోనూ కార్యసాఫల్యం పొందటం మధ్యముల లక్షణం. బాగాపైవాళ్ళకు, బాగాకిందివాళ్ళకు, ప్రతివిషయంలోనూ అపజయం పొందేశక్తి అధికంగా వుంటుంది. భవనాథబాబుగారి చూపులోజాలీ, ప్రేమా నాకుస్పష్టంగా కన్పించాయి. తనకుమార్తె వ్యాసంబున విషయం నాతోచెప్పలేక పోయారు. కాని నేనుప్రదర్శించిన అసందర్భపు ఆనందానికి ఆయనకు ఆశ్చర్యంకల్గింది. నాగర్వానికి కారణంఏమిటో గ్రహించుకోలేకపోయారు.

అదేసమయంలో మా కాలేజి కొత్తఉపాధ్యాయుడు వామాచరణబాబుగారితోకలిసి కిరణ్‌గదిలోకి వచ్చింది. నిర్మలమైన వర్షపుజలంతో కడగబడిన లతవలె కిరణ్‌ముఖం ఎంతోకాంతిగావుంది. నాకుఅంతా అర్థమయింది. నాఇంటికి తిరిగివచ్చి నాకవిత్వగ్రంథాన్ని మంటలోవేసి తగలబెట్టాను.

గంగానదితీరాన వ్రాయాలనుకొన్న కావ్యం వ్రాయలేకపోయాను గాని నాకుజీవితంలో దానిఅనుభవం సాక్షాత్తుగానే ప్రాప్తించింది.

---

# సంపాదకుడు

నాభార్య బ్రతికివున్నరోజుల్లో నాకుమార్తె ప్రభ విషయం నేనంతగా పట్టించుకోనేవాడనుకాను. అప్పుడు నేను ప్రభనుగురించికాదు. ప్రభతల్లినిగురించి ఎక్కువ ఆలోచించే వాడను.

అమ్మాయి ఆటాపాటాచూచి ఆనందించేవాడను. ఆమెయొక్క వచ్చీరానిమాటలువినీ, ముద్దుపెట్టుకొని తృప్తిచెందేవాడను. సరదాగావున్నప్పుడు ఆమెతో ఆడుకొనేవాడను, ఏడ్పు ఆరంభించిందంటే తల్లికి అప్పగించి అక్కడినుండి వెళ్ళిపోయేవాడను. ఆమెనుపెంచి పెద్దదానిని చేయాలంటే ఎంతప్రయత్నించాలో, ఎంతకష్టపడాలో అప్పుడు నాకేమీ తెలిసేదికాదు.

తల్లియొక్క అకాలమరణంతో ప్రభయొక్క పోషణ భారమంతా నాపైనపడ్డది. అప్పటినుంచి ఆమెకు నేనేతల్లినైనాను, ఏలోటూరాకుండా ఎంతో జాగ్రత్తగా పెంచుతూ వచ్చాను.

తల్లిలేనిపిల్లను చాలాగారాబంగా చూడాలని నేనేఅనుకొనేవాడనో లేకభార్యలేనితండ్రిని శ్రద్ధగాచూచుకోవాలని ప్రభేఅనుకొనేదో చెప్పటంకష్టము కాని ఆరోపడువచ్చేసరికి ప్రభ ఇంటిపనులన్నీ చేయటం నేర్చుకొంది. అన్నివిషయాల్లోనూ ఇంటికిపెద్దఅయి తండ్రికి సహాయమైంది.

సంతోషంగా నేనుఆమెకు ఆత్మసమర్పణ చేసుకొన్నాను. నాలో సోమరితనమూ, చేతకానితనమూ అధికమవ్వ

తున్నకొద్దీ ఆమెమరింత ఉత్సాహంగావుండేది. నాపనులు నేనుచేసుకొంటే అవిస్వల్పమైనవైనాసరే, తన అధికారానికి నేను అడ్డువచ్చినట్లుగా భావించేది ఇంతకు మునుపెన్నడూ నాన్నలాంటి పెద్దఆటబొమ్మ దొరకలేదన్నట్టుగా నాన్నకు అన్నంతినిపిస్తూ, నాన్నకు బట్టలుకడుతూ, నాన్నను నిద్ర బుచ్చుతూ రోజంతా ఎంతోఆనందంగా గడిపేది. చదువు కొనేవేళల్లో మాత్రం నాలోని పితృత్వం మేల్కొంటూ వుండేది.

'అమ్మాయికి మంచిసంబంధంచూచి పెళ్లిచేయాలంటే చాలాడబ్బుకావాలి నావద్ద అంతడబ్బుఏది? నాశక్తివున్నంత వరకు అమ్మాయికి చదువునేర్పాను. ఇంతాచేసి ఆమెను ఏమూర్ఖుడికో కట్టబెడితే ఆమెగతి ఏమవుతుంది?' అనిఅప్పు డప్పుడు చాలావిచారించే వాడను.

ఏదోవిధంగా డబ్బుసంపాదించటానికి ప్రయత్నించా లని నిశ్చయించుకొన్నాను. ఏదైనా ప్రభుత్వఉద్యోగం చేయాలంటే వయస్సుమిరిపోయింది. ప్రయివేటుఉద్యోగానికి తగిన తెలివితేటలు నాలోలేవు, కనుక బాగాఆలోచించిన తరువాత పుస్తకాలువ్రాయాలని తీర్మానించుకొన్నాను.

రంధ్రాలువేసిన వెదురుగొట్టం, నూనెవుంచటానికి ఉపయోగించదు. నీళ్లువుంచటానికి ఉపయోగపడదు. దేనినీ ఆపగలశక్తివుండదు ఆగొట్టానికి. ప్రపంచంలో దేనికీ ఉప యోగపడని అది ఒకవేణువుగా ఉపయోగపడవచ్చు. దానిని ఊదినప్పుడు సంగీతంరావచ్చును. ఆవిధంగానే ప్రపంచంలో డబ్బేమీ ఖర్చుచేయనవసరం లేకుండా, మరేపనికిఉపయోగ

పడని అభాగ్యులు మంచిపుస్తకాలు వ్రాస్తున్నారు. నేను కూడా అలాంటిసాహసంతో ఒక ప్రహసనం వ్రాశాను. దానిని చదివి అందరూ చాలామెచ్చుకొన్నారు. దానిని స్టేజిమీద ప్రదర్శించారు కూడాను.

కీర్తి రుచిమూచిన నేను ఇకవరసనే ప్రహసనాలు వ్రాయటం ప్రారంభించాను.

ప్రభ మామూలుగావచ్చి 'నాన్నా, లేచిస్నానం చేయవూ!' అనిఆదరంతో అడుగుతూవుండేది ఒకనాడు నేను కోపంతో 'వెళ్ళు, నన్నిప్పుడేమీ విసిగించకు పో!' అని కసిరాను. దీపంఆరిపోగానే గదంతా చీకటిఆవరించినట్లు ఆమెముఖంలోనికాంతిఅంతా మాయమైపోయింది. దుఃఖిస్తూ ఆమెగదిలోనుంచి ఎప్పుడు వెళ్ళిపోయిందో కూడా నేను గమనించలేదు.

పిలవటానికి వచ్చేదాసీదానిని కసిరి తరిమేసేవాడను. బిచ్చగాడెవరైనా అడుక్కోటానికి వస్తే కర్రతీసుకొని వెంట బడేవాడను.

రోడ్డుప్రక్కనే వున్నగదిలోనే నేను వ్రాసుకొంటూ వుండేవాడను. అప్పుడప్పుడూ బాటసారులెవరైనా ఫలానా చోటికి ఎటుపోవాలి అనిఅడుగుతూ వుండేవారు. నాకు ఒళ్ళుమండుకొచ్చేది 'మహాశయా! తిన్నగా వెళ్లాలికాటికి' అని సమాధానంచెప్తూ వుండేవాడను. నాదురదృష్టమే అనుకోవాలి, నేను అతిచమత్కారమైన ప్రహసనం వ్రాస్తూవున్నా ఒక్కరూ గ్రహించగలిగేవారుకారు.

కాని నాకు లభించిన కీర్తికి తగినంతగా నా హాస్యకవిత్వం ద్వారా డబ్బు లభించలేదు. ప్రఖ్యాతికెక్కిన అనేకమంది వరులు ఇతర కన్యలను వివాహమాడేసి ఎంతోమంది కన్యాభారగ్రస్తులైన తండ్రులను ఉద్ధరిస్తున్నారనే సంగతి ఈ గొడవలో నేను గమనించలేదు.

ఆకలితో సుప్రమూర్ఛితేనేగాని చైతన్యం కలుగదు. కాని అటువంటి సమయంలో ఒక మంచి అవకాశం లభించింది. జాహిర్ గ్రామపు జమీందారుగారు ఒక వార్తాపత్రికను ప్రారంభించారు, జీతం తీసుకొని నన్ను దానికి సంపాదకుడుగా వుండమని వారు కోరటం, వెంటనే నేను అంగీకరించటం జరిగాయి.

శక్తివంచన లేకుండా గొప్ప ప్రతాపంతో ఆ పత్రికను నడిపించాను. నేను ఇంటనుంచి కదలి బయటికి వస్తే చాలు అందరూ నన్ను పొగుడుతూ మాట్లాడుకొనేవారు. మధ్యాహ్న సూర్యునివంటి ప్రతాపం నాదిఅని నాలో నేను అనుకొనేవాడను.

జాహిర్ గ్రామం ప్రక్కనే [illegible]ర్ గ్రామం అనేది వుంది. ఈ రెండు గ్రామాలకు మధ్య ఘోరమైన కక్షలు బలిసిపోయి వున్నాయి. ఒకప్పుడు తగాదాలొచ్చి కర్రలతో తలలు పగలగొట్టుకొనేవారు. అప్పుడు కలెక్టరుగారు జోక్యం చేసుకొని ఇంకెప్పుడూ మేము దెబ్బలాడుకోము అని ఉభయపక్షాలవారిచేత వ్రాతపూర్వకంగా హామీలు తీసుకొన్నారు. అంతటితో దెబ్బలాటలు ఆగిపోయాయి. ఇప్పుడిక మా జమీందారుగారు నావంటి సహాయకునిద్వారా పూర్వం కర్రలతోనూ హత్యలతోనూ జరిగిన పనులు జరిపించదలచారు.

నాసంపాదకహోదా గౌరవం నేను బాగా కాపాడానని అందరూ అన్నారు.

నా వ్రాతలవల్ల ఆహిర్ గ్రామం ఇక తలఎత్తలేక పోయింది. నా వ్రాతలతో నారిజాతి, వంశము, పూర్వీకుల చరిత్ర - అన్నిటిమీదా దుమ్మెత్తిపోశాను.

ఆరోజుల్లో నాకుచాలా హాయిగా జరిగిపోయేది. బాగా లావెక్కాను. మనస్సులోనూ, ముఖంలోనూ కూడా ఎల్లప్పుడూ సంతోషం నిండివుండేది. ఆహిర్ గ్రామజమిందారు గారిపూర్వీకులను గురించి నిందాగర్భితమైన చెణుకులు విసురుతూ వుండేవాడను - ఆహిర్ గ్రామప్రజలు కడుపుచెక్కలయేటట్లు నవ్వేవారు చాలా ఆనందంగా కాలంగడిపే వారు.

ఇంతలో ఆహిర్ గ్రామం వారుకూడా ఒకపత్రిక ప్రారంభించారు ఆపత్రికలో ఏసంగతీ గూఢంగా చెప్పేవారుకాదు. చక్కని వ్యవహారికభాషలో చాలా ఉత్సాహంతో సూటిగా తిట్టేవారు. ఆపత్రికలోని అక్షరాలు అందరికీ విన్పించేటట్లు కేకలుబెడుతున్నట్లుండేవి. అందువల్ల ఆపత్రికను రెండుగ్రామాల ప్రజలూ ఆసాంతం చదివేవారు. అది అందరికీ సులభంగా అర్థమయేదికూడాను.

కాని పూర్వంనుంచి నేను అలవాటుపడివున్న యుక్తులద్వారా బాగా చమత్కారాలను ప్రయోగించి శత్రుపక్షం వారిని కూలదోసే ప్రయత్నం చేసేవాడను. కాని నా వ్రాతల్లోని రహస్యం అటు శత్రుపక్షంవారికీ ఇటు మిత్రపక్షం వారికీ - ఎవరికీ అర్థమయేదికాదు. దీనిఫలితంగా జయం

నావే అయినప్పటికీ నేనే ఓడిపోయానని అందరూ అనుకునే వారు. మరొకదారి ఏదీకన్పించక చివరకు నేను 'మంచి అభి రుచి'ని గురించి ఒక ఉపదేశవ్యాసం వ్రాశాను. కాని నేను చేసినది పొరపాటే అని ఆతరువాత తెలిసుకున్నాను. మంచి వస్తువును ఎగతాళిచేసినట్టుగా, చెడ్డవస్తువునుఎగతాళిచేయుటం కష్టమని తేలింది.

మా జమీందారుగారికి కూడా నామీదవున్న ఆదరం క్రమంగా తగ్గిపోయింది. నా కిప్పుడు సభలలో గౌరవ మర్యా దలు లభించటంలేదు. నేను బయటికివస్తే పూర్వంవలె ఎవరూ ఆదరంతో పలకరించటంలేదు. నన్నుచూచి అక్క డక్కడా నవ్వటంకూడా ఆరంభమయింది.

ఈలోపుగా అనేకమంది నా ప్రహసనాల సంగతికూడా పూర్తిగా మరచిపోయారు. చివరకు నా బ్రతుకు ఒక్కక్షణం వెలిగి ఆరిపోయిన అగ్గిపుల్ల బ్రతుకయింది.

ప్రభ ఇప్పుడు నన్నుచూచి భయపడసాగింది. పిలిస్తేనే తప్ప నాదగ్గిరికి రావటానికికూడా సాహసించేదికాదు. చమ త్కారవ్రాతలు వ్రాసే తంత్రికంటే మట్టిబొమ్మ స్నేహమే మంచిదనుకున్నదేమో!

చివరకు ఆహీర్ గ్రామ పత్రిక మాజమీందారుగారిని వదలి నామీదవిరుచుకుపడింది. నన్నుగురించి చాలాఅసహ్య కరమైన విషయాలు వ్రాశారు. నా స్నేహితులు ఒక్కొక్కరే వచ్చి నవ్వుతూ ఆవ్యాసంనాకు చదివి వినిపించసాగారు. వారిలో కొందరు 'విషయం అలావుంచుదాం, భావచాలా సజీవంగా వుంది. మంచిపటుత్వమైనభాష ఉపయోగించారు'

అనికూడా అన్నారు. అనగా ఆవ్యాసంలో ఉపయోగించిన భాషవల్ల అందులోవున్న విందలు సూటిగా అర్థమవుతున్నా యన్నమాట. ఆవాళవచ్చిన వాళ్ళందరూ ఇదేమాటఅన్నారు;

నేనువుండే ఇంటిఎదుట ఒక తోటలాంటిదివుంది. చాలా చికాకుగానూ, బాధగానూవుండి కాస్సేపు తిరిగివద్దా మని అక్కడికివెళ్లాను. పక్షులుతమతమగూళ్ళకుతిరిగివచ్చాయి. కలరవం కట్టిపెట్టి ఏవిధమైన విచారంలేకుండా ప్రశాంతిగా విశ్రమిస్తున్నాయి. అప్పుడు నేనదిచూచి పక్షులతో రసికత తెలిసిన రచయితలు లేరనీ, పక్షులు మంచి అభిరుచుల్ని గురించి వాదనలు చేయవనీ గ్రహించాను.

నన్నుగురించి పత్రికలో ఆహీర్ గ్రామవాసులు వ్రాసినదానికి ఏవిధంగా సమాధానం ఇస్తే బాగుంటుంది అని ఆలోచించాను. వచ్చిన చిక్కేమిటంటే సుశిక్షితులు వ్రాసే వ్రాతలు అన్నితరగతుల ప్రజలకూ అర్థమవదు. నీచులభాష అందరికీ సులభంగా అర్థమవుతుంది. అటువంటి భాషకు వారు అలవాటు పడివుంటారు. కను నేనుఓడిపోయి నట్టు వూరుకోవటం కంటె అటువంటిభాషనే ఉపయోగించి ఘాటుగా సమాధానం వ్రాయాలనుకొన్నాను.

ఇంతలో నాకు బాగా పరిచితమైన మధురకంఠస్వరం ఒకటి, అకస్మాత్తుగా ఎంతో నెమ్మదిగా వినిపించింది. ఆ వెంటనే వెచ్చని మృదువైన చిట్టిచేతిని నాచేతిలో పెట్టారు ఎవరో. ఆస్పర్శ, ఆకంఠస్వరము నాకుబాగా పరిచయమున్నవే అయినప్పటికీ నేను చాలా పరధ్యానంగా వుండటంవల్ల తత్‌ క్షణం పోల్చుకోలేకపోయాను. కాసి మరుక్షణమందే ఆ కంఠ

స్వరమూ, స్పర్శా పరిచితమయాయి. ఆ బాలిక మృదువుగా 'నాన్నా' అని పిలిచింది. నేనేమీ బదులు చెప్పలేదు. అదిచూచి ఆమె నాచేతిని తన నుదుటిమీద ఆనించుకొని తరువాత నా చేతిని వదలిపెట్టి ఇంట్లోకి వెళ్ళిపోయింది.

ప్రభ నన్నీవిధంగా పిలిచి చాలాకాలమయింది. ఈవిధంగా తనంతట తాను నాచెంతకువచ్చి ఈమాత్రమైనా ఆదరించలేదు కనుక ఆకస్మికమైన ప్రేమస్పర్శవల్ల నాహృదయం వ్యాకులపడసాగింది.

కొంతసేపటికి నేను గదిలోకివచ్చి చూచాను. బాగా అలసిపోయినట్లు ప్రభ మంచంమీద పడుకొనివుంది. కళ్ళుసగం మూతబడివున్నాయి-సాయంత్రాన రాలిపడివున్న పువ్వువలె పడివుంది'.

నుదురుమీద చేయివేసి చూచాను. కొలిమివలె కాలిపోతూవుంది.

జ్వరంవచ్చినదని గ్రహించి కాబోలు బిడ్డతండ్రి ప్రేమకోసం, తండ్రిముద్దుకోసం, అక్కడికి వచ్చివుంటుంది. కాని అప్పుడు తండ్రి తను వ్రాయవలసిన ఘోరమైన ప్రతివిమర్శను గురించి ఆలోచిస్తున్నాడు.

అప్పుడు నేను దగ్గరకువచ్చి కూర్చున్నాను. అమ్మాయి ఏమీమాట్లాడలేదు. జ్వరంతో కాలుతున్న తనచిట్టిచేతులతో నాచేతిని లాక్కొని కొలిమివలె కాలుతున్న తన తల క్రిందవుంచుకొని పడుకొన్నది.

జాహిర్ గ్రామం, అహిర్ గ్రామాలకు సంబంధించిన కాగితాలు నాదగ్గర ఏవేవివున్నాయో అవన్నీతీసి తగల

పెట్టేశాను. ఆహింద్ గ్రామంనాకు వ్రాసిననిందలకు ప్రతి విమర్శ వ్రాయలేదు. ఓడిపోయి ఆవాళ నేనుపొందిన సుఖం అంతకుముందెన్నడూ నాకులభించలేదు.

తల్లిమరణించిన తరువాత ఆమెను ఇన్నాళ్ళకు నా ఒడిలోకి తీసుకొన్నాను ఇవాళ నాకుమాత్రె సవతితల్లికి అంత్యేష్టి క్రియలు ముగించాను-ఆమెను మళ్ళీ నాహృదయంలో పెట్టుకొని, తిరిగి ఇంటికి-మూస్వగ్రామం వచ్చాను.



# గిరిబాల

రమానాథశీల్ గారి మేడలో, మూడో అంతస్తు గదిలో వుండేది, గోపీనాథ్ శీలుగారిభార్య, గిరిబాల. పడక గదికి దక్షిణవైపున ఉన్న ద్వారానికి ఎదురుగా, రకరకాల పూలతొట్టెలు వున్నాయి. చుట్టూ ఎత్తయిన పిట్టగోడవుంది. బయటికి చూడటానికి వీలుండేట్టుగా అక్కడక్కడా గోడలో కంతలు ఉన్నాయి. పడకగదిలో రకరకాల దుస్తులు ధరించిన విదేశీస్త్రీల చిత్రాలు, నగ్నచిత్రాలు కొన్ని గోడలకు వేలగట్టి ఉన్నాయి. కాని లోనికి అడుగుపెట్టగానే ద్వారానికి ఎదురుగాఉన్న నిలువుటద్దంలో పదహారేళ్ళ యువతి యొక్క ప్రతిబింబము మనకు కన్పిస్తుంది. గోడలకు వేలగట్టిఉన్న ఏచిత్రానికీ అందంలో తీసిపోదు ఆ ప్రతిబింబం.

ఆమె సౌందర్యము వెలుగుకిరణాలవలె, నిద్రాభంగమయినప్పుడు వచ్చిన చైతన్యంవలె, అకస్మాత్తుగా మనకు కొట్టవచ్చినట్లు కనబడుతుంది. మనను పరవశ మొందించ గలదు. ఆమెను చూచిన ఆక్షణాన అటువంటి సౌందర్యము చూచి మనం నిగ్రహించుకోలేము అనిపిస్తుంది. అటువంటి రూపలావణ్యమును మనం ఎన్నడూ చూచివుండలేదని అర్థమవుతుంది.

గిరిబాల రూపలావణ్యాలలో మునిగి తేలుతూవుంది. ఆమె సర్వాంగాలూ రూపలావణ్యాలతో, నవయౌవనము తోనిండి తొణికిసలాడుతున్నాయి ఆమె చీరకట్టటంలో,

ఆమె ధరించే ఆభరణాలలో, కాంతివంతమైన ఆమె వాలు చూపులలోనూ, వయ్యారంపు నడకలోనూ, ఆ మెడవిరుపు లోనూ – దేనిలో చూచినా ఆమె లావణ్యము పొంగిపడుతూ వుంటుంది.

సమస్త శరీరంలోనుంచి పెల్లుబుకుతూవుండే ఆ లావణ్యామదిరరసము ఆమెను నిషాకలిగించేది. నిండయిన తనశరీరాన్ని లేతరంగుచీరతో అలంకరించి, కారణమేమీ లేకపోయినా, చంచలమైన మనస్సుతో డాబామీద పచారు చేస్తూ కన్పించేది. ఆమెలో జనించే అపూర్వసంగీతానికి ఆమె ప్రతి అవయవమూ లయబద్ధమై నాట్యంచేయగోరుతున్నట్టుండేది. సర్వాంగాలను అలాగే వివిధరీతుల ఆడించుతూ వుండటమే ఆమెకు ఆనందమేమో అనిపిస్తుంది. హఠాత్తుగా పువ్వులతొట్టెదగ్గరో ఆగి ఒక ఆకునుతుంచి వయ్యారంగా ఆకాశంలోకి ఎగరవేసేది అప్పుడు ఆమె గాజులు గలగల లాడేవి, పైటచెంగు విజయధ్వజంవలె రెపరెపలాడేది. కోమలమైన ఆ చేతులతీరు, పంజరంలోనుంచివదలి కంటికికన్పించకుండా ఆకాశంలో ఎగురుతూవున్న పక్షివలె వుండేది. ఒక్కొక్కసారి అకారణంగా పూలతొట్టెలోనుంచి చినమట్టిపెళ్లనుతీసి దూరంగా విసిరేది. మరొక్కసారి పిట్టగోడదగ్గరకు వెళ్ళి పాదాలెత్తి పైకిలేచి బయట ప్రపంచాన్ని కలయచూచేది. మళ్ళీ అంతలోనే చటుక్కున వెనుదిరిగి పైటచెంగు ఎగరవేసుకొంటూ గబగబ ఇవతలికి వచ్చేసేది. అప్పుడామె కొంగున వున్న తాళంచెవులగుత్తి గలగల లాడేవి. మరొకప్పుడు వేళకానివేళ అద్దంముందు కూర్చొని తలదువ్వి సిగవేసు

కొనేది. ఒక్కొక్కప్పుడు సిగవేసుకోగానే మంచము దగ్గ రకువచ్చి తనవొత్తని పరుపుమీద బద్ధకంగాపడుకునేది. అప్పు డామె చెట్లఆకుల మధ్యనుండి వచ్చేపడే తెల్లనివెన్నెలరేఖ వలె కన్పించేది.

ఆమెకు పిల్లలు కలగలేదు. గొప్పఇంటికోడలు పని చేయవలసిన అవసరంలేదు. ఏకాంతంలో కూర్చొని తన లోపల తనను కూడబెట్టుకుంటూ భరించలేనంతగా తన అస్తి త్వాన్ని పెంచుకొంది భర్తవున్నప్పటికీ అతను ఆమెనాశ్ర యించలేదు. గిరిబాల పూర్ణయౌవనం పొందినప్పటికీ, ఎందు కనోగాని ఆమె భర్తదృష్టిని ఆకర్షించలేకపోయింది.

గిరిబాల వివాహమయిన రోజుల్లో ఆమెభర్త కాలే జీలో చదువుకుంటూవుండేవాడు. ఆకొత్తలో భర్తఆమెను చాలా ఆదరించేవాడు. మధ్యాహ్నం అందరూ నిద్రపోయే సమయంలో అతడుస్కూలునుంచి పారిపోయివచ్చి భార్యతో ప్రేమాలాపంచేస్తూ వుండేవాడు. ఇద్దరూ ఒకేఇంట్లో ఉంటు న్నప్పటికీ విలువైన కాగితాలుతెచ్చి గిరిబాలకు ఉత్తరాలు వ్రాస్తూవుండేవాడు. ఆఉత్తరాలు తన సహాధ్యాయులకు ఎంతోగర్వంగా చూపిస్తూవుండేవాడు. అనవసరంగాభార్యతో చిన్నచిన్న ప్రణయకలహాలుకల్పించుకొనిఆనందించేవాడు.

ఇంతలో తండ్రి మరణించాడు, గోపీనాథ్ ఇంటికి పెద్దఅయినాడు. పచ్చికర్రకు అతిత్వరగా పురుగుపట్టేటట్టుగా పిన్నవయస్సులో ఇంటికిపెద్దఅయిన గోపీనాథ్‌ను పరపురు గులు పట్టుకొన్నాయి. దానితో అంతఃపురానికి అతని రాక పోకలు తగ్గిపోయి బయటిచోట్లకు ఎక్కువయాయి.

నాయకుని హోదాలో ప్రసన్నమనిషి పొందే ఉత్తేజనము అనేకుల్ని ఆకర్షిస్తుంది. అది ఒకనిషావంటిది. నెపోలియన్ కు కూడా తన ప్రభావాన్ని అసంఖ్యాక జనంపై విస్తరింపచేద్దామనే దుర్దయమైన కోర్కె ఉండేదని అంటారు. మన ఇంట్లోవున్న సభ్యులకు మనంకూడా ఒకచిన్న నాయకుడు అవుదామని అనుకోవటం కూడా ఆతరగతికే చెందుతుంది. చిన్నసంఘం ఒకటి ఏర్పాటుచేసి పనికిమాలిన వాళ్ళను పదిమందిని పోగుచేసి వాళ్ళచేత 'భళి, భళీ' అనిపించుకొని పరమానందం పొందేవాళ్లు ప్రపంచంలో అనేకులున్నారు. ఆ ఉత్తేజంతో ఆకర్షింపబడి అనేకమంది తమ సర్వసంపదలనూ వ్యయపర్చి, అప్పులపాలై చివరకు అవినీతికి కూడా పాల్పడే వారూవున్నారు.

ఆవిధంగానే పదిమందిని చేర్చుకున్న గోపీనాథ్ దానికి అధ్యక్షుడవటంతో ఆగౌరవానికి అతనుఉన్మత్తుడై పోయాడు. ఆసంఘంలో రోజూ నూతన ప్రశంసలు, నూతనగౌరవమూ అందుకొని మైమరచిపోయేవాడు. తనంత ప్రతిభాశాలి మరొకరు లేరనివారందరినోటా విని తనకర్తవ్యాలనేమరిచిపోయాడు, ఇప్పుడతనికి తన సుఖదుఃఖాల గొడవే లేకుండాపోయింది. ఆమత్తులో పడిపోయి ప్రవాహంలోని సుడిగుండంవలె గిర గిర తిరగసాగాడు.

ఇహ ఇవతల, గిరిజాల ప్రపంచాన్ని జయించగల సౌందర్యంతో శూన్యమైన తనకేమున గృహ సింహాసనం మీద కూర్చొని ఏకాంత అంతఃపురాన్ని ఏలుతుంది. దేవుడు తనకు రాజదండం ప్రసాదించాడని ఆమెనమ్మకం. ఆభవ

నంలోని కిటికీనుంచి కన్పించే విశాలప్రపంచాన్ని తాను కేవలం కనుచూపుతో జయించగలనని ఆమెయొక్క దృఢ విశ్వాసం, కాని ఇంతవరకు ఆమె ఎవర్నీ జయించనేలేదు.

గిరిబాలవద్ద సుధఅనే ఒకదాసివుండేది, దానిపూర్తి పేరుసుధాముఖి; ఆమెమంచి రసికురాలని ప్రసిద్ధి; ఆటపాటలు తెలిసినది కొద్దిగొప్ప కవిత్వంకూడా వ్రాసేది. జగన్మోహిని అయిన గిరిబాల సౌందర్యాన్ని చూచి ముగ్ధురాలై పోయేది. గోపీనాథునివంటి అరసికుని చేతిలోపడి అద్భుతమైన గిరిబాల సౌందర్యమంతా వ్యర్థమైపోతున్నదని ఆమె దుఃఖించేది. సుధముఖి లేకుండా గిరిబాలకు క్షణం గడిచేది కాదు. తనముఖ సౌందర్యాన్ని గురించి మాటిమాటికి సుధాముఖితో అడ్డదిడ్డంగా వాదిస్తూ వుండేది. సుధతనను లేనిపోనివి కల్పించి పొగుడుతుందనీ, ఆమెచెప్పేవన్నీ అబద్ధాలనీ గిరిబాల ఖండించేది. తాను చెప్పేదంతా నిజమేనని సుధాముఖి ఒట్టువేసుకొనేది, ఇదంతా గిరిబాలకు తెలిసిన విషయమే గనుక వాదన అట్టేసేపు జరిగేదికాదు. అయినా సుధాముఖి పొగడ్తవిని ఆమె లోలోపల ఉప్పొంగి పోయేది.

పారాణితో ఎర్రగా సుకోమల సుందరపాదపద్మముల గురించి పొగుడుతూ సుధ తరచు ఒకపాటపాడుతూ వుండేది. అది తన పాదాలగురించేనని గిరిబాల తలచేది. అటువంటి తనపాదాలచెంతకూడా ఒక ప్రేమదాసుడు పడివున్నట్లు ఆమె భావించేది. శూన్యంగావున్న ఆమేడమీద కాళ్ళగజ్జెలతో జయగానం పాడుతూ ఆమె తిరగుతూ వుండటమే

కన్పించేదికాని ఆపాటలో వున్నట్లు పరతంత్రుడై ఆమె పాద పద్మములముందు దాసుడేనమా కన్పించేవాడుకాదు.

గోపీనాథుడు 'లవంగ' అనే పేరొక స్త్రీ పాదాల ముందు దాసుడయి పడివుండేవాడు. ఆమె నాటకాల్లో వేషాలువేసేది. ఆమె స్టేజీమీద అద్భుతంగా మూర్ఛిల్లుతూ వుండేది; వెక్కి వెక్కి దొంగవేడ్పులు ఏడుస్తూ 'హా! ప్రాణేశ్వరా! నాథా!' అని ముక్కుతో అస్పష్టంగా పలుకుతూ వుంటేచూచి, వెస్టుకోటులూ, పూలమేజోళ్లూ, మల్లుధోవతులూ కట్టుకొన్న మొదటితరగతి కుర్చీలోని ప్రేక్షకులు 'అద్భుతం' అద్భుతం అని ఆవేశంతో అరచేవారు

భర్త లవంగచే ఆకర్షించబడకపూర్వం గిరిబాల అతని నోట లవంగయొక్క నటనా సామర్థ్యాన్ని గురించి అనేక సార్లు వినేవుంది. భర్త ఆమెకు దాసుడైపోతున్నాడని తెలియకపూర్వమే ఆమెకు ఆపొగడ్తవిని అసూయకలిగేది. తనకులేని గొప్పతనం మరెవరిలోనైనా వున్నదని తెలిస్తే చాలు ఆమె సహించలేకపోయేది. అందుకనే గిరిబాలకు లవంగయందు ఈర్ష్య. తానుకూడాచూడాలని కుతూహలం కలిగి భర్తను అనేకసార్లు నాటకశాలకు తీసుకువెళ్ళమని కోరింది. కాని అతని సమ్మతి లభించనేలేదు.

ఒకనాడు డబ్బిచ్చి నాటకం చూచిరమ్మని సుధాముఖిని పంపింది. సుధ నాటకంచూచి వచ్చి ముక్కుమూతీ విరుస్తూ అక్కడ నటులందరూ ఎంత అందనికారులో, వాళ్లు పురుషుల మనస్సులను ఆకర్షించటానికి ఏవిధంగా నటిస్తారో, అదంతా ఎంత అసహ్యంగా వుంటుందో విపులంగా వర్ణించి

చెప్పింది. కాని గిరిబాలకు అంతమాత్రాన సంతృప్తి కలుగ లేదు. భర్తను తన ముఖమైనా చూడకుండా ఆలవాగ పెంచే వుంచటంవల్ల సుధాముఖి మాటలు అబద్ధమేమో అనే సందేహం కలిగింది. సగంకాలిన కొవ్వొత్తుకు చీకటి కే ఎలావుంటుందో లవంగా అలాగే వుంటుందని సుధాముఖి యజమానురాలి పాదాలనంటి ప్రమాణం చేసిచెప్పింది. అటువంటిస్త్రీ తనభర్తను ఏవిధంగా ఆకర్షించకలిగిందో గిరిబాలకు ఎంతకూ అర్థంకాలేదు కాని ఆమె అహంకారానికి భంగం కలిగి చాలా బాధపడుతూవుండేది.

నిషేధించిన పనిని చేయటానికి సిద్ధపడినప్పుడు మనకు చాలా ఉద్రేకం కలుగుతుంది - గిరిబాల చివరికి ఒకనాడు సుధను వెంటతీసుకొని నాటకానికి బయలుదేరింది. ఆమె హృదయంలో కంపం పుట్టింది. ఆ తొట్రుపాటులో వున్న గిరిబాలకు రంగురంగుల దీపాలతో ప్రకాశించుచున్న ఆరంగస్థలమూ, వాద్యసంగీతాలితో ధ్వనించే ఆనాటకశాల, రంగురంగులతో విచిత్రంగా కన్పించే ఆ తెరలూ చాలా అద్భుతంగా, అపురూపంగా కన్పించాయి. ఏకాంతంగా వుండే ఆ అంతఃపురంనుంచి అకస్మాత్తుగా రమ్యమైన ఉత్సవ స్థలానికి రావటంవల్ల ఆమెకు ఇదంతా ఒకస్వప్నం వలె కన్పించింది.

ఆనాటిరాత్రి 'మర్యాదభంగం' అనే సంగీతనాటకం ప్రదర్శిస్తారు. గంట మోగింది, వాలంకాతుణకాలం అతినిశ్శబ్దంగా వుంది. స్టేజిముందున్న దీపాలన్నీ వెలిగాయి, తెర లేచింది గోపికలవేషాలతో కొందరు బాలికలు నాట్యంచేస్తూ,

పాటపాడుతూ స్టేజిమీదికి వచ్చారు ప్రేక్షకుల హర్షధ్వానాలతో నాటకశాల కంపించిపోతున్నది. గిరిబాల యువరక్తం ఉద్రేకంతో ఉప్పొంగింది. ఆదీపాలకాంతినీ, అధరాల తళుకునూ, ఆహర్షధ్వానాలనూ చూచి గిరిబాల ఆకాస్సేపూ తనసంసారమూ, తనపంతమూ అన్నీ మరచిపోయింది. సాంఘికనియమ సంబంధనలన్నీ కరిగి మధురగానమై తనను బంధవిముక్తి చేశామనిపించిందామెకు.

సుహాముఖి మధ్యమధ్యవచ్చి 'అమ్మా, ఇక వెళ్ళిపోదాంరండి, బాబుగారు చూస్తే చాలా ప్రమాదం' అని చెప్తూవుండేది. గిరిబాల ఆమాట వినిపించుకోలేదు. ఇప్పుడామె మనసులో ఏవిధమైన భయమూ లేదు.

ఇప్పుడు జరుగుతున్న దృశ్యంలో అభిమానానికి దెబ్బతగిలిన రాధకు పౌరుషంవచ్చింది. శ్రీకృష్ణుడు కాళ్ళు పట్టుకొని వేడుకొంటూడు, ఎంత ప్రార్థించినా ఏమీ ప్రయోజనంవుండదు. ఆదృశ్యంచూచి గిరిబాలహృదయం చాలా సంతృప్తి చెందింది. శ్రీకృష్ణుని అవమానంచూచి, తానే ఆరాధఅయినట్లు వూహించుకొని తృప్తిపొందింది. తను అవమానింపబడి త్యజింపబడిన ఇల్లాలు. అయినప్పటికీ ఆకాస్సేపూ ఆసంగతిమర్చిపోయి తనలోకూడా నిర్దాక్షిణ్యంగా ఏడ్పించగలశక్తి వుందనుకొన్నది. సౌందర్యం యొక్క అజేయ ప్రతాపాన్ని గురించి గిరిబాలా చాలా వినేవున్నది. ఆ విన్నప్పుడు తాను వూహించుకొన్నదానిని ఇప్పుడు ఆ వెలుగులో, మధురగీతాలతో ప్రతిధ్వనించు రంగస్థలంమీదా ప్రత్యక్షంగాచూచి పరవశత్వం చెందింది.

నాటకం ముగిసింది. కొన్నిలైట్లు ఆరిపోయాయి ప్రేక్షకులు నెమ్మదిగా బయటకువెళ్ళిపోతున్నారు. గిరిబాల ఏదో స్వప్నంచూస్తున్నట్టు కదలకుండా అక్కడేకూర్చుండి పోయింది. లేచి ఇంటికివెళ్ళాలనే ధ్యాసేలేదామెకు. నాటకం ముగిసిందనికూడా తట్టలేదు. మళ్ళీ తెరలేస్తుందనీన్నీ, శ్రీకృష్ణుని పరాభవం తప్ప ఈ ప్రపంచంలో మరేదీ లేదన్నట్టుగా గిరిబాల కూర్చొనివుంది. ఇంతలో సుధాముఖవచ్చి 'అమ్మగారూ, తలుపులు వేసేస్తున్నారు, లేవండివెళ్దాం' అనిఅంది.

రాత్రి చాలా ప్రొద్దుపోయింది. గిరిబాల ఇంటికి వచ్చింది. పడకగదిలో మూల ఒకదీపం మిణుకుమిణుకుమంటూ వెలుగుతుంది, గదిలోఎవరూలేరు. ఇల్లంతా నిశ్శబ్దంగావుంది. మంచానికికట్టిన దోమతెర గాలికి కదులుతుంది. సంసారం ఆమెకునిస్సారంగానూ, కళాకాంతులేమీ లేనట్టుగా కన్పించసాగింది. వెలుగు, సౌందర్యం, సంగీతం, వీటన్నిటితో అద్భుతంగావున్న ఆరంగభూమి ఎక్కడ, తుచ్ఛమైన ఈ సంసారం ఎక్కడ ప్రపంచానికి తనమహిమను విరాజిల్లచేయుటకు ఇదికేంద్రస్థలం కాగలదా? తానెవరు, ప్రపంచానికి తెలియని, అవమానింపబడ్డ ఒకస్త్రీమాత్రమే కదా!

ఆనాటినుంచి ఆమె వారం వారం నాటకానికి వెళ్తూ వుండేది. కాని క్రమంగా మొదటవున్న వ్యామోహం తగ్గిపోసాగింది. నటులయొక్క అసలురూపము, వాళ్ళు వేసుకొనే రంగులూ, వాళ్ళదొంగవేషాలూ, మాయప్రేమ- ఇవన్నీ గ్రహించింది అయినప్పటికీ అలవాటుగా వెళ్తూనేవుండేది. రణభేరి వినగానే వీరునిహృదయం ఉప్పొంగి పోయేట్టుగా

తెరతేచేసరికి గిరిబాల హృదయం ఆలోచన చెందేది. సంసారానికీ దీనికీ ఎంతో వ్యత్యాసం కన్పించేది. ఎంతో అందంగా ఎత్తుగావుండే స్టేజి బంగారు కాంతితో, సంగీత సాహిత్యాలతో నిండివున్న మాయలోకం - చుట్టూ దీపమాలికలు - క్రిక్కిరిసిన ప్రేక్షకుల ముగ్ధనేత్రాలు - జగన్మోహిని అయిన అందాలరాణికి ఇటువంటి మహాసింహాసనం మరెక్కడ దొరుకుతుంది!

తనభర్త ఒక నటినిచూచి తన్మయుడవటం మొట్టమొదట గమనించిన గిరిబాలకు భర్తమెడల బహు అసహ్యం కలిగింది. 'నాఅందాన్నిచూచి తన్మయుడై నాభర్త రెక్కలు కాలిన పతంగం వలె నాపాదాలను ఆశ్రయించి నప్పుడు నేను అతనిని దూరంగా నెట్టివేసి వెళ్ళిపోగలిగిన నాడు వ్యర్థమనుకొంటున్న నాజీవిత యౌవనాలు సార్థకమవుతాయి' అని తనలోతానే అనుకొంటూ వుండేది.

కాని అటువంటి శుభదినం అంతకంతకు దూరమౌతున్నట్లుగావుంది. ఇప్పుడు గోపినాథుడు కన్పించటమే గగనమైపోయింది. తన బృందంతో కలిసి ఎక్కడెక్కడ తిరుగుతున్నాడో గిరిబాలకు తెలియనే తెలియదు.

చైత్రమాసంలో వసంత పూర్ణిమ రోజున గిరిబాల చక్కగా అలంకరించుకొని డాబామీద కూర్చొనివుంది. ఆమెధరించిన వాసంతిరంగు చీరపైటచెంగు గాలికి రెపరెపలాడుతుంది. భర్తఇంటిముఖం చూడటం మానేసినప్పటికీ గిరిబాల రోజుకొక చీర ధరిస్తూ, రోజుకొకముస్తాబు చేసుకొంటువుంది. ఆభరణాల మధురోన్మాద ధ్వనితో ఆమె

మైమరచిపోయేది, నేను ఆమె అలంకరణ మరింత రాణిం చింది. సుధాముఖి ఆమె పాదాల చెంత కూర్చొనివుంది. రక్త కలువల వలె అత్యంత రమణీయంగా వున్న ఆ పాదాలను తాకుతూ సుధ 'అమ్మా, నేనే పురుషుడనైవుంటే నీపాదా లను గుండెమీద పెట్టుకొని మరణించి వుందును' అనిఅంది. ఆ పొగడ్తను విని గిరిబాల ఉప్పొంగి నవ్వుతూ 'నువ్వు చని పోతే నే నిట్లాకూర్చొని వుండగల్గుతానా!' అనిఅంది.

పున్నమి వెన్నెలలో, నిర్జనంగావున్న శాబామీద గిరిబాల పాదాలదగ్గరకూర్చొని సుధాముఖి వెనకటిపాటపాడు తూవుంది.

రాత్రి పదిగంటలు కావచ్చింది. ఇంటిలోని వారం దరూ భోజనాలుచేసి పడుకోటానికి వెళ్ళారు. అత్తరు వాస నలు వెదజల్లుతూ గోపీనాథ్ అంత,పురంలోకి వచ్చాడు. అతనిని చూడగానే సుధాముఖి ముసుగుముందుకు లాగుకొని గాబరాగా లేచి అక్కడినుంచి పారిపోయింది. తనవంతవచ్చిం దనుకొన్నది గిరిబాల.

ముఖమెత్తి చూడకుండా నాటకంలోని రాధవలె పౌరుషంతో మెదలకుండా కూర్చున్నది. కాని అవనికపైకి పోలేదు. తురాయిధరించిన శిరస్సేదీ ఆమెపాదాలమీద పడ లేదు పాట వినబడటానికి బదులుగా కర్కశస్వరంతో 'నీ తాళంచెవులు ఇలాఇవ్వు' అన్నాడు గోపీనాథ్.

అన్నిరోజుల తరువాత వసంత పౌర్ణమి నిండువెన్నె లలో కలుసుకొన్నప్పుడు అటువంటి సంభాషణేనా జరగవలసి నది! కావ్యాలలోనూ, నాటకాలల్లోనూ, నవలలోనూ ఆ

విధంగా వ్రాసేవన్నీ అబద్ధాలే! ప్రియుడు పాటపాడుతూవచ్చి ప్రేయసి పాదాలమీద పడటం నాటకాలలో మాత్రమే జరుగుతుంది! ఆదృశ్యాన్నిచూచి తన్మయుడై పోయే మనిషే నేడు వసంతపౌర్ణమి వెన్నెలలో డాబామీదకూర్చొనివున్న అపురూప సౌందర్యవతియగు తనభార్యవద్దకువచ్చి, నీతాళం చెవులు ఇలాఇవ్వు అని అన్నాడు. ఆమాటలో సంగీతంగాని, మాధుర్యంగాని, అనురాగంగాని, మోహంగాని ఏవీలేవు.

ప్రపంచంలోని కావ్యాలన్నీ ఈ అవమానంతో మర్మాహతమై దీర్ఘనిశ్వాసము విడిచినట్లు, వికసించిన మల్లెపూల సువాసనతో నిండిన దక్షిణపు గాలివీచింది. గిరిబాల ముంగురులు ముఖంమీదపడ్డాయి, పరిమళంతో నిండివున్న వాసంతీ చీరచెంగు ఆ గాలికి ఎగిరింది. అభిమానం వదలి గిరిబాల భర్తచేతిని పట్టుకొని 'తాళాలు ఇస్తాను. గదిలోకి పదండి' అని అంది.

'నేను ఇన్నాళ్లూ ఏకాంతంలో కూర్చొని ఆలోచించిన ధంతా ఆచరించి, నాబ్రహ్మాస్త్రాలన్నీ ప్రయోగించి, నేను ఏడ్చి, అతనిని ఏడ్పించి విజయం పొందుతాను' అని గట్టిగా నిశ్చయించుకొంది.

'నాకు తీరికలేదు త్వరగా తాళాలుఇవ్వు' అని గోపీనాథ్ చికాకు కనబరుస్తూ అన్నాడు.

'తాళాలూ ఇస్తాను, ఆపెట్టెలో వున్న సమస్తమూ కూడా ఇస్తాను. కాని ఇవాళ నువ్వెక్కడికి వెళ్ళటానికి వీల్లేదు' అనిఅంది గిరిబాల.

'నాకు చాలా అవసరమైన పనివుంది. వుండటానికి వీలుపడదు' అని అన్నాడు గోపీనాథ్.

'అయితే నేను తాళంచెవులు ఇవ్వను.'

'ఎలా ఇవ్వవో చూస్తాను.'

ఈమాటఅంటూ గోపీనాథ్ ఆమెపైట చెంగు చూచాము తాళాలు లేవు. గదిలోని వస్తువులన్నీ వెదికాడు. రకరకాల వస్తువులెన్నో కన్పిస్తున్నాయి గాని తాళంచెవులు కన్పించలేదు. సామాన్లన్నీ చిందరవందరగా విసిరేశాడు. మంచం మీద, పరుపు క్రింద, ఎక్కడా తాళంచెవులు కన్పించనేలేదు.

గిరిబాల నిశ్చేష్టురాలై తలుపుపట్టుకొని డాబావంక చూస్తూనిల్చుంది. తాళంచెవులు తీసుకోలేక గోపీనాథ్ కోపంతో మండిపడుతూ 'తాళాలు ఇవ్వు, లేనిచో చాలా ప్రమాదం జరుగుతుంది' అన్నాడు గిరిబాలతో.

గిరిబాల అందుకేమీ జవాబుచెప్పలేదు. గోపీనాథ్ ఆమె వంటిమీదవున్న ఆభరణాలను బలవంతాన తీసుకొని ఆమెనుకాలితో ఒకతన్నుతన్ని బయటికి వెళ్ళిపోయాడు.

ఇంట్లోవారికిగాని, బయటివారికిగాని, ఎవరికీ ఈవిషయం తెలియదు. వెన్నెలరాత్రి, చాలా నిశ్శబ్దంగా వుంది. అంతా ప్రశాంతంగానే కన్పిస్తుంది. కాని హృదయంలోని ఆక్రందనలు బయటికి విన్పించటవుంటే, హాయిగా నిద్రించే ఆ వెన్నెలరాత్రికి ఒకదుఃఖకరమైన తీవ్రరోదనంతో నిద్రా భంగం కలిగేది.

ఆరాత్రి గడిచిపోయింది. అపరాభవాన్ని, ఆ అవమానాన్ని గురించి గిరిబాల సుధాముఖితోకూడా చెప్పలేకపోయింది. అపూర్వమైన తన సౌందర్యాన్నీ, తనయౌవనాన్నీ ముక్కలు ముక్కలుచేసి నాశనంచేసి, ఆత్మహత్య చేసుకొని గోపీనాథునిమీద కసితీర్చుకొందామని అనుకొంది. కాని మళ్ళీ అంతలోనే తన అభిప్రాయం మార్చుకొని 'ఆవిధంగా చేయటంవల్ల ఎవరికి ఏమీనష్టం కలుగదు. నేను చనిపోవటంవల్ల ప్రపంచానికి కలిగేనష్టం ఎవరి అనుభవంలోకిరాదు. జీవించి సుఖపడలేనప్పుడు చనిపోయిమాత్రం సుఖపడేదేముంది?' అని అనుకొంది.

పుట్టింటికి వెళ్ళిపోవాలని అనుకొన్నది. కాని పుట్టిల్లు కలకత్తాకు చాలాదూరం, అందరూ వద్దని చెప్పారు. ఇంటికి తానేపెద్దఅవటంవల్ల గిరిబాల ఎవరిమాటా లక్ష్యపెట్టలేదు. తనవెంట ఎవర్నీతీసుకొనికూడా వెళ్ళటం ఆమెకు ఇష్టంలేదు. ఇటు గోపీనాథ్‌కూడా తనబృదంతో సహా నౌకా విహారానికి బయలుదేరివెళ్ళి ఎటువెళ్ళాడో ఎవరికీ తెలియదు మళ్ళీ తిరిగి రాలేదు.

## ౨

గాంధర్వ థియేటరులో నాటకం ఆడటానికిముందు రిహార్స్‌లు జరుగుతూ వుండేవి. గోపీనాథ్ తప్పనిసరిగా వాటికికూడా వెళుతూవుండేవాడు. 'మనోరమ' అనేనాటకం రిహార్సులు జరుగుతున్నాయి. ఆనాటకంలో లవంగ 'మనోరమ' పాత్ర చదువుతుంది. గోపీనాథ్ తనబృందంతో సహా

హాజరై మొదటి వరస కుర్చీలలో కూర్చొని 'భేష్ భేష్' అని కేకలు వేస్తూ స్టేజిమీదకు పూలమాలలు విసరేస్తూవుండే వాడు చాలామందికి ఇదితలనొప్పిగా తయారయింది. నాటక దళంలోని వాళ్ళెవ్వరూ గోపీనాథ్‌ను ఏమీ అనలేకపోయే వారు. అతనికి ఎదురు చెప్పే సాహసం ఎవరికీ లేదు.

ఒకనాడు గోపీనాథ్ బాగా నిషాలోవుండి స్త్రీలు వేషాలు వేసుకొనే గదిలోకి వెళ్ళాడు. అక్కడ చినరభస జరిగింది. ఒళ్ళు తెలియని గోపీనాథ్ ఒకనటినిగట్టిగాకొట్టాడు. ఆ స్త్రీశోకాలు ప్రారంభించింది, గోపీనాథ్ నోటికివచ్చినట్లు తిట్టనారంభించాడు. ఎవరికివారే దూరంగావుండి ఆశ్చర్య పడిచూస్తున్నారు. అధికారులు మితిమీరుతున్న అతని చర్యలను సహించలేక పోలీసుల సహాయంతో గోపీనాథ్‌ను బయటకు పంపేశారు.

ఏదోవిధంగా ఇంతకింత ప్రతీకారం చేయాలని గోపీ నాథ్ నిశ్చయించుకొన్నాడు. దుర్గపూజ జరిగేనాటికి మనో రమ నాటకం ప్రదర్శిస్తామని థియేటర్ అధికారులు ఒకనెల ముందునుంచి పెద్దఎత్తున ప్రచారం ప్రారంభించారు. నగర మంతటా ఎక్కడచూచినా అదే ప్రచారం, అవేమాటలు, నగరమంతా మనోరమ మయమైపోయింది.

సరిగ్గా ఆసమయంలోనే గోపీనాథ్ లవంగను తీసుకొని ఒకనాడు నౌకావిహారానికి బయలుదేరి వెళ్ళాడు. ఆవెళ్లటం మళ్ళీతిరిగిరాలేదు. ఎక్కడికివెళ్లాడో ఎవరికీ తెలియదు.

థియేటరు అధికారులు దిక్కూదరీ తోచని సముద్రం మధ్య పడిపోయారు. లవంగకోసం చాలారోజులు ఎదురు

చూశారు. కాని ఎంతకూ ఆమె రాకపోవటం చూసి మరొక నటితో మనోరమ పాత్ర ధరింపించి నాటక ప్రదర్శనం జరిపించారు. ఈ మార్పువల్ల ప్రకటించిన దానికి చాలా ఆలస్యంగా మొదటి ప్రదర్శనం జరిగింది

కాని నాటకం విజయం పొందింది. ప్రదర్శన ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆ మార్పు జరిగినందువల్ల వచ్చిన నష్టమేమీ లేదు. టిక్కెట్లు దొరకక అనేకమంది తిరిగి వెళ్ళిపోయారు. మర్నాడు పత్రికలన్నీ గొప్పగా ప్రశంసించాయి, మారదేశంలో సంచారం చేస్తున్న నోప్పికాన్ పత్రికలో దీనిని గురించి చదివి, కోపమూ, కుతూహలమూ, ద్వేషమూ పట్టలేక నాటకం చూడాలని కలకత్తాకి తిరిగివచ్చాడు

మొదటి దృశ్యం మనోరమ అత్తవారింట వుంటుంది. ఎంతో దైన్యావస్థ; సంకోచంతో, అతి శ్రమతో, ముఖం కన్పించకుండా ముసుగు వేసుకొని వుంటుంది ఒక్క మాట కూడా మాట్లాడదు.

నాటకం చివరభాగంలో మనోరమ భర్త ఆమెను పుట్టింటికి పంపివేసి, ఒకధనికుల ఇంటిపిల్లను పెళ్ళాడాలని ప్రయత్నిస్తాడు. పెళ్ళి జరిగిపోతుంది, పెళ్ళికూతురు శోభనపు గదిలోకి వస్తుంది; కాని ఆమె మనోరమే- పూర్వపు దాసి వేషం లేదిప్పుడు, అపూర్వసౌందర్యమూ, నవయౌవనమూ కలిగి విలువైనదుస్తులూ, ఆభరణాలూ ధరించి వస్తుంది, చిన్నతనంలో మనోరమను ఎవరో ఎత్తుకుపోతారు. ఆనాటి నుంచి ఆమె దరిద్రంలోనే పెరిగి పెద్దయింది ఆతరువాత

ఆమె జాడ తెలుసుకొని తండ్రి తిరిగి తన ఇంటికి తీసుకువచ్చి చాలా వైభవంగా మళ్ళీ ఆమె వివాహం జరిపిస్తాడు.

తరవాత శోభనపు గదిలో రెండో పెళ్లికూతురును చూపి గర్భాంకం జరుగుతుంది. నాటకం ఇంతవరకు జరిగే సరికి ప్రేక్షకులలో చాలా గందరగోళం ప్రారంభమయింది. మనోరమ మలిన దుస్తులతో ముసుగువేసుకొని దాసివలె వున్నంతవరకు గోపీనాథ్ మెదలకుండా కూర్చొని చూస్తు న్నాడు. కాని చివరకు మనోరమ శోభనపుగదిలో కన్పించే దృశ్యంలో మిలమిల మెరిసే ఆభరణాలు ధరించి, గులాబి రంగు చీరకట్టుకొని, తన అపూర్వ సౌందర్య తరంగాలతో రంగస్థలాన్ని ప్రకాశింపచేస్తూ వయ్యారంగా ప్రేక్షకులను చూస్తూ, నిరాదరణతో కూడిన తీవ్రదృష్టిని గోపీనాథ్ వైపు మరల్చింది. ప్రేక్షకులు ఉత్సాహంతో ఉప్పొంగి పోతూ కరతాళధ్వనులు చేశారు. వారి ప్రశంసాధ్వనులతో హాలు కంపించింది. అకస్మాత్తుగా గోపీనాథ్ లేచినిలబడి 'గిరిబాలా, గిరిబాలా!' అని కేకలువేస్తూ స్టేజిమీదికి ఎక్క బోయాడు

అటువంటి ఘట్టంలో రసభంగం కల్గించిన అతనిమీద అందరికీ చాలా కోపంవచ్చింది ఎవరికివచ్చిన భాషలో వాళ్లు 'గెంటేయండి, గెంటేయండి' అని కేకలు వేశారు.

గోపీనాథ్ ఆయాసపడుతూ 'ఆమెను చంపేస్తాను' అని అరవసాగాడు.

పోలీసులు వచ్చి గోపీనాథ్‌ను బయటకు పంపేశారు, అతనికి జారింది.

# మృగమయి

అపూర్వకుమార్ బి. ఎ. పరీక్షప్యాసై ప్రపంచ ప్రసిద్ధ నగరమైన కలకత్తానుంచి తన గ్రామానికి బయలు దేరాడు.

మార్గంలో ఒక చిన్ననదివుంది. సాధారణంగా వర్షా కాలం వెళ్ళిపోగానే ఆనది ఎండిపోతూవుంటుంది. కాని అప్పుడు శ్రావణమాసమే గనుక నదీప్రవాహం పూర్ణయౌవనంలోవుంది. గ్రామహద్దును, వెదురుగుబుర్లను నిండా కౌగలించుకొని తీవ్రగతిని ప్రవహిస్తూవుంది.

చాలా రోజులనుంచి విడువకుండా కుండపోతగా వర్షం కురుస్తూవుంది. అటువంటిది ఇవాళే కొంచెంగా మబ్బులు విడిపోయి ఆకాశంలో సూర్యుడు దర్శనమిచ్చాడు.

పడవలో కూర్చొని ప్రయాణం చేస్తున్న అపూర్వకుమార్ యొక్క హృదయంలోకి మనం చూడగలిగితే, అక్కడ ఈ నవయువకుని హృదయ ప్రవాహం తొలకరి వానతో నిండుగా వుండటం, గాలికి తపతప ధ్వనిచేస్తూవుండటం చూడగలుగుతాము.

పడవ గమ్యస్థలానికివచ్చి రేవులో ఆగింది నది అవతలి గట్టుమీది చెట్లచాటుగా అపూర్వుని ఇంటిపై కప్పు స్పష్టంగా కన్పిస్తూవుంది. అపూర్వుడు కలకత్తానుంచి వచ్చుచున్నట్టు ఇంట్లో ఎవరికీ తెలియదు. అందుకని ఇంటినుంచి రేవువద్దకు ఎవరూరాలేదు. ఆపడవలోని నావికుడే అతని మూటకేసు ఇంటివరకు తీసుకు వచ్చుటకు అంగీకరించాడు

కాని అపూర్వుడు అతనినివద్దని తానే సూటుకేసు తీసుకొని సంతోషంతో గబగబా పడవలోనుంచి క్రిందికి దిగాడు.

రేవులో బురదగా వుండటంవల్ల రెండడుగులు వేయగానే కాలుజారి సూటుకేసుతోసహా కిందపడిపోయాడు. అతడు జారిపడగానే ఎగతాళిచేస్తూ బిగ్గరగా నవ్వువినిపించింది. మొదట ఆనవ్వు ఎటునుంచివచ్చిందో తెలియలేదు. కాని ఆసమీపమందున్న రావిచెట్టుమీది పక్షులు ఆనవ్వుకు బెదిరి ఎగిరిపోయాయి.

ఆనవ్వునవ్వినది ఒక బాలికఅనీ, ఆమె తమ పొరుగు ఇంటివారి గారాబుబిడ్డఅనీ అపూర్వుడు గ్రహించాడు. అపూర్వుడు సిగ్గుపడి వెంటనేలేచి కూర్చున్నాడు. రేవులో కొద్దిదూరాన కొత్తగా దింపిన ఒక ఇటుకలగుట్టవుంది. ఆ నవయువతి దానిమీద కూర్చొని క్రిందపడిన అపూర్వుని చూచి పొట్టచెక్కలయ్యేట్టు నవ్వుతూవుంది. ఆమెపేరు మృగమయి. పూర్వం ఆమె తల్లిదండ్రులు అక్కడికి చాలా దూరానవున్న పెద్ద నదీతీరాన నివసించేవారు. రెండుమూడు సంవత్సరాలక్రితం అక్కడ సంభవించిన వరదల భీభత్సాన్ని భరించలేక ఇక్కడికి వచ్చి నివాసం ఏర్పరచుకొన్నారు.

ఇక్కడమృగమయిని గురించి వ్యతిరేకవిమర్శలనేకం వినవస్తుంటాయి. గ్రామంలోని పురుషులు ఈమెను ముద్దుగా 'పిచ్చి' అని పిలుస్తారు. కాని స్త్రీలుమాత్రం ఈమెయొక్క దుందుడుకు స్వభావాన్ని చూచి చాలా భయపడేవాళ్ళు; ఆమెనుగురించి విచారించేవారు. ఆమె విషయంలో అనేక అనుమానాలు ఏర్పరచుకొన్నారు. ఆమె ఆటపాటలన్నీ

గ్రామంలోని మొగపిల్లలతోనే; తన ఈడు ఆడపిల్లలయెడల ఆమెకు మితిమీరిన తూష్ణీభావం వుండటమే ఇందుకు కారణం. బాలుర సామ్రాజ్యంలో ఈబాలిక ఒకవిధంగా శత్రుపక్షసైన్యం మాదిరి భీతినీ, అలజడినీ కలిగిస్తూ వుండేది.

ఇదంతా తండ్రి నేర్పిన గారాబమే. మృగమయి ఇంత నిర్భయంగా వుండటానికి తండ్రి అతిముద్దుచేయటమే ముఖ్యమైన కారణం. మృగమయి తల్లి ఈ విషయంలో తప్పంతా తనభర్తదేనని ఇరుగుపొరుగు స్త్రీలతో చెప్తూవుండేది. అయినప్పటికీ ఆమె ఏమీ చేయగలిగేదికాదు తనభర్తకు కుమార్తెయందున్న వాత్సల్యమూ, అవకాశ సమయాల్లో అతను ఇంటివద్దవున్నప్పుడు మృగమయి కంటనీరుపెట్టుకోవటం అతని మనస్సుకు చాలా బాధకలిగిస్తాయనీ గుర్తుకు వచ్చి ఆమె కుమార్తెను ఏమీ అనేదికాదు.

మృగమయి యొక్క శరీరవర్ణము చెప్పుకోదగినంత తేటగా వుండదు. కురచగావుండే ఉంగరాలజుట్టు, వీపుమీద విరబడివుంటుంది. ముఖంలో క్రూరతనపు లక్షణాలుస్పష్టంగా కన్పిస్తూవుంటాయి. ఆమెయొక్క ఆవిశాలమైన కాటుకకనుల్లో సిగ్గుగానీ, భీతిగానీ ఏమీవుండవు. ఆమె చేష్టలో సంకోచభావమనేది మృగ్యం. పొడవు, పొడవుకు తగినలావు, ఆరోగ్యంగా, బలంగావుంటుంది. ఆ మెవయస్సు ఎక్కువాతక్కువా అనేప్రశ్న సాధారణముగా ఎవరికీరాదు. ఒకవేళ అటువంటి ప్రశ్న గనుకవస్తే ఇరుగుపొరుగువాళ్లు ఆవిషయాన్ని గురించి 'పెళ్ళి పెటాకులు లేకుండా ఇంట్లో కూర్చోబెట్టుకున్నారు' అనిమాత్రం ఆమె తల్లి దండ్రుల్ని నిందించేవారు. ఆగ్రా

మళ్ళ జమిందారు అప్పుడప్పుడూ అక్కడికివచ్చి కొద్దిరోజులు వుంటూ వుండేవాడు. జమిందారుగారి పడవవచ్చి రేవులో ఆగిందని విన్నరోజున తమ ఆదరసత్కారాల్లో ఎక్కడ ఏమి లోపం జరుగుతుందోనని గ్రామస్తులందరూ చాలా గాబరా పడుతూ వుండేవారు. నడినెత్తిమీద వుండే స్త్రీలముసుగులు ముఖాలు కన్పించకుండా మూరెడు క్రిందికిజారేవి. కాని అప్పుడు మృగమయి కార్యక్రమం ఇందుకు భిన్నంగా వుండేది. ఎక్కడనుంచో నగ్నంగావున్న పక్కురాడినో చంక నెత్తుకొని రేవులోకివెళ్ళి నిలబడేది. వేటకాళ్లు, ఇతరమైన మరేచిక్కులూలేని దేశంలో నిర్భయంగా సంచరించే లేడి పిల్లవలె పడవకు ఎదురుగా నిలబడి అమితాశ్చర్యంతో చూస్తూవుండేది. చివరికి అక్కడినుండి తిన్నగా తన బాల మిత్రుల దగ్గరకువచ్చి ఆ నూత్నమానవుని విచిత్ర ఆచార వ్యవహారాలను గురించి వివరించి చెప్తూవుండేది.

మన అపూర్వుకు సెలవుల్లో ఇంటికివచ్చినప్పుడు ఇంతకుముందుకూడా రెండుమూడు పర్యాయాలు హద్దు అదుపు లేకుండా తిరిగే ఈ నవయువతిని చూచాడు. ఏమీ పని లేనప్పుడూ, కొన్నివేళల పనివున్నప్పుడుకూడా ఈమెను గురించి ఆలోచించాడు. ఈ భూమిమీద మనకు అనేకరకాల ముఖాలు కన్పిస్తూవుంటాయి. కాని కొన్నికొన్నిముఖాలుఒకే చూపులో సూటిగా మన మనసులో నిలిచిపోతాయి. అప్పుడిక ఎంతప్రయత్నించినా వాటిని మర్చిపోవటం కష్టమే అవుతుంది. అందంగా వుండటంవల్లనే ఆవిధంగా జరుగుతుందనుకోడానికి, అది అంతప్రధానవిషయంకాదు. దానికి పూర్తిగా

భిన్నమైనదేఅది. అది 'స్వచ్ఛందం' లేక 'స్వచ్ఛత! ఎక్కడ ముఖాలలో మానవ ప్రకృతి తన సంపూర్ణమైన వెలుగుతో ప్రకాశించదు. హృదయంలో ఎక్కడో మారుమూల దాగి వున్న ఆ నిగూఢమైన వ్యక్తిత్వం నిరాటంకంగా బయటికి వచ్చి ఏముఖంలో కన్పిస్తుందో ఆముఖం ఎన్నివందల వేల ముఖాల మధ్య ఉన్నప్పటికీ మరుగున పడివుండదు. క్షణకాలంలో హృదయఫలకం పైన హత్తుకుపోతుంది. ఆ బాలిక ముఖంలోనూ, కన్నులలోనూ, వనాలలో స్వేచ్ఛగా పరుగులెత్తే లేడిమాదిరి ఒక చంచలమైన విద్రోహ కరనారీ స్వభావం సర్వదా కనబడుతూవుండేది అందుచేతనే అటువంటి అందమగు చిలిపిముఖాన్ని ఒకపర్యాయం చూచినతరువాత ఎంతప్రయత్నించినా అతనికి మరుపురాలేదు.

మృగమయి పరిహాస కోసం ఎంతమధురంగా వున్నప్పటికీ దురదృష్టవంతుడైన అపూర్వునికి అదిచాలా దుఃఖం కలిగించిందని ప్రత్యేకించి చెప్పనవసరంలేదు. సిగ్గుతో అతని ముఖం ఎర్రబడింది. గబగబలేచి చేతిలోవున్న సూటుకేసు పడవవానిచేతికి ఇచ్చి త్వరగా అడుగులువేస్తూ ఇంటికి బయలుదేరాడు.

ప్రకృతిదృశ్యం అత్యంత రమణీయంగావుంది. నదీతీరము, చెట్లయొక్క చల్లనినీడ, వినసొంపుగావున్న పక్షుల మధుర కలరవం, ఎంతో హాయినిచ్చు ప్రభాతసమయపు లేతఎండ, ఇరవైయేండ్ల నవయువకుడు. అక్కడవున్న ఆ ఇటుకలగుట్ట అంతగా లెక్కలోనిదికానప్పటికీ, శుష్కమూ, రసహీనమైన ఆ ఇటుకలగుట్టపైన, దానిమీదకూర్చొనివున్న

యువతి ఒకనికూత సౌందర్యాన్ని ప్రసరింపచేసింది. ఇటువంటి రమణీయ ప్రకృతి దృశ్యంతో కాలుమోపపెట్టగానే అడుగులోనే హంసపాదు అన్నట్టుగా ఆయువకుని వ్యక్తిత్వమంతయూ ఒక ప్రహసనంగా తయారయింది. ఎంతదురదృష్టం! ఇంతకంటే మించిన దురదృష్టం ఏముంటుంది!

౨

ఆ ఇటుకల గుట్లమీదనుంచి వినిపించే పరిహాస హాసాన్ని వింటూ, చెట్లనీడన నడుస్తూ ఆ బురదతో నిండిన దుస్తులతోనే శ్రీ అపూర్వబాబుగారు ఇంటికిచేరుకొన్నాడు.

అకస్మాత్తుగా కుమారుడు ఇంటికి రావటంచూచి అపూర్వుని విధవతల్లి అమిత సంతోషపడ్డది. ఆమెఆనందానికి మేరలేదు. పాలు, పెరుగు, వెన్న, మంచిచేపలకోసం నలుదిక్కులా నౌకర్లను పరుగెత్తించింది. ఇంట్లోనూ, ఇరుగు పొరుగునాకూడా శుభకార్యమేదో జరుగుతున్నంత హడావిడిగావుంది.

భోజనాలయిన తరువాత తీరిగ్గాకూర్చున్నప్పుడు తల్లి కుమారునితో వివాహవిషయం ప్రస్తావించింది. ఈ సమస్య వస్తుందని ముందుగానే అతనికి తెలుసుగనుక అతడు అందుకు సంసిద్ధంగానే వున్నాడు. ఇంతకుముందుకూడా ఈ విషయం అనేకసార్లు ప్రస్తావించబడింది. నవనాగరికతావ్యామోహంతో వున్న అపూర్వుడు బి. ఎ. పూర్తికానిదే వివాహంవద్దు అని గట్టిగాచెప్పాడు. ఆపరీక్ష ఎప్పుడుపూర్తిఅవుతుందా అనే అతనితల్లి ఇంతకాలం ఎదురు చూస్తూవుంది. ఇకఇప్పుడు

అతనువద్దైనా అభ్యంతరంచెప్పాలిఅంటే అబద్ధాలైనా ఆడాలి లేదా ఏదో ఒకసాకు చూపించాలి. అందుకని అపూర్వుడు ఆరోజున తల్లి ఆవిషయంప్రస్తావించగానే 'ముందుపెళ్ళికూతుర్ని ఎక్కడైనాచూడాలిఆతరువాతఆలోచిద్దాం' అనిజవాబుచెప్పాడు

'దానినిగురించి నువ్వు విచారించాల్సిన అవసరమేమీ లేదు అమ్మాయిని చూడటం ఎప్పుడో జరిగింది అని చెప్పింది తల్లి.

'అమ్మాయిని నేను చూడకుండా వివాహం ఎలాగు జరుగుతుంది? అని అపూర్వుడు మరొకఅభ్యంతరంచూపాడు.

ఇటువంటి విచిత్రవిషయం ఇంతవరకు ఆమెఎన్నడూ వినివుండలేదు ఆమె ఆలోచనలోపడిపోయింది. అయినా చివరికి అందుకుకూడా ఆమె అంగీకరించింది.

ఆవాళరాత్రి అపూర్వుడు దీపం ఆర్పేసి పడుకొన్నాడన్న మాటేగాని ఎంతకూ కంటిమీద కునుకేలేదు. మంచంమీద అటూఇటూ దొర్లాడసాగాడు. బయట వర్షంకురుస్తున్న ధ్వనివినిపిస్తూవుంది. ఎక్కడినుంచో ఒకమధురమైన నవ్వు వచ్చి అతని చెవులలో ప్రతిధ్వనించ సాగింది. ఉదయం రేవులో తాను కాలుజారిపడినసంగతినిఏదోఒక ఉపాయంతో రూపుమాపేయాలని అతనిమనస్సు అదేపనిగా ఆరాట పడుతూవుంది. మాటిమాటికీ ఆవిషయమే మనసులో మెదులుతూ అమితంగా బాధ కలిగిస్తుంది. తాను అపూర్వ కుమార్ అనీ, పరాకున బురదనేలపై కాలు జారిపడ్డాడేగాని అంతమాత్రాన తాను ఏమీతెలియని పల్లెటూరి మనిషి కాదని ఆయువతికి తెలియనే తెలియదు.

మర్నాడు అపూర్వుడు ఆ అమ్మాయిని చూడటానికి వెళ్ళాలి. ఎంతో దూరం లేదు, అమ్మాయిగారిల్లు తమ యింటి ప్రక్కనే వుంది. కొంత ప్రయత్నించిన మీదటే దుస్తులు చూచుకొని సిద్ధమయ్యాడు. క్రితంరోజు తాను ధరించిన ధోవతి, వల్లెవాటూ ధరించలేదివాళ, సిల్కు లాల్చీ వేశాడు. ధనికులు ధరించే సుబ్రహ్మణి తలపాగా పెట్టాడు, కాళ్ళకు తళ తళలాడే విలువైన పాదరక్షలు వేసుకొని, సిల్కు గొడుగు తీసుకొని ఉదయమే అమ్మాయి గారింటికి బయలుదేరాడు.

కాబోయే అత్తవారింట్లో అడుగు పెట్టేసరికి అక్కడ పెద్దసంత ప్రారంభమయింది. చివరికి యథాసమయమందు కంపిత హృదయురాలగు అమ్మాయిని దులిపి శుభ్రంచేసి, అలంకరించి. జడ వేసి రిబ్బనుతో కట్టి, ఒక పల్చని రంగుచీరలో చుట్టి కాబోయే భర్త ముందుకు తెచ్చారు. వచ్చిన ఆ అమ్మాయి ఒకసారి ఒదిగి మోకాళ్ళమీదకు తలవంచుకొని మెదలకుండా జడపదార్థంమాదిరి కూర్చుంది. ఆమెకు ధైర్యం చెప్పటానికి మధ్య వయస్సులోవున్న ఒకదాసీ వెంట వుంది. ఆ అమ్మాయి తమ్ముడు పసివాడు, తమ కుటుంబంలో అనధికార ప్రవేశంచేసిన ఈ క్రొత్త వ్యక్తి యొక్క తలపాగానూ, గడియారపు గొలుసునూ, నూనూగు మీసాలనూ రెప్పవేయకుండా చూస్తూ నిల్చున్నాడు. అపూర్వుడు కాస్సేపు మీసాలు సవరించుకొని చివరకు గంభీరంగా 'ఏమి చదువుకొన్నావు?' అని ప్రశ్నించాడు.

ఆ భరణాల భారంతో కుంగిపోయి సిగ్గుతో మూట కట్టుకొనివున్న ఆ మొదుంచి అతని ప్రశ్నకుజవాబే ఇవ్వలేదు.

రెండు మూడుసార్లు అడగగా, ఆ దాసీ వీపుమీద చేయివేసి ధైర్యం చెప్పగా అప్పుడు నూతిలోనుంచి మాటాడినట్టుగా

'కుమారి బోధిని రెండో భాగం, వ్యాకరణం, భూగోళం, లెక్కలు; హిందూ దేశచరిత్ర' అని ఒక్క గుక్కలో చెప్పేసింది.

ఇంతలో బయట ఎవరో దబదబ గబగబ నడిచినట్టు విన్పించింది. ఆ మరుక్షణమందే రొప్పుతూ రోజుతూ జుట్టు ఎగవేసుకొంటూ మృగయు అక్కడ ప్రత్యక్షమయింది. ఆమె అపూర్వునివైపు కన్నెత్తికూడా చూడలేదు. తిన్నగా కాబోయే పెళ్ళికుమార్తె తమ్ముడు రాఘవుని దగ్గరకువెళ్ళి అతనిని చేతులుపట్టుకొని లాక్కుపోసాగింది. కాబోయే పెళ్లికుమార్తెను చూస్తూ నిలబడ్డ రాఘవుడు అక్కడినుంచి ఎంతమాత్రమూ కదలలేదు దాసి చాలా ఓర్పుతో ఎంతో మృదువుగా సాధ్యమైనంత తీవ్రంగా మృగయుని నిందించసాగింది. అపూర్వుడు గంభీరమైన ప్రశాంతతతో, తలవాగా వున్న తలను సాధ్యమైనంత పైకెత్తుకొని, గడ్డంమీదవున్న గాలు ముసు పూగిస్తూ ఠీవిగా కూర్చొని వున్నాడు.

తనమిత్రుడు ఎంతకూ కదలకపోవటంచూచి మృగయు చివరికి అతని నడ్డిమీద గట్టిగా ఒకగుద్దువేసింది. కాబోయే పెళ్ళికుమార్తె ముసుగుపూర్తిగా తీసివేసి తుపాకువలె వచ్చినవిసంగానే నిష్క్రమించింది. దాసీ ఓటమి నంగీకరించి మొదలకుండా చూస్తూ నిల్చుండి, లోపలలోపల ఉక్రోషపడుతోంది.

హఠాత్తుగా ముసుగుతీసివేసేసరికి ఇక్బాల్ కిలకిలనవ్వేవాడు అసంతోషంలో నడ్డిమీదపడిన దెబ్బసంగతికూడా మర్చిపోయాడు అయినా ఇటువంటివి రోజూ జరిగేవే, అందులో కొత్తఏమీ లేదు. అందుకు ఈ ఒక్క దృష్టాంతం చాలు.

మరొకసారి ఏం జరిగిందంటే మృగముఖి జుట్టువిరబోసుకొని కూర్చొనివుంది. రాజగోపాలుడు వెనకనుంచివచ్చి హఠాత్తుగా కత్తెరతో కొంచెం జుట్టుకత్తిరించాడు. దానికి మృగముఖి చాలా కోపగించుకొని అతనిచేతిలో నుంచి కత్తెర లాక్కొని చాలా నిర్దాక్షిణ్యంగా తన జుట్టంతా కత్తిరించి అతనిముఖంమీద కొట్టింది. ఆమె ఉంగరాల జుట్టంతా చెట్టునుంచి రాలిన నల్లద్రాక్షగుత్తులవలె నేలమీద పడిపోయింది. వీళ్లిద్దరిమధ్య మొదటినుంచీ ఇటువంటి ఘట్టనలు సాధారణమై పోయాయి.

ఆ తరువాత ప్రశాంతంగావున్న ఆసభ ఎంతోసేపు సాగలేదు. సిగ్గుతో మూటగట్టుకుపోయిన కాబోయే పెళ్లికుమార్తె నెమ్మదిగా లేచి దాసీవెంట లోనికివెళ్లిపోయింది. అపూర్వుడు మీసాలు సవరించుకొంటూ లేచి బయటకు వచ్చాడు, అతని విలువైన కొత్తపాదరక్షలు మాయమైపోయాయి ఎంతప్రయత్నించినా వాటిజాడ ఏమీ తెలియలేదు.

ఇంట్లోని వాళ్ళందరూ చాలా వ్యాకులపడ్డారు, చెప్పులుదొంగిలించిన అపరాధిని రకరకాలుగా తిట్టసాగారు. అయినా పాదరక్షల జాడ తెలియలేదు. చివరికి చేయునదేమీ

లేక అపూర్వుడు వదులుగావున్న ఒకపాత జతవేసుకొని ఆ బురదకోడ్డున అతి జాగ్రత్తగా నడుస్తూ ఇంటిముఖంపట్టాడు.

పూరిమధ్యవున్న చెరువుగట్టు పైకివచ్చాడు. అప్పుడు జన సంచారమేమీ లేదు. మరల పరిహాసాత్మకమైన ఆనవ్వే బిగ్గరగా విన్పించింది ఆ చెట్లచాటునుంచి వనదేవతే ఆపూర్వుడుధరించిన ఆపాత చెప్పులుచూచి నవ్వుతున్నట్టుగావుంది.

అపూర్వుడు సిగ్గుపడి అక్కడే ఆగిపోయాడు. చుట్టూ చూచాడు. ఇంతలో ఒకచెట్టు చాటునుంచి సిగ్గు సంకోచాలు లేని ఆ అపరాధిని కొత్త పాదరక్షలతో ప్రత్యక్షమై, వాటిని అక్కడవుంచి వెనుదిరిగి వెళ్ళిపోయింది. ఇంతలో అపూర్వుడు ఆమె చేతులు రెండు పట్టుకొని ఆమెను తన బంధీగా చేసుకొన్నాడు.

మృగమయి తన శక్తినంతా వినియోగించి పెనగులాడింది. ఎన్నివిధాల ప్రయత్నించినా ఆమె అపూర్వుడు పట్టు విడిపించుకోలేక పోయింది. చెట్లఆకుల సందులనుంచి ఉంగరాలజుట్టు పడివున్న ఆమెగుండ్రని ముఖంమీద సూర్య కిరణాలు పడుతున్నాయి. కుతూహల వశుడైన బాటసారి ఎవరైనా సూర్యకిరణాలు పడి మెరుస్తూవుండే చంచలమైన సెలయేటి స్వచ్ఛజలం లోపలికి చూస్తూ వున్నట్టుగా అపూర్వుడు పైకెత్తివున్న ఆమె ముఖంమీదికి వంగి కాటుక పిట్టవంటి చంచల నేత్రల్లోకి రెప్ప వేయకుండాచూచాడు. ఆ తరువాత నెమ్మదిగా ఆమె చేతుల్ని వదిలేశాడు. అపూర్వుడు ఆమెను పట్టుకొని కోపంతో దండించివుంటే ఆమెకు ఏమాత్రం ఆశ్చర్యం కలిగేదికాదు. కాని నిర్జనంగా వున్న

రోడ్డుమీద ఈ విచిత్రమైన శిక్ష సంగతి ఆమెకేమీ బోధ పడలేదు.

మరల అదే పరిహాసహాసం ఆనిర్జనపథంలో ప్రతి ధ్వనించింది. విచారభారంతో నెమ్మదిగా అడుగులు వేస్తూ అపూర్వుడు ఇంటికి చేరుకొన్నాడు.

## 3

అపూర్వుడు ఆరోజంతా ఏదో ఒకవంకతో తల్లిని తప్పించుకొని తిరిగాడు ఇంటిలోనికిసూడా వెళ్ళలేదు. ఎవ రింటికో విందుకు పిలవగా అక్కడే భోజనం చేసివచ్చాడు. అపూర్వుని వంటి చదువుకొన్న నవయువకుడు సాధారణ చదు వులు చదివిన ఒక బాలిక ఎదుట దాగివున్న తన గౌరవ ప్రతిష్ఠలను, ఆంతరిక మహత్తును పూర్తిగా విప్పి చెప్పాలని ఎందుకింత ఆరాటపడుతున్నాడో చెప్పటం చాలాకష్టం. ఒక పల్లెటూరి సామాన్యబాలిక తనను సామాన్య యువకుడని అనుకొంటే వచ్చిననష్టమేముంది? ఒక క్షణకాలంపాటు ఆమె పరిహాసించి నప్పటికీ అంతలోనే అతని అస్తిత్వమును ఏఅటక మీదనో వదలి రాఖాలుడనే ఈ అమాయకపు పిల్లాడితో ఆడుకోవాలనుకొంటే. అందులో అపూర్వునికి వచ్చిన నష్ట మేముంది?

తననుగురించి తాను 'విశ్వదీప్' అనే మాసపత్రికలో గ్రంథవిమర్శన వ్రాస్తూవుంటాడని. తనసూటుకేసులో ఎసెంన్సులు, పాదరక్షలు, అందమైన కాగితాలు, హార్మో నియం శిక్షణ అనుపుస్తకము, యీ మినీ గర్భములోదాగి

ప్రకాశించుటకు సిద్ధముగావున్న ఉపోదయుంవంటి పూర్తిగా వ్రాసిన, వ్రాతప్రతి ఒకటి వున్నాయని ఈపిల్లలఎదుటచూపర్చవలసిన అవసరమేముంది? కాని మనస్సు ఊరడించడంకష్టమై పోయింది. ఈ గ్రామీణ చంచల బాలికఎదుట బి. ఎ చదివిన శ్రీ అపూర్వకుమార్ ఓటమిని అంగీకరించుటకు ఏ విధంగానూ సిద్ధంగా లేడు.

సాయంత్రం అపూర్వుడు ఇంటిలో అడుగుపెట్టగానే అతనితల్లి 'ఏమినాయనా, అమ్మాయిని చూచివచ్చావా ! నీకు నచ్చిందా?' అని అడిగింది.

అపూర్వుడు కొంచెం సిగ్గుపడుతూ చూచివచ్చాను అమ్మా! వారిలో నాకు ఒకబాలిక నచ్చింది' అని జవాబు చెప్పాడు.

తల్లి ఆశ్చర్యపడుతూ 'అక్కడనువ్వు ఎందరు అమ్మాయిల్ని చూచావు?' అని అడిగింది.

మరినాలుగయిదు ప్రశ్నలడిగిన తరువాత చివరికి తల్లి తెలుసుకొన్నదేమంటే తనకొడుకు పొరుగు ఇంటి శారద కూతురు మృగమయి తనకుమారునికి నచ్చిందట. ఇంత చదువు చదివి ఇటువంటికోర్కె కోరటం ఆమెకు చాలా ఆశ్చర్యం కల్గించింది. కోపంకూడా వచ్చింది.

కాని పర్యవసానంగా చివరికి ఆమె మొరాయించిన మూర్ఖపు గుర్రంవలె తలపెడసరంగాతిప్పి ఒక అడుగువెనక్కి తగ్గి 'అయితే, నేనివివాహం చేయనుపో' అనిఅంది.

అయినప్పటికీ ఆమె కుమారుని వివాహం జరిపించక తప్పలేదు.

ఆ తరువాత అధ్యాయనం ప్రారంభమయింది. అపూర్వుని తల్లియొక్క ఇంటిలోనికి రాగానే ఒకేరాత్రిలో మృగమయి యొక్క సమస్త ప్రపంచానికీ సంకెళ్లు పడ్డాయి.

అత్తగారు కోడల్ని సాక్కరించటం ప్రారంభించింది. ఆమె కొంచెం కఠోరభంగిమలో 'మామకమ్మాయీ, నువ్విప్పుడు చిన్నపిల్లవు కావు—మాఇంట్లో ఇటువంటి సిగ్గుమాలిన పనులు పనికిరావు' అని చెప్పింది.

అత్తగారు ఈమాట ఏభావంతో చెప్పిందో, మృగమయి దానిని ఆవిధంగానే అర్థంచేసుకోలేదు. ఈఇంట్లో పిలుపడకపోతే మరెక్కడికైనా వెళ్లాలేమో అని ఆమెఅనుకొంది. మధ్యాహ్నం తరువాత ఆమె ఇంటిలోనే కన్పించలేదు. 'ఎక్కడికి వెళ్ళింది? ఎక్కడికి వెళ్లింది?' అనిపెద్దగోల బయలుదేరింది ఆమెను వెదకటారంభించారు. చివరికి విశ్వాసఘాతకుడైన రాఖాలుడు ఆమె ఉనికిని గురించి తెలియజేసి ఆమెను పట్టించాడు. మర్రిచెట్టుక్రింద వున్న శ్రీ రాధాకాంతస్వామివారి పాతరథంలో దాగివుంది.

అందరి ఎదుటా తల్లీ, ఇరుగుపొరుగు స్త్రీలూ ఆమెను ఎన్నితిట్టారో, ఎంతగట్టిగా కోప్పడ్డారో మీరే వూహించుకోవటం మంచిది.

రాత్రికి మబ్బులు దట్టంగా పట్టాయి. జోరుగా వర్షం ప్రారంభమయింది. అపూర్వుడు మెల్లగా లేచి ఆమె మంచం దగ్గరకు వెళ్ళి చెవిలో 'మృగమయీ, నువ్వు నన్ను ప్రేమించటంలేదా?' అని అడిగాడు.

మృగమయి వెంటనే తీవ్రంగా 'లేదు, నేను నిన్నేమీ ప్రేమించటంలేదు' అని తనకోపాన్నంతా అపూర్వుని మీద చూపించింది.

అపూర్వుడు ఖిన్నుడై 'ఎందుకని? నేనునీకేమి అపకారం చేశాను?' అని అడిగాడు. అపూర్వుడు తనలోతానే ఈ విద్రోహిని యొక్క మనస్సును ఏవిధంగానైనాసరే వశపర్చుకు తీరాల్సిందే అనుకొన్నాడు.

మర్నాడు మృగమయితో విద్రోహ లక్షణాలన్నీ చూచి అత్తగారు ఆమెను లోన గదిలో బంధించింది. కొత్తగా పంజరంలోచిక్కిన పక్షివలె మొదట గదిలో విలవిలలాడిపోయింది, కాని పారిపోయేమార్గమేదీ కన్పించక చివరకు చేయునదేమీలేక కోపోద్రేకంతో మంచంమీది దుప్పటిని పళ్ళతో పీకముక్కలుచేసి నేలమీద బోర్లాపడుకొని, తండ్రిని తలచుకొంటూ ఏడ్వసాగింది.

సరిగా అదేసమయానికి మెల్లగాఅపూర్వుడుఆమెసమీపానికివచ్చికూర్చున్నాడు ధూళిధూసరితమైవున్న ఆమె జుట్టును బుగ్గలమీదినుంచి ప్రేమతోపైకితీస్తూ కూర్చున్నాడు మృగమయి అతనిచేతిని తోసేసింది. అపూర్వుడు మెల్లగా ఆమె చెవిలో 'ఎవరూ చూడకుండా తలుపు తెరిచాను, లే, మొదల కుంటాతోటలోకి వెళ్దాంరా' అని చెప్పాడు.

మృగమయి తల అడ్డంగా తిప్పుతూ 'రాను' అన్నది. అపూర్వుడు ఆమెగడ్డంపట్టుకొని పైకెత్తటానికి ప్రయత్నిస్తూ 'ఎవరువచ్చారో ఒకసారి అటుచూడు', అన్నాడు. నేలమీద బోర్లాపడివున్న మృగమయివంక రెప్పవేయకుండా చూస్తూ రాఖాలుడు గడపలో నిలబడివున్నాడు. మృగమయి తలపైకెత్తకుండానే అపూర్వుని చేతిని తోసేసింది.

'చూడు, రాఖాలుడు నీతో ఆడుకోవాలని వచ్చాడు. అతనితో ఆడుకోవా?' అనిఅడిగాడు అపూర్వుడు.

మృగమయి కుపితురాలై 'నేనురాను' అని గట్టిగా చెప్పింది. పరిస్థితికొంచెం విషమంగా వుందని గ్రహించి రాఖాలుడు మెల్లగా అక్కడినుంచి జారుకున్నాడు. అపూర్వుడు మెదలకుండా అక్కడే కూర్చున్నాడు. మృగమయి ఏడ్చి ఏడ్చి నిద్రపోయింది. అప్పుడతడులేచి మెల్లగా తలుపులు మూసి చప్పుడు కాకుండా అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

అమర్నాడు తండ్రివద్దనుంచి మృగమయికి ఒక ఉత్తరం అందింది. దానిలో అత్యంత ప్రియకుమార్తె మృగమయి వివాహానికి తాను రాలేకపోయినందుకు ఎంతో దుఃఖిస్తూ నూతన వధూవరులను ఆశీర్వదించాడు.

మృగమయి అత్తగారి దగ్గరకువెళ్ళి 'నేను మానాన్న దగ్గరకు వెళతాను' అని అడిగింది. కోడలియొక్క ఈఅసంభవ ప్రార్థనను తేలిగ్గా నిరాకరిస్తూ 'నాదగ్గర ఇటువంటి గారాబాలు పనికిరావు. మీనాన్నకు ఒక ఠికాణావుంటేగదా నువ్వు అతనిదగ్గరకు వెళతావు. ప్రపంచంలో ఎవరూచేయని విచిత్రాలు చేస్తూవుంటావు' అని కోపగించుకొంది.

కోడలు జవాబేమీ చెప్పలేదు. తనగదిలోకి వెళ్ళి లోపలనుంచి తలుపులు వేసుకొంది. పూర్తిగా నిరాశచెందిన మనిషి దైవాన్ని వేడుకొన్నమాదిరిగా మృగమయి 'నాన్నా, నన్నిక్కడినుంచి తీసుకువెళ్లు. ఇక్కడ నాకెవ్వరూలేరు. నేనిక్కడవుంటే ఎంతోకాలం బ్రతకను' అని చెప్పసాగింది.

రాత్రి బాగాప్రొద్దుపోయిన తరువాత, భర్త గాఢ నిద్రలో మునిగిపోగానే ఆమె లేచి తలుపుతెరచుకొని బయటకు వెళ్ళింది. మబ్బులుదట్టంగాపట్టి ఉరుముతున్నాయి. అయినా ఆమె మెరుపుల సహాయంతో దారి స్పష్టంగా కన్పిస్తూవుంది. నాన్న దగ్గరకు ఏమార్గాన వెళ్లాలో మృగమయికి ఏమీ తెలియదు. పోస్టుబంట్రోతు ఉత్తరాలు తీసుకువచ్చేమార్గాన వెళితే ప్రపంచంలో ఎక్కడికైనా వెళ్ళవచ్చునని ఆమె నమ్మకం. అందుకని మృగమయి అదేమార్గాన బయలుదేరింది. నడిచి నడిచి ఆమె శరీరమంతా విరగ్గొట్టినట్లు నొప్పిగావుంది. తెల్లవారవస్తుంది, పక్షులు రెక్కలల్లార్చి అరవబోతూ వేళతెలియక సందేహిస్తూవున్నసమయానికిమృగమయి నదీతీరానవున్న సంతలో అడుగుపెట్టింది. తరువాత ఎటు వెళ్లాలా అని ఆలోచిస్తూవుండగా పరిచితమైన పాదధ్వని విన్పించింది. మరికాస్సేపటిలో ఉత్తరాలసంచిని భుజాన వేసుకొని రొప్పుతూ రొజుతూ తపాలాబంట్రోతు అక్కడికి చేరుకొన్నాడు. మృగమయి వెంటనే అతని దగ్గరకువెళ్లి 'నన్ను నాన్నగారిదగ్గరికి కుషీగంజ్ తీసుకువెళ్తావా?' అని అడిగింది.

'కుషీగంజ్ ఎక్కడున్నదో నాకు తెలియదు' అని క్లుప్తంగా జవాబుచెప్పి అతను రేవులోకి వెళ్లిపోయాడు. రేవులోవున్న తపాలా నావవద్దకువెళ్ళి నావనడిపే వానిని మేల్కొల్పి బయలుదేరాడు. అప్పుడు అతనికి ఇతరులమీద జాలిచూపే అవకాశంగానీ, ఇతరులను గురించి అడిగితెలుసుకొనే తీరికగానీ లేవు.

చూస్తూచూస్తూ వుండగానే తెల్లవారింది. అందరూ మేల్కొన్నారు. మృగమయి రేవులోకివెళ్ళి ఒకపడవవానిని 'నన్ను కుషీగంజ్ తీసుకువెళ్ళగలవా?' అనిఅడిగింది

ఆ నావికుడు జవాబు చెప్పేలోపల ప్రక్కనేవున్న పడవలోని నావికుడు 'ఎవరువారు? మృగీతల్లీ! నువ్విక్కడికెలా వచ్చావమ్మా?' అనిఅడిగాడు.

మృగమయికి ప్రాణం లేచివచ్చినట్టయింది. 'వనమాలీ, నేను నాన్నగారి దగ్గరకు కుషీగంజ్ వెళతాను, నీపడవలో నన్ను తీసుకు వెళతావా?' అని అడిగింది ఆదుర్దాగా.

వనమాలి వాళ్ళగ్రామం వాడే ఈ విశ్శృంఖల బాలికను బాగా ఎరిగినవాడు. 'నాన్నగారి వద్దకు వెళ్తావా అమ్మా! రా. నేను తీసుకువెళతాను' అన్నాడు ఆనావికుడు.

మృగమయివెళ్లి ఆపడవలో కూర్చుంది. నావికుడు పడవను వదలాడు, మేఘాలు కన్నీరు కార్చటం ఆరంభించాయి. శ్రావణ మేఘాల మాదిరి బాగా నిండుగావున్న నదిలో చిరుతరంగాలు లేస్తూ పడవనుఅటూఇటూ వుయ్యాల ఊపుతున్నాయి. మృగమయి శరీరమంతా అలసివుంది, నిద్ర ముంచుకొస్తుంది. పైటచెంగుపరుచుకొని పడుకొంది. పడుకో

గానే ఆచంచలమైన నవయువతి నదీతరంగాలపై వూగు తున్న పడవలో ప్రకృతియొక్క స్నేహఛాయలో పుట్టిపెరిగిన శిశువువలె నిర్భయంగా నిద్రపోయింది.

నిద్రమేల్కొని చూచుసరికి ఆమె తన అత్తవారింటిలో వుంది. ఆమె మేల్కొనటం చూచి పనిమనిషి గొణగ సాగింది. ఇదివిని మృగమయి అత్తగారుకూడా అక్కడికివచ్చి కూతుర్ని ఈవిధంగా తయారుచేసినందుకు ఆమె తండ్రిని నిందించసాగింది. తండ్రిని నిందించటం వినగానే మృగమయి లేచిగబగబ ప్రక్కగదిలోకిదూరి తలుపులు వేసుకొంది.

అపూర్వుడు సిగ్గుపడటం అలావుంచేసి 'అమ్మా, కోడల్ని రెండుమూడు రోజులపాటు పుట్టింటికి పంపటంవల్ల నష్టమేముంది' అన్నాడు తల్లితో.

తల్లి అపూర్వుని దూషిస్తూ 'నాకడుపున చెడిపుట్టావు. ప్రపంచంలో అమ్మాయిలెందరో వుండగా వెతికి వెతికి ఈ సిగ్గుమాలిన దానిని తెచ్చి నానెత్తిన పెట్టావు' అనిఅంది.

నిర్దోషి అయివుండికూడా అపూర్వుడు ఇటువంటి దూషణలు వినవలసి వచ్చింది.

౭

ఆరోజుపగలంతా బయటవర్షమూ, ఇంట్లోకన్నీరు ఆగకుండా కురుస్తూనే వున్నాయి.

మర్నాడు అర్ధరాత్రివేళ అపూర్వుడు మెల్లగా మృగమయి వద్దకువెళ్లి 'మృగమయీ, నువ్వు మీనాన్నగారి దగ్గరకు వెళ్ళాలనుకుంటున్నావా?' అని అడిగాడు.

మృగమయి త్రుళ్ళిపడి వెంటనే కృతజ్ఞతతో అపూ ర్వుని చెయ్యిగట్టిగపట్టుకొని 'అవును' అని అంది,

'అయితే బయుల్దేరు మనిద్దరమూ దొంగతనంగా వెళ్ళి పోదాం. రేవులో మనకోసం నేను ఒకపడవనుకూడా ఏర్పాటు చేశాను' అన్నాడు అపూర్వుడు.

మృగమయి ఈసారి కృతజ్ఞతా పూర్వకంగా అపూ ర్వుని వంకచూచింది. ఆతరువాత వెంటనే లేచి దుస్తులు మార్చుకొని బయలుదేరింది. తల్లిగాబరా పడకుండా అపూ ర్వుడు చిన్నచీటీవ్రాసిపెట్టి నిశ్శబ్దంగావున్న ఆరాత్రివేళ ఇంటి నుంచి బయలుదేరాడు.

మృగమయిఆనిశ్శబ్దమైనప్రశాంతఅంధకారంలో మొట్ట మొదటిసారి మనస్ఫూర్తిగా విశ్వసించిభర్తచేతిని పట్టుకొంది.

నిశ్శబ్దమైనా ఆరాత్రే పడవరేవువదలి బయలుదేరింది ఎంతో సంతోషంగా వున్నప్పటికీ మృగమయి వెంటనే నిద్ర పోయింది. మర్నాడు సర్వమూ ఆనందమయంగా వుంది. అటూఇటూ పోయే నావలకు అంతులేదు. నదిఒడ్డున అనేక సంతలు, పొలాలు, అడవులు కన్పిస్తున్నాయి. వాటిని చూచి మృగమయి 'ఆపడవలో ఏమున్నది? ఆజనులుఎక్కడి నుంచి వస్తున్నారు? ఇది ఏసంత? ఈఅడవి పేరేమిటి?' అని ప్రశ్నించసాగింది. ఈప్రశ్నలు అతనికి తనకాలేజీ పుస్తకా లలో కన్పించలేదు. కలకత్తామహానగరంలో ఇటువంటి అను భవమూ అతడు సంపాదించలేదు. అయినప్పటికీ ఆమెను సంతృప్తిపరచటానికి అతనుచెప్పిన జవాబులు ఆమెకుచాలా సంతోషం కలిగించాయి.

మర్నాడు సాయంత్రం పడవ కుష్టుగంజ్ రేవులోకి చేరుకొంది. అక్కడికి దగ్గరలోనేవున్న రేకులషెడ్డులో మురికి ధోవతిధరించి, వికృతంగావున్న పెద్దలాంతరు ఒకటి వెలిగించుకొని, చిన్నడస్కుమీద లావాటి రిజిష్టరును ముందేసుకొని, చొక్కావేసుకోకుండా లుమీదకూర్చొని ఈశానచంద్రుడు ఏదో వ్రాసుకొంటున్నాడు. అదేసమయాన నవదంపతులు షెడ్డులోకి ప్రవేశించారు. 'నాన్నా' అని పిలిచింది మృగనయని. ఆషెడ్డులో నేటివరకు ఇటువంటి మృదుధ్వని ఈవిధంగా ఇంతకుముందెన్నడూ విన్పించి వుండలేదు.

ఈశానుని నేత్రాలు ఆనందాశ్రువులు కురిపించాయి. ఏమిచేయాలో వెంటనే అతనికేమీ తోచలేదు. తన కుమార్తె అల్లుడూ అతనికి యువరాణి, యువరాజువలె కన్పించారు. ఈ జనపనార కట్టలలో వారికి కూర్చునేందుకు స్థలం ఎలాగు ఏర్పాటు చేయాలి? ఆవిషయమే తెమలక చస్తూవుండగా భోజనం ఏర్పాట్లవిషయం మరింత కలవరపర్చింది. మరి ఇదికూడా ఆలోచించాల్సిన విషయమే. నిర్ధనుడైన తండ్రి ఏదోవిధంగా పప్పుతో నాలుగు మెతుకులు తిని సరిపెట్టుకుపోతున్నాడు. కాని నేడు ఈసంతోష సమయంలో వారికి ఏమిపెట్టాలి? ఏమిచేయాల్సి వుంటుంది?

తండ్రి సందేహిస్తూ వుండటంచూచి మృగనయని 'నాన్నగారూ, ఇవాళ మనందరమూ కలిసివంటచేసుకొందాం అనిఅంది.

అపూర్వుడు ఈ కొత్తసూచనకు తన ఉత్సాహాన్ని ప్రకటించాడు. ఆచిన్న షెడ్డులో తగినంత స్థలమూ లేదు,

పరిచారిక ఎవరూ లేరు, భోజనసామగ్రి చాలా తక్కువగా వుంది. సన్నని బెజ్జంలోనుంచి నీళ్ళు ఏవిధంగా నైతే వేగంగాపైకి చిమ్ముతాయో అదేవిధంగా లేమియొక్క సూక్ష్మ రంధ్రంనుంచి సంతోషం తీవ్రగతిని పైకి వెల్లుబికింది.

ఈవిధంగా మూడురోజులు గడిచిపోయాయి. రోజూ రెండుసార్లు నిర్ణీత సమయానికి స్టీమరువచ్చేది, ప్రయాణికుల రాకపోకలతో కొంచెం సందడిగా వుండేది. కాని సాయంత్ర మయేసరికి నదీతీరం పూర్తిగా నిర్జనమైపోయేది. అప్పుడు అపూర్వుడు ఒక విలక్షణమైన స్వేచ్ఛాభావాన్ని అనుభవించేవాడు. ముగ్గురూ కలిసి ఏవేవో వండేవారు. ఆతరువాత కొత్తగాజులు తొడిగిన చేతులు దానిని వడ్డించటం, మామ అల్లుడు ఏకపంక్తిని భుజించటమూ, కొత్తఇల్లాలి లోటుల్ని ఎత్తిచూపటమూ, అందుకు మృణ్మయి అభిమాన పడటమూ, వీటన్నిటితో అందరి మనసులూ పులకించేవి.

చివరికి అపూర్వుడు ఇక ఎక్కువరోజులు ఉండటం మంచిది కాదని చెప్పాడు. మృణ్మయి మరికొద్దిరోజులు వుందామని వేడుకొన్నది కాని ఈశానబాబుకూడా 'వద్దు, వెళ్ళండి' అనేచెప్పాడు.

కుమార్తెను సాగనంపేముందు ఈశానచంద్రుడు కుమార్తెను దగ్గరకు తీసుకొని ప్రేమతో తలనిమురుతూ 'అమ్మా, అత్తవారింటికీ పుట్టినింటికీ వెలుగువే. లక్ష్మివలె వుండు. నన్నెవరూ వేలెత్తిచూపకుండా వుండాలంటే వినయ విధేయతలతో వుండు' అని చెప్పాడు.

మృగమయి కంటనీరెట్టుకొని భర్తవెంట బయలు దేరింది. ఈశానబాబు తనపెద్దింట్లోకి తిరిగివచ్చి తనపూర్వపు నియమానుసారంగా సరుకు తూకంవేస్తూ రోజులు నెలలు గడప సాగాడు.

౬

ఇద్దరు అపరాధులజంటా తిరిగి ఇంటికి చేరుకొన్న ప్పుడు తల్లి చాలాగంభీరంగావుంది. ఎవరినీ ఏమీ అనలేదు. ఆమెయొక్క ఈశాంత అభియోగం. ఈమౌన అభిమానం పర్వతంవలె సంసారాన్ని నిశ్చలంగా అణచివుంచింది. ఆమె ఎవరియెడలా అసహనాన్నిగాని, కోపాన్నిగాని ప్రదర్శించ లేదు.

రానురాను అది దుర్భరముకాగా అపూర్వుడు 'అమ్మా, కాలేజి తెరిచారు నేను న్యాయశాస్త్రం చదువు తాను 'అని అన్నాడు.' కోడల్ని ఏమిచేసివెళతావు?' అని అడిగింది ఆమె తటస్థభావంతో.

'ఇక్కడే వుంటుంది' అన్నాడు అపూర్వుడు.

'ఇక్కడ వద్దునాయనా, ఇక్కడ ఆమె అవసరంలేదు. నీవెంట తీసుకువెళ్ళు.'

'సరే, నీయిష్టం' అన్నాడుఅపూర్వుడుఅభిమానంతో.

కలకత్తా వెళ్ళటానికి ఏర్పాట్లు చేస్తుందితల్లి, వెళ్ళ టానికి ఒకరోజు ముందుగా రాత్రి నిద్రపోటానికి తనగదిలోకి వెళ్లిన అపూర్వుడు మృగమయి మంచం మీదపడి ఏడుస్తూ వుండటం చూచాడు.

మనసులో చాలా బాధపడి 'మృగమయీ! నావెంట కలకత్తా రావటం ఇష్టంలేదా?' అనిఅడిగాడు.

'లేదు.'

'నువ్వు నన్ను ప్రేమించటం లేదా?'

ఈ ప్రశ్నకు జవాబేమీ దొరకలేదు. సాధారణంగా ఇటువంటి ప్రశ్నకు జవాబు చాలా తేలిగ్గానే వుంటుంది. కాని ఒక్కొక్కప్పుడు కన్యనుంచి సరిగా దానికి జవాబును ఆశించలేము.

'రాఖాలును వదలి రావటానికి ఇష్టంలేదా?' అని అడిగాడు అపూర్వుడు.

'అవును' అని మృగమయి చాలా తేలిగ్గాచెప్పింది.

ఇదివిని బి. ఎ ప్యాసయిన అపూర్వుని హృదయంలో వేలెడంతవున్న రాఖాలుని మీద ఈర్ష్య జనించింది.

'చాలా కాలం ఇక ఇంటికి రాను. రెండుమూడు సంవత్సరాలు కావచ్చు. మించవచ్చునేకాదాను' అన్నాడు.

ఆవిషయాన్ని గురించి ఏమీ అనకుండానే మృగమయి ''తిరిగి వచ్చేటప్పుడు రాఖాలుని కోసం ఒకమంచి రాజా చాకు తీసుకురండి' అనిచెప్పింది.

పడుకొనివున్న అపూర్వుడుకొంచెంపైకిలేచి 'అయితే నువ్విక్కడే వుంటావా?' అన్నాడు.

'మా అమ్మదగ్గరకు వెళ్లి వుంటాను' అనిచెప్పింది మృగమయి.

అపూర్వుడు చల్లగా నిట్టూర్చి 'సరే, అక్కడేవుండు. నువ్వు రమ్మని ఉత్తరం వ్రాసేసరకు నేను అక్కడేవుంటాను.

ఇప్పుడిక సంతోషమేగదా!' అన్నాడు

మృగమయి ఈ ప్రశ్నకు జవాబు చెప్పటం వ్యర్థమని భావించి నిద్రపోసాగింది. కాని అపూర్వునికి కంటిమీద కునుకు లేదు. తలగడాను ఆనుకొని అలాగే కూర్చొని వున్నాడు.

రాత్రి చివరిజాములో చంద్రుడు ఉదయించాడు. వెన్నెల మంచంమీద పడుతోంది. అపూర్వుడు ఆ వెలుగులో మృగమయి ముఖంలోకి చూచాడు. చూడగాచూడగా కథల్లోని రాజకుమార్తెను ఎవరో వెండిబెత్తాన్ని తాకించి చైతన్యవిహీనురాలిగా చేసినట్టనిపించింది. ఒకసారి మరల బంగారుబెత్తంతో తాకితే నిద్రించే ఆ ఆత్మను మేల్కొల్ప వచ్చును. వెండిబెత్తము పరిహాసము బంగారుబెత్తము స్వేచ్ఛ ఐనదిన్నా.

తెల్లవారకముందే అపూర్వుడు మృగమయిని నిద్ర మేల్కొల్పాడు. 'మృగమయీ, నేను వెళ్ళటానికి సమయమయింది, బయల్దేరు, నిన్ను మీయింటికి పంపివస్తాను' అన్నాడు.

మృగమయి లేచి ప్రయాణమయింది అపూర్వుడు ఆమె రెండుచేతులూ పట్టుకొని 'నాదొకవిన్నపం, నేను అనేకసార్లు నీకు సహాయం చేశాను. ఇవాళ పరదేశానికి వెళ్ళేటప్పుడు నాకు దానికి బహుమానం ఇవ్వగలవా?' అని అడిగాడు.

'ఏమిటది?' అని అడిగింది మృగమయి ఆశ్చర్యంతో.

'స్వేచ్ఛగా ఒకముద్దివ్వు' అన్నాడు అపూర్వుడు.

అపూర్వుని యొక్క ఈ విలక్షణ పిన్నపనమూ, అతని శాంతముఖమూ చూసి మృణ్మయి నవ్వసాగింది. అతి కష్టంతో నవ్వును ఆపుకొని ముద్దివ్వటానికి ముందుకువచ్చింది అతని ముఖానికి దగ్గరగా ముఖం పెట్టి వుంచలేక మరల కిలకిల నవ్వేసింది. ఈవిధంగా రెండుసార్లు చేసి చివరకి పైటకొంగుతో ముఖంకప్పుకొని నవ్వసాగింది. ఏమీ ప్రయోజనం లేక అపూర్వుడు శిక్షించుకున్నట్టుగా ఆమె చెవిపట్టుకొని లాగాడు,

బలవంతాన మృగ్మయి నుంచి ఏమీ పొందను అని అపూర్వుడు గట్టిగా నిశ్చయించుకొన్నాడు. ఇది తనకు అవమానమే అతని ఉద్దేశం. తనచేతులతో తాను తీసుకోవటం గాక దేవతల వలె సగౌరవంగా స్వేచ్ఛగా తనకు అర్పించిన కానుకలను స్వీకరించాలని అతని కోర్కె.

మృణ్మయి ఇకనవ్వలేదు. సూర్యోదయం అవుతూ వుండగా అపూర్వుడు ఆమెను తల్లిదగ్గరకు పంపివచ్చాడు. తిరిగివచ్చిన తరువాత తల్లితో 'అమ్మా, కోడల్ని కలకత్తా తీసుకు వెళ్ళటంవల్ల చదువు పాడవుతుందని సందేహంగా వుంది. బాగా ఆలోచించి చూచాను. పైగా అక్కడ ఇంట్లో పగలంతా ఒక్కతే పడివుండాలి ... ఇక్కడ ఉండటం నీకు ఇష్టంలేదుగనుక ఆమెను తల్లివద్దకు పంపివచ్చాను' అని చెప్పాడు. ఈవిధంగా గర్వభంగంతో తల్లికొడుకులు వేరై పోయారు.

౭

తల్లి దగ్గరకు వచ్చిన తర్వాత ఇక్కడ తనకేమీ తోచటం లేదని మృణ్మయి గ్రహించింది. ఈ ఇంటిలో

ఏమి మార్పువచ్చిందో ఏమోగానీ ఎంతకూ కాలం గడవటమే కష్టంగావుంది. ఏమిచేయాలో, ఎక్కడికి వెళ్ళాలో, ఎవరిని కలుసుకోవాలో ఆమెకేమీ బోధపడకుండావుంది.

కొద్దిరోజులు గడిచేసరికి ఇంట్లోనూ, గ్రామంలోనూ మనుష్యులెవరూ లేనట్లనిపించిందామెకు. మొదట లేనిది ఇప్పుడు ఆమె మనస్సు కలకత్తా వెళ్ళటానికి అమితంగా ఆరాటపడుతుంది. ఈమార్పు ఆమెకేమీ అర్థం కాలేదు. చెట్టునుంచి రాలిన ఎండుటాకులలెనే తన గత జీవితాన్ని ఆమె నేడు తన ఇష్టప్రకారమే అనాయాసంగా పారవేయగలిగింది.

పూర్వకాలంలో మానవుడు చాలా పదునైన ఆయుధాలు తయారు చేసేవాడని కథలో చదువుతూ వుంటాము. ఆ ఖడ్గముతో మనిషిని రెండు ముక్కలుగా నరికినా కదిలించనంతవరకు రెండు ముక్కలయిన సంగతి అతను గ్రహించనేలేడట. ఆ విధంగానే విధియొక్క ఖడ్గముకూడా చాలా సూక్ష్మమైనది. మృగమయియొక్క బాల్యాన్నీ యౌవనాన్నీ నరికి ఎప్పుడు వేరుచేశాడో కూడా ఆమె తెలుసుకోలేకపోయింది. ఇవాళ కొంచెం ఆమె కదిలేసరికి బాల్యం యౌవనాన్నుంచి విడిపోయి దూరంగా పడింది.

పుట్టింటిలో, ఆమెకు చిరపరిచితమైన తన గది ఇప్పుడు తనదిగా కన్పించటంలేదు. అక్కడ వుంటూకూడా తాను ఇక్కడ ఎప్పుడూ వున్నట్టు అనిపించేదికాదు. ఇప్పుడామె హృదయంలోని సమస్త స్మరణశక్తి, వేరొక ఇంటిలో, వేరొక శయ్యచుట్టూ ప్రదక్షిణిస్తూ తిరుగుతుంది. మృగమయి ఇప్పుడు బయట కనిపించటంలేదు. ఆమె యొక్క బాల్య మిత్రుడు

రాక్షసాలుగు ఆమెను చూచి భయపడిపారిపోతున్నాను. ఇప్పుడు ఆమెకు ఆటువంటి శౌర్యం లేనే లేదు.

'అమ్మా, నన్ను అత్తగారింటికి పంపు' అని అడిగింది మృగనయని తల్లిని.

కలకత్తా వెళ్ళినప్పుడు కుమారుడు బాధపడిన సంగతి గుర్తు తెచ్చుకొని అపూర్వుని తల్లి చాలా బాధపడసాగింది. కోపంవచ్చి కోడల్ని పుట్టింటికి పంపివచ్చాను, ఇది ఆమెను మరింత బాధించసాగింది.

ఇంతలో ఒకనాడు ముసుగు వేసుకొని మృగనయని రానేవచ్చింది. ఆమెముఖం పూర్తిగా వాడిపోయింది. ఆమె అత్తగారి పాదాలకు నమస్కరించింది. ఆశీర్వదించటానికి బదులు అత్తగారు ఏడుస్తూ మృగనయని తన హృదయానికి హత్తుకొంది. ఆక్షణంలోనే ఇద్దరూ ఐక్యమై పోయారు. మృగనయని ముఖంచూచి అత్తగారికి చాలా ఆశ్చర్యం కలిగింది. పూర్వపు మృగనయని కాదు ఈమె. ఈవిధమైనమార్పు అందరికీ సాధ్యం కాదు. ఇటువంటి మార్పుకు చాలాశక్తి కావాలి. కోడల్ని క్రమంగా మార్చాలని అత్తగారు నిశ్చయించుకొంది, కాని సృష్టికర్త అంతకుముందే నూతన జీవితాన్ని ప్రసాదిస్తాడు ఈమెకు.

ఇప్పుడు అత్తకోడలూ ఒకర్నొకరు పూర్తిగా అర్థం చేసుకొన్నారు. ఇన్నాళ్ళూ నన్ను నేను తెలుసుకోలేకపోయాను నువ్వయినా ఎందుకు నాకు తెలియచెప్పలేదూ! నువ్వు నన్నెందుకు దండించలేదు! నీ ఆజ్ఞానుసారంగా నన్నెందుకు నడపలేదు! కలకత్తా రావటానికి నేను నిరాకరించినప్పుడూ నన్ను

బలవంతాన ఎందుకు తీసుకుపోలేదు? నామాటను ఎందుకు చెల్లించావు? నా కోర్కెల ముందు ఎందుకు తలవంచావు? నా తిరస్కారాన్ని ఎందుకు భరించావు?' అని ఆమె దుఃఖిస్తూ అపూర్వుని ఉద్దేశించి అంది.

ఆ తరువాత, ఆనాడు ఉదయం చెరువుగట్టున అపూర్వుడు తన రెండు చేతులు పట్టుకొని మౌనంగా తన కళ్ళల్లోకి చూచిన సంగతి గుర్తొచ్చింది. దానిలోని అర్థం ఇప్పుడు ఆమెకు బోధపడింది. ఆనాటి ఆ చెరువు, ఆదృశ్యమూ ఆమె హృదయంలో నిండిపోయింది. ఆ తరువాత విడిపోయే సమయంలో అపూర్వుడు ముద్దు అడగటం అది అసంపూర్తిగా వుండిపోయినసంగతిగుర్తొచ్చింది. అసంపూర్తిగా వుండిపోయిన ఆముద్దుఎడారిలోని ఎండమావివలెకన్పించసాగింది. ఆమెహృదయం దాహార్తి లేడివలె తీవ్రగతిని గతించిన రోజుల వైపుకు పరుగెత్తసాగింది. కాని ఏవిధంగానూ దాహం చల్లారలేదు. ఇప్పుడు ఇక మాటికి మాటికి అవిషయమే ఆమె మనసులో మెదలసాగింది.

మృగమయి తనను పూర్తిగా అర్థంచేసుకోనందుకు అపూర్వుడు చాలా దుఃఖించేవాడు. ఇప్పుడు మృగమయి కూడా కూర్చొని అవిషయమే-ఆయన తనను ఏమి అనుకొని వుంటారో, ఏమి ఆలోచిస్తూవుంటారో, అనే ఆలోచించుకొంటూవుంది. తనభర్తకు ఇవ్వలేకపోయిన ప్రేమను, ఆమె అపూర్వుని తలగడకు ఇవ్వసాగింది. అతని ప్రేమ తృష్ణను తీర్చలేక పోయినందుకు సిగ్గుతో కుంగిపోసాగింది.

ఈవిధంగా చాలా రోజులు గడిచాయి.

నువ్వు రకర్మాని వృత్తరం వ్రాసేంతవరకూ నేను రాను అని అపూర్వుడు చెప్పేవెళ్ళాడు. ఆ పిమ్మట సుస్తూరాగానే మృగమయి గదిలోకి వెళ్ళి తలుపులు వేసుకొని అపూర్వునికి ఉత్తరం వ్రాయసాగింది. చేతినిండా సిరా పూసుకొని వంకర టింకరగా సంబోధన ఏమీ లేకుండానే ఉత్తరం వ్రాసేసింది. నువ్వు నాకు ఉత్తరం ఎందుకు వ్రాయటంలేదు? నువ్వెవరకు? వెంటనే ఇంటికి రావలసింది. ఏమిజరగాలో! వెంటనే నాకు ఉత్తరం వ్రాయి ఎలావుంటున్నావో వ్రాయి. అందరూ క్షేమం, ఇంటికి వెంటనే రావలసింది. నిన్న మన ఆవు ఈనినది. ఈమాటలు మాత్రమే వ్రాసి కాగితాన్ని మడిచి కవరులో పెట్టి అంటించివేసింది. కవరుమీద ఎంతో ప్రేమతో శ్రీయుతులు అపూర్వకుమార్ రాయ్ అని వ్రాసింది.

కవరుమీద పేరుగాక మరేమి వ్రాయాలో కూడా మృగమయికి తెలియలేదు.

అత్తగారుగాని, మరెవరైనాగాని చూస్తారేమోనని భయపడి విశ్వాసపాత్రురాలైన ఒక దాసి చేతికిచ్చి పోస్టాఫీసుకు పంపింది.

ఆ ఉత్తరంవల్ల ఫలితమేమీ కలగలేదనీ, అపూర్వుడు ఇంటికి రాలేదనీ చెప్పవలసిన అవుసరం లేదు.



కాలేజీకి శలవలు ఇచ్చినా కుమారుడు ఇంటికి రాక పోవటం తల్లి గమనించింది. ఇంకా అతనికి తనమీద కోపం తగ్గలేదని అనుకొంది. తనమీద అపూర్వునికి కోపం పోలేదనీ మృగమయి ఆలోచించింది. తాను వ్రాసిన ఉత్తరం

సంగతి గుర్తువచ్చి అమితమైన సిగ్గు ముంచుకొచ్చింది. ఆమె తన మనస్సులోని భావాలేవీ ఆయనతో చెప్పలేదు... అయినా వారి కోపమేముంది? ఇది ఆలోచించి ఆమె మరెంత బాధపడసాగింది. మాటిమాటికీ వాసిని పిలిచి 'ఉత్తరం వేసి వచ్చావా' అని అడిగేది.

చివరికి ఒకనాడు అపూర్వుని తల్లి మృగనయనితో 'అమ్మాయీ సెలవులిచ్చినా అబ్బాయి యింటికి రాలేదు. కలకత్తా వెళ్ళి చూడి వద్దామను కొంటున్నాను. నువ్వూ వస్తావా?' అని అడిగింది.

మృగనయని నోటితో ఏమీ అనలేకపోయిన తలూపుతూ తన అంగీకారాన్ని తెలియచేసింది.

అపూర్వునికి తెలియచేయకుండానే ఇద్దరూ కలకత్తాకు బయలుదేరారు.

అపూర్వుని తల్లి కలకత్తాలోవున్న తన అల్లుడిగారింటికి వెళ్ళింది. మృగనయనినుంచి ఉత్తరం వస్తుందని ఆశ వదలుకొని అపూర్వుడు ఆనాటి సాయంత్రం తానే ప్రతిజ్ఞా భంగమొనర్చి ఉత్తరం వ్రాయాలని కూర్చున్నాడు యింతలో బావగారి ఉత్తరం అందింది. 'మీ అమ్మగారు వచ్చింది. త్వరగా వచ్చి కలుసుకో అంతా క్షేమం రాత్రి భోజనం ఇక్కడే చేయాలి' అని మాత్రమే ఆవుత్తరంలోవుంది. ఏదైనా అశుభం జరిగిందేమోనని అతను గాబరపడ్డాడు. వెంటనే దుస్తులు మార్చుకొని బావగారింటికి బయలుదేరి వెళ్ళాడు. వెళ్ళగానే ముందు తల్లిని కలుసుకొని 'అమ్మా అంతా క్షేమమేనా?' అని అడిగాడు.

# వరమాలి

ఆకాశమంతా గాఢంగా చలిచలిగావుంది కాని, మధ్యాహ్నమయేసరికి దక్షిణంనుంచి వేడిగాలి వీచసాగింది.

యతీంద్రుడు కూర్చొనివున్న వరండాలోనుంచిచూస్తే ఎదురుగా తోటలోవున్న దిరిసెన, పనసచెట్లమధ్యగా బయట వున్న విశాలమైనమైదానం కన్పిస్తూవుంది. నిశ్శబ్దంగా, నిర్జనంగావున్న ఆమైదానంలో ఫాల్గుణమాసపుఎండ తన ప్రభావాన్ని విస్తరింపజేస్తూవుంది. ఆ పక్కనేవున్న మట్టిరోడ్డు మీద రెండెద్దులబళ్లు మెల్లిగా ప్రయాణిస్తున్నాయి. బండ్లవాళ్లు ఉత్తరీయాలు నెత్తిమీదవేసుకొని అత్యంత నీరస భావంతో పాటలు పాడుతున్నారు.

సరిగ్గా ఆదేసమయానికి వెనకగానుంచి ఒక స్త్రీ కంఠ స్వరం విన్పించింది వ్యంగ్యంగా—'ఏమిటి యతీన్! పూర్వ జన్మలో వారినిగురించి ఆలోచిస్తున్నావా ఏం!'

'అదేమిటి పటల్? ఆలోచించటానికి పూర్వజన్మ వరకు వెళ్లవలసినంత అభాగ్యుడననుకుంటున్నావా?' అన్నాడు యతీంద్రుడు.

ఆత్మీయులు బంధుమిత్రులందరి మధ్య 'పటల్' అనే పేరుతో ప్రసిద్ధిచెందిన ఆమె యతీంద్రుని మాటవిని 'చాలు చాలు, అంతటితో ఇక ఆగు. పట్టిగొప్పలు ఎందుకు? మహాశయా, మీయొక్క ఈ జన్మకు సంబంధించిన విషయాలన్నీ నే నెరిగినవేకదా! ఛీ, ఛీ! ఎందుకు ఇంత వయస్సువచ్చింది, ఏంలాభం? ఎవరైనా ఒకసామాన్య

స్త్రీనైనా పెళ్ళాడి ఇంటికి తెచ్చుకోలేకపోయావు. నావద్ద వున్నాడే తోటమాలి ధనియా వాడికి కూడా వుంది ఒక పెళ్ళాం. తనకూ భార్య వుందని పేటమొత్తానికి తెలియాలని వాడు రోజూ, ఉదయము, సాయంత్రము క్రమం తప్పకుండా ఆమెతో పోట్లాడుతూ వుంటాడు. మరి నువ్వో? నువ్వు ఆకాశం లోకి, పొలాల వైపు ఆదేపనిగా చూస్తూ నిన్ను నువ్వే మోస గించుకొంటూ వుంటావు. నీ యుక్తులన్నీ నాకు బాగా తెలుసు. ఇవన్నీ జనానికి చూపించాలని చేసే మోసాలు. ఇదుగో యతీన్, జగమెరిగిన బ్రాహ్మణుడు జంధ్యం చూపించాలా ఏం? మా తోటమాలి ధనియా ఎన్నడూ నీవలె ఆకాశం వైపు చూస్తూ కూర్చోడు, ఎంత విరహ సమయాల్లోనైనా సరే రోజంతా చెట్లచుట్టూ గట్లు వేసి నీళ్ళు పెడుతూ వుంటాడు. అంతేగాని ఇటువంటి లీనభావాన్ని వాడి కళ్ళల్లో నేనెన్నడూ చూడలేదు. మహాశయా! ఇక మీ విషయం చెప్పనే అవసరం లేదు. ఏ జన్మలోనూ భార్యముఖం చూడలేదు. అప్పటిలో ఎప్పుడూ శవాలను కోస్తూ వుండటం, పుస్తకాలు వల్లెవేస్తూ వుండటంతోనే జీవితం వెళ్ళమారిపోతుంది. ఇక ఇప్పుడు వసా రాలో కూర్చొని ఆకాశాన్ని చూస్తూ పులకించటమేనా పని? ఏమంటావ్! ఇటువంటి పనికిమాలిన చేష్టలంటే నాకు నచ్చవు. నిజం చెప్పాలంటే ఇలాంటివాటిని చూస్తే నాకు ఒళ్ళుమండు కొస్తుంది' అంటూ అనర్గళంగా చెప్పుకుపోతుంది.

ఆమె ధోరణి సహించలేక యతీంద్రుడు చేతులెత్తి నమస్కరిస్తూ 'చాలుచాలు! ఇక చాలించు. నన్ను మరింత సిగ్గుపర్చకు. మీ ధనియా చాలా అదృష్టవంతుడు అతనిని

ఆదర్శంగా వుంచుకొని నడుచుకోటానికి నేను ప్రయత్నిస్తాను. నీఉపన్యాసం ఇకచాలించు. రేపుఉదయం నిద్రలేవగానే ఏకట్టెలుకొట్టేవాడి కూతురు కన్పించినాసరే ఆమెమెడలో మాలవేసేస్తాను. నీధిక్కారవర్షాన్నిక నేను భరించలేకుండా వున్నాను' అన్నాడు.

'అయితే విషయం ఖాయమైనట్లేనా?' అని అడిగింది పటల్.

'ఆహా! ఖాయమే' అన్నాడుయతీన్.

'అయితే లేచినావెంటరా.'

'ఎక్కడికి?'

'ముందులేచిరా.'

'రాను, రాను. మళ్లీ నీబుర్రలో ఏదో కొంటెతనం తట్టివుంటుంది. ఇప్పుడునేను ఇక్కడినుంచి కదలనంటే కదలను అని యతీంద్రుడు అన్నాడు.

వీళ్ళిద్దర్ని ఇప్పుడిక మీకుకొంచెం పరిచయంచేస్తే బాగుంటుంది. యతీంద్రుడు, పటల్ వీరిద్దరూ ఒకరోజు తేడాగా జన్మించారు. యతీంద్రునికంటె పటల్ ఒకరోజు పెద్దది. కాని, అంతమాత్రాన యతీంద్రుడు ఆమెయెడల ఏవిధమైన సాంఘికమర్యాద చూపించటానికి సిద్ధంగాలేడు. పెదతండ్రి, పినతండ్రిబిడ్డలు, పైగా ఇద్దరూ చిన్నప్పటినుండి ఒకేచోట ఆడుతూ పాడుతూ పెరిగి పెద్దవాళ్ళయారు. యతీంద్రుడు తనను 'అక్కగారు' అనిపిలవని నేరాన్నిగురించి చిన్నతనంలో పటల్ అనేకసార్లు పెద్దలతో ఫిర్యాదుచేసింది; కాని శాసించే పద్ధతివల్లకూడా ఆమెకు ఏవిధమైన ఫలితమూ

కన్పించలేదు. అంతేకాదు, తనను 'పటల్' అని పిలవకుండా మాన్పించలేకపోయింది.

పటల్ జోర్దుగా గుమ్మటంవలె వుంటుంది. ఆమె యొక్క నరనరాన ఆనందరసం తొణికిస లాడుతూ వుంటుంది. ఆమెది బహువిచిత్రమైన హాస్యస్వభావం. దానిని నిరోధించగలశక్తి సమాజంలోకూడా లేదనిచెప్పవచ్చు. తన అత్తగారిముందుకూడా ఎంత ప్రయత్నించినా ఆమెగంభీరంగా వుండలేకపోయింది. మొట్టమొదటి రోజుల్లో ఈవిషయాన్ని గురించిఅనేకచర్చలుకూడా బయలుదేరాయి. కానిచివరకు అందరూ తమఓటమిని ఒప్పుకొని 'అసలు ఆమెస్వభావమే అంత' అని అంగీకరించాల్సివచ్చింది. ఆతనుపరి దుర్నివార మైన ఆమెయొక్క సంతోషసరసోక్తి బాణాలతో పెద్దల గాంభీర్యంకూడా టుప్పున ఎగిరిపోయేది. తనచుట్టూవున్న వాతావరణంలో ఏకొంచెం మానసికచింతగానీ, ముఖంలో దైన్యభావంగాని, బాధగాని కన్పిస్తేచాలు పటల్ ఎంత మాత్రంసహించగలిగేదికాదు. రకరకాలకబుర్లతో, పరిహాసా లతో తనచుట్టూవున్న గాలిని ఆమె విద్యుత్ శక్తితో నింపే సినట్లు చేసేది.

పటల్భర్త హారకుమారబాబు డెప్యూటీమెజస్ట్రేట్. బీహారుప్రాంతంనుండి కలకత్తా ఆబ్కారీవిభాగంలోకి మార్చ బడ్డాడు. అప్పుడు కలకత్తాలో ప్లేగు వ్యాపించివుంది. అందు చేత పట్టణానికి నాలుగైదు మైళ్ళదూరాన గాంగానది ఒడ్డునవున్న వాలీలోని ఒకతోటలోకి మకాం మార్చారు. ప్రతిరోజు అతను అక్కడినుంచే పట్టణం

లోకివచ్చి తనపనులు పూర్తిచేసుకొని వెళ్తూవుండేవాడు. ఆళ్కారి నిరీక్షణాకార్యక్రమంలో తరచు అతను బయట గ్రామాలకు వెళ్లవలసివుండేది. అందుకని పటల్‌కు తోడుగా వుండటానికి అతను తనతల్లిని మరిఒకరిద్దరు బంధువులనెవరి నైనా పిలిపించాలనుకొంటూ వున్నసమయంలో, కొత్తగా డాక్టరుపరీక్షలో ఉత్తీర్ణుడై పెద్దగాప్రాక్టీసూ పేరూలేని యతీంద్రుడు అక్కగారి ఆహ్వానంరాగానే ఒకవారంరోజుల పాటు వుండివెళ్దామని బావగారింటికి వచ్చాడు.

జనంతో కిక్కిరిసివుండే కలకత్తా ఇరుకు సందుల్లో నుంచి బయటపడి చల్లనినీడనిచ్చే ప్రకృతిమధ్యవచ్చివుండటం అపూర్వునికి మొదటిఅనుభవం ఫాల్గుణమాసపు మధ్యాహ్న సమయమందు నిర్జనంగావున్న వసారాలో కూర్చొని అపూర్వుడు పైననీలాకాశము ఎదుటనిండుగా ప్రవహిస్తూవున్న గంగానదినిచూస్తూ రసాస్వాదనలో మునిగివున్నాడు. సరిగ్గా అదేసమయాన పటల్‌వచ్చి ఈ ఉపద్రవం ప్రారంభించింది. ఆమె వెళ్ళిపోయినతరువాత కాస్సేపు నిశ్చింతగా కొంచెం సర్దుకొని విశ్రాంతిగా కూర్చున్నాడు. కట్టెలు కొట్టేవాని కూతురు ప్రస్తావనతో అతనిమనస్సు చిన్నతనంలోవిన్న రూపకథావీధిలో సంచరించసాగింది.

ఇంతలోమళ్ళీ పటల్‌యొక్క పరిహాసకంఠస్వరం విని అతను త్రుళ్లిపడ్డాడు. ఆమె ఒకబాలిక చెయ్యిపట్టుకొని గట్టిగా ఈడ్చుకొచ్చి యతీంద్రునిముందు నిలబెట్టింది. 'ఏయ్, కట్టెలుకొట్టేవాడికూతురా!' అని అందిఆమెను.

అందుకు ఆ అమ్మాయి 'ఏమిటిఅక్కా?' అని అడిగింది.

'చూడు, నా సోదరుడు ఎలావున్నాడో చూచిచెప్పు' అని అంది.

ఆ బాలిక సంకోచమేమీలేకుండా యతీంద్రుని నిటువెళ్లా పరీక్షగా చూడసాగింది. 'ఏం, చూడటానికి బాగున్నాడా?' అని పటల్ అడిగింది.

ఆ బాలిక గంభీరంగా ఆలోచించి తలూపుతూ 'ఆఁ, బాగానేవున్నారు' అనిబదులుచెప్పింది.

యతీన్ ముఖం ఎర్రబడింది. అతనుచటుక్కున కుర్చీలో నుంచి లేచి 'అబ్బ, ఏమిటీ చిన్నతనపుచేష్టలు పటల్?' అని అన్నాడు.

'నేనుచేసేవి చిన్నతనపుచేష్టలయితే నువ్వుచేసేవి వయోవృద్ధునిచేష్టలా? మీవయస్సెక్కడ, తరులను గిరులను కూడా మించిపోయిందనుకొంటాను' అనిఅంది పటల్.

యతీన్ అక్కడినుంచి పారిపోయాడు. పటల్ అతని వెనుకనే పరుగెత్తుతూ 'యతీన్, ఇందులో భయపడాల్సిందేమీలేదు. ఇదుగో మాట! నారేమీభయపడకు. ఇప్పటికిప్పుడే వరమాల వేయాల్సినపనిలేదులే శ్రావణభాద్రపదాల్లో మంచిలగ్నాలులేవు, ఇంకా కావల్సినంత సమయం వుంది.' అనిఅంది.

'కట్టెలు కొట్టేవానికూతురు' అని పటల్ పట్టుకొచ్చిన బాలిక ఇదేమీబోధపడక నిశ్చేష్టురాలై నిలబడి చూస్తూ వుంది. ఇంచుమించుగా పదకొండేళ్లుంటాయి - మిసమిస

లాంటి శరీరం, ముఖసౌందర్యాన్నిగురించి అధికంగా చెప్పాల్సిన అవసరంలేదు: దాన్నిగురించి ఒక్క ఉదాహరణ చెప్తే, చాలనుకుంటాను - ఆమెముఖంలో అసాధారణమయిన ఆకర్షణఏదోవుంది - చూడగానే వనాల్లోసంచరించే లేడి తలపుకొస్తుంది. కఠోరభాషలో దానిని 'నిర్బుద్ధి' అని చెప్పవచ్చు, కాని అదితెలివితక్కువతనం మాత్రంకాదు. బుద్ధియొక్క ఆ అస్పష్టతవల్ల ఆమెముఖమండలంలో సౌందర్యం కొంత నష్టపోవచ్చునేమోగాని అదిఆమెకు ఒకవిశిష్టతను చేకూర్చిపెట్టింది.

సాయంత్రమయేసరికి హారకుమారబాబు కలకత్తానుంచి ఇంటికి తిరిగివచ్చాడు; యతీంద్రునిచూడగానే 'యతీన్, నువ్వొచ్చావా, మంచిదేఅయింది అంటూ త్వరత్వరగా డ్రస్సుమార్చుకొనివచ్చి కూర్చొని మళ్లీ ప్రారంభించారు. 'నువిక్కడ చిన్నవైద్యం ఒకటిచెయ్యాలి. మేము బీహారులో వుంటున్నప్పుడు కాటకం వచ్చింది. అప్పటినుండిమేము ఒక బాలికను పెంచుతున్నాము. ఒకనాడు మేమువుండే బంగళా ముందు చెట్టుక్రింద ఒకచిన్నపిల్ల ఆమె తల్లిదండ్రులు చావుబ్రతుకుల్లో పడివున్నారని తెలిసింది. ఆపనీఈపనీసర్దుకొని మేము వెళ్ళిచూచేసరికి తల్లిదండ్రులయితే చనిపోయారుకాని పిల్లమాత్రం కొనవూపిరితో వుంది. పటల్ చాలాప్రయాసపడి అనేకప్రయత్నాలుచేసి ఆమెనుబ్రతికించింది. ప్రేమతో ఆమెకు 'కంగలీ' అనిపేరుపెట్టింది. ఆమె ఏజాతికిచెందినది, ఏకులం అనేదేమీతెలియదు. ఈవిషయంలో ఎవరైనా ఏదన్నాఅంటే మీఅక్కకు చాలాకోపంవస్తుంది- 'చనిపోయి

మళ్లీ ఈయింట్లో జన్మించిందిగనుక ఆమె 'బ్రాహ్మణకన్య' అని జవాబిస్తుంది. ఆమెపాతకులం ఎప్పుడోపోయిందని ఆమె వాదన. మొట్టమొదట్లో ఆఅమ్మాయి పటల్‌ను 'అమ్మా' అనిపిలిచేది. అందుకు పటల్ కోపగించుకొని 'జాగ్రత్త, మరెప్పుడూ నన్ను అమ్మ అని పిలవవద్దు అక్క అనిపిలువు' అని శాసించింది. ఇంతపెద్ద పిల్లతననుఅమ్మ అని పిలిస్తూవుంటే లోకులు తనను వృద్ధురాలని ఎక్కడ అనుకుంటారో అని ఆమెభయం. సరే, ఇప్పుడాసంగతులన్నీ అలావుంచు, ఆ కాటకంలో తిండి లేకుండావుంటటవల్లగాని, మరేకారణం వల్ల గాని అప్పుడప్పుడూ ఆపిల్లదుర్భరమైన శూలనొప్పితో బాధపడుతూవుంటుంది. ఇంతకూ అసలు ఆరోగమేమిటో నువ్వొకపర్యాయం జాగ్రత్తగా పరీక్షించిచూడాలి, అని ముగించి మళ్ళీఅంతలోనే 'తులసీ' అని నౌకర్నుపిలిచి 'ఒకసారి కంగలీ నిలాపిల్చుకురా' అన్నారు.

తలదువ్వుకొంటూవున్న కంగలీ నౌకరు వెళ్లి చెప్పగానే ఎలావున్నదలాగే లేచి మెడవంకరగాపెట్టి జడఅల్లుకొంటూ హారకుమారబాబు ఎదుటకువచ్చి నిల్చుంది. ఆ ఇద్దరివైపు తేడివలెచూస్తూ నిశ్చలంగా నిలబడివుంది.

యతీంద్రుడుసిగ్గుపడిఅటూఇటూ దిక్కులుచూడటం గమనించిన హారకుమారబాబు యతీన్, నువ్వు అనవసరంగా సిగ్గుపడుతున్నావు. చూపులకు ఇంతపెద్దదానిగా కన్పిస్తుందేకాని వట్టిపసిపిల్ల—పూర్తిగా నీళ్ళకొబ్బరికాయలోపల తోణికిసలాడేదంతా నీరే, ఇంకా నామమాత్రంగానైనా కొబ్బరిపట్టలేదు. ఏమీ తెలియనివట్టిఅమాయకురాలు. ఈమెను

చూచి నువ్వు 'మానవస్త్రీ' అనిపొరపాటున అనుకునేవు కేవలం అడవిలోవుండే లేడివంటిదనుకున్నాను' అని అన్నాడు.

యతీంద్రుడు ఆమెను పరీక్షచేయసాగాడు. కంగలీ కొంచెమైనా సిగ్గుపడలేదు.' శరీరయంత్రంలో ఏవిధమైన వికారమూలేదు' అన్నాడు డాక్టరు యతీన్. ఆమాట అంటూ వుండగానే అకస్మాత్తుగా పటల్ అక్కడ ప్రత్యక్షమయింది. 'హృదయయంత్రంలో యేదైనా వికారంవున్నదో లేదో కూడా పరీక్షించాలంటావా?' అని అంటూ ఆమె కంగలీ గడ్డంపట్టుకొని' ఏం కంగలీ, 'మాతమ్ముడంటే నీకు ఇష్టమేనా? 'అని అడిగింది. కంగలీ 'ఆఁ' అంటూ తలూపింది.

'ఇదుగో, అయితే నువ్వుమాతమ్ముని పెళ్ళాడతావా?' అని పటల్ అడిగింది.

'ఆఁ!' అంది కంగలీ.

హరకుమారబాబు, పటల్ ఇద్దరూ నవ్వేశారు. ఈ కుతూహలంలోవున్న రహస్యాన్ని తెలుసుకోలేక పోయినప్పటికీ కంగలీకూడా వారిద్దరితోపాటు తానూ కిలకిలనవ్వింది. యతీన్ముఖం కందగడ్డవలె ఎర్రనయింది. అతను వ్యాకుల పడుతూ 'అబ్బ, నువ్వుమరీ మితిమీరిపోతున్నావు పటల్. చాలా అపసవ్యంగా మాట్లాడుతున్నావు. హరకుమార బాబూ, మీరు అలుసిచ్చి పటల్ను మరీనెత్తికెక్కించుకొంటున్నారు' అని అన్నాడు.

హరకుమారబాబు వెంటనేఅందుకొని 'అదేమీలేదు యతీన్, మరొకసందర్భంలో అయితే మీఅక్క అంత దుడుకుగా మాట్లాడుతుందని నేననుకోను. కాని, కంగలీతో

నీవఅంతగా పరిచయంలేదు. అందుకే నువ్వుచాలా గాబరా పడిపోతున్నావు. ముందు నువ్వేసిగ్గుపడి మాకంగలీకిసిగ్గుపడట మనేది నేర్పేటట్టున్నావు. కనీసం ఈమెకు జ్ఞానవృక్ష ఫలాలు తినిపించకు. ఈమెతో పరిహాసాలాడుతూ మా అం దరికీ శాస్త్ర ప్రాకృతిక, రసానుభూతి లభిస్తూవుంది మధ్యలో నువ్వొచ్చి ఈమెముందు గాంభీర్యాన్ని ప్రదర్శిస్తే ఈమెకు అదిచాలా అసంగతవిషయంగా వుంటుంది' అనిఅన్నాడు.

'అందుకనే యతీన్‌కూ నాకూ. ఇంతవరకు యేనాడూ సరిపడలేదు. చిన్నతనంనుండీ మాయిద్దరికీ ఎప్పుడూ పొద్దె దురే. ఇతనిది చాలాగంభీరస్వభావం' అని పటల్‌అంది.

'అసలు పోట్లాడేస్వభావం మీవంశంలోనేవుంది- అది మీనరనరాన జీర్ణించుకుపోయింది. అదిగో, మీతమ్ముడుపారిపో తున్నాడుచూడు' అన్నాడు హరకుమారబాబు పటల్‌తో.

అందుకుపటల్ హరకుమారబాబుతో 'అదేఅబద్ధం. మీతోపోట్లాడటంలో ఆనందమేవుండదు. పైగా అందు కోసం నేనెప్పుడూ ప్రయత్నంకూడా చేయను' అనిఅంది.

'అయినా నేనుముందుగానే ఓటమిని అంగీకరిస్తాను గదా!'

'మహాఘనకార్యం చేస్తున్నారు. మొదటనే ఓటమి అంగీకరించకుండా చిట్టచివరికి ఓడిపోతేనే నాకు చాలా ఆనం దంగా వుంటుంది.'

## ౨

రాత్రిసమయం, అందరూ నిద్రపోతున్నారు. గది తలుపు కిటికీలు అన్నీ తెరిచి, పడుకొని యతీన్ ఏమేమో ఆలోచిస్తూ వున్నాడు. తనకళ్ళఎదుటనే తల్లిదండ్రులుఇద్దరూ ఆకలితో విలవిలలాడుతూ చనిపోవటంచూచిన ఆ బాలిక జీవితముపైన, అదృశ్యంయొక్క భయంకర ప్రభావం ఎలా వుంటుందో! అటువంటి భయంకర దుఃఖ ప్రభావంలోనే ఆమె పెరిగి పెద్దదయింది. ఆమెతో పరిహాసాలాడటమా! ఆమె బుద్ధిపై ఒక ఆవరణను కల్పించి ఆపరమాత్ముడు నిజంగా చాలా కనికరించాడు. కాని ఆ ఆవరణ తొలగిపోవటమనేది జరిగినప్పుడు, అదృష్టపు రుద్రలీలయొక్క ఎలాంటి భీషణ చిహ్నాలు ప్రత్యక్షమవుతాయోగదా!

ఆవాళమధ్యాహ్నం యతీన్ వరండాలోకూర్చొని ఫాల్గుణమాసపు ఆకాశంలోకి చూస్తున్నాడు. చెట్లయొక్క చల్లనినీడ, దానికితోడు చుట్టూ పనసపువ్వుల సువాసన నిండివుంది. పొగమంచువలె వ్యాపించివున్న ఆమాధుర్యం లోనుంచి ఈ ప్రపంచం యతీన్‌కు ఎంతోరమణీయంగా కన్పిస్తూవుంది. కాని ఆ దేసమయాన ఆబుద్ధిహీనమైన బాలికవచ్చి తనచేతికళ్ళతో ఆబంగారురంగు మంచుతెరను పాడుచేసివేసింది. ఫాల్గుణపు తుమ్మెదల మధురధ్వనులచాటున క్షుద తృషాతురదుఃఖ కఠినదేహంతో, విరాట్ స్వరూపంతో నిలచివున్న ప్రపంచం అతనికి ఉద్ఘాటించబడిన యవనికయొక్క శిల్పమాధుర్యపు అంతరాళంలో కన్పించి మాయమైపోయింది..

మర్నాడు సాయంత్రమయేసరికి కంగలీకి తీవ్రమైన శూలనొప్పివచ్చింది. వెంటనేపటల్ యతీన్‌ను పిలిపించింది. యతీన్ వచ్చిచూచాడు, కంగలీ కాళ్లుచేతులు మెలికలుతిరిగి పోతున్నాయి, శరీరం జడతుల్యంగావుంది, ముఖం నల్లకప్పు వేసింది. యతీంద్రుడు మందుకోసం వెంటనేమనిషిని పంపాడు ఒకగ్లాసుతో వేడినీళ్లు తీసుకురమ్మని చెప్పాడు. అప్పుడు పటల్ 'నువ్వెక్కడ, గొప్పడాక్టరువైపోయావు. అరికాళ్ళలో కొంచెం తైలమర్దనంచెయ్యి. కాళ్లుచల్లబడి పోతూవుంటే కన్పించటంలేదూ?' అని అంది

యతీంద్రుడు రోగియొక్క అరికాళ్ళకు గబగబ తైల మర్దనం చేయసాగాడు. చికిత్స ముగిసేసరికి రాత్రి చాలా ప్రొద్దుపోయింది. హరకుమారబాబు అప్పుడే పట్టణంనుండి తిరిగివచ్చాడు. మాటిమాటికి కంగలీనిగురించి అతనుఎంతో ఆదుర్దాగా అడుగుతున్నాడు. హరకుమారబాబు పగలంతా కార్యభారంతో బాగాఅలసిపోయి ఆలస్యంగా ఇంటికి వచ్చినందువల్ల, పటల్‌కూడా దగ్గరలేకపోవటంతో మాటిమాటికీ కంగలీక్షేమం అడుగుతున్నారని యతీన్ అనుకున్నాడు.

అందుకని పటల్‌తో 'బావగారు చాలావ్యాకులంగా వున్నట్లున్నారు, నువ్వువెళ్ళు పటల్' అని అన్నాడుయతీన్.

'ఎవరినిగురించో ఎందుకు, ఆవ్యాకులపడుతుందెవరో నాకుబాగా తెలుసు. నేనిక్కడినుంచి వదలిపోతే నీకుహాయిగా వుంటుంది. అసలువిషయం అదిఅని చెప్పరాదూ? మాట మాట్లాడితేచాలు ఇక్కడ అయ్యగారిముఖంఎర్రబడిపోతుంది.

అయ్యో! నీకడుపులో ఇంతహాస్యంవుందని ఎవరికి తెలుసు!' అని అందిపటల్.

'సరే, అంతేఅనుకో. క్షమించి నువ్విక్కడినుంచి వెళ్లు - నువ్వుమాట్లాడటంమానితే బ్రతికిపోతాను. నేను పొరపాటుపడ్డాను. బావగారు చాలా ప్రశాంతంగా వుండి వుంటారు. ఇటువంటిఅవకాశంవారికెన్నడూలభించివుండదు.'

నొప్పికొంచెం సద్దుకొని కంగలీ కళ్లుతెరిచిచూచింది. అప్పుడు పటల్ ఆమెతో' నువ్వుకళ్లుతెరవటానికని పెళ్ళి కొడుకు ఇవాళచాలాసేపు నీపాదాలను ఆరాధించాడు. ఇవాళ ఇంతఆలస్యంచేసింది అందుకేనాఏమిటి? ఛీ! త్వరగా వారి పాదధూళిని శిరమునదాల్చు' అనిఅంది. కంగలీ వెంటనే తనకర్తవ్యమునుగుర్తించి గంభీరభావంతో యతీంద్రుని పాద ధూళితీసుకొని శిరమునదాల్చింది. యతీంద్రుడు గబగబ బయటకు వెళ్లిపోయాడు.

ఆమర్నాటినుంచి రోజూ యతీంద్రునిపై క్రమంతప్ప కుండా ఏదోఒకఉపద్రవం వచ్చిపడనారంభించింది. యతీం ద్రుడు భోజనంముందు కూర్చోగానే కంగలీ విసనకర్రతో ప్రత్యక్షమై అతినిస్సంకోచభావంతో విసురుతూకూర్చునేది. అతడు వ్యాకులతతో 'వద్దు, వద్దు' అనేవాడు. ఈనిషేధం వల్ల కంగలీకి విస్మయం కలిగేది, వెనక్కితిరిగి గదివేపుచూసి మళ్లీ విసరనారంభించేది. తెరచాటునవుండి ఇదంతా నడు పుతున్న నామె నుద్దేశించి' పటల్, ఈవిధంగా నువ్వునన్ను విసిగించావంటే నేను అన్నంముట్టను. ఇదుగో, నేను లేచి పోతున్నాను' అన్నాడు యతీన్, ఈమాట అని అతను

అన్నంముందునుంచి లేవబోతూవుండగా కంగలీ విసనకర్రను నెలకేసికొట్టింది. అప్పుడు ఆ బాలికయొక్క అమాయకవద నంలో వ్యక్తమయిన మనోవేదనను గమనించి యతీంద్రుడు దుఃఖితుడై తిరిగికూర్చున్నాడు. కంగలీ ఏదీ అర్థంచేసుకో లేదు, సిగ్గుపడదు వేదనఅనే అనుభూతి ఆమెలోలేదు. అని యతీన్ కూడా విశ్వసించసాగాడు. కాని, ఇవాళ అకస్మా త్తుగా ఆమె ముఖంలో అతను బాధనుచూచాడు. నిశ్చితనియ మాలు అకస్మాత్తుగా అతిక్రమించబడ్డాయి. ముందుగా దీని నెవ్వరూ ఊహించికూడా వుండరు. కంగలీ విసనకర్రను అక్కడపారేసి వెళ్ళిపోయింది.

మర్నాడుఉదయం యతీంద్రుడు వరండాలోకూర్చొని వున్నాడు. మామిడికొమ్మపై కూర్చొని కోయిలకూస్తోంది. ఇంతలో కంగలీ కప్పుతో టీ తీసుకొని కొంచెంసంకోచిస్తూ రావటం అతను గమనించాడు. ఆమెయొక్క లేడివంటి కన్నుల్లో ఒకవిధమైన కరుణతోకూడిన భయంవుంది టీ తీసు కొని వెళ్ళితే యతీంద్రుడు అసంతృప్తిపడతాడో లేక మారేమంటాడో అనేది ఆమెకుఅర్థం కావటంలేదు. యతీం ద్రునికి చాలాబాధకలిగింది. వెంటనేలేచి ఎదురువెళ్ళి కంగలీ చేతినుంచి టీ కప్పు అందుకొన్నాడు. మానవశరీరధారిణి అయిన ఈలేడిపిల్లకు స్వల్పకారణంతో దుఃఖం కల్గించ వచ్చునా? యతీంద్రుడు అటు ఆమెచేతినుంచి టీ కప్పు అందుకొనేసరికి హఠాత్తుగా అటుపటల్ ప్రత్యక్షమై మహాన హాస్యంతో పిడికిలిబిగించి చూపిస్తూవుంది. అంటే 'ఎలాపట్టు బడిపోయావో చూచావా?' అనేదానిఅర్థం.

అదేరోజుసాయంత్రం యతీంద్రుడు ఏదో మెడికల్ మాగ్జైను చదువుతూ కూర్చున్నాడు. ఇంతలో పూలవాసనతో చకితుడై చూచేసరికి కంగలీ పొగడపూలమాలను చేత్తోపట్టుకొని వస్తూవుంది. ఊరుకున్నకొద్దీ వ్యవహారం మరీ మితిమీరి పోతుంది. ఇకపటల్‌కు ఈహాస్యానికి అవకాశమివ్వకూడదు అని తనలో తాను నిశ్చయించు కొన్నాడు. ఇంతలో కంగలీ అతనిదగ్గరకువచ్చింది. యతీంద్రుడు అప్పుడు 'ఛీ, ఛీ! కంగలీ, నిన్నిలా ఆడించి మీఅక్క తమాషా చూస్తుంది. నీకు ఇదేమీ అర్థమవటంలేదా!' అని ఆమెను అడిగాడు. అతనిమాట పూర్తయినా అవకముందే ఆమె బెదిరిపోయి సంకుచితభావంతో తిరిగి వెళ్ళిపోబోయింది. అప్పుడు ఆమెనుపిలిచి 'కంగలీ, ఏదీనీమాల చూద్దాంరా!' అని అన్నాడు. కంగలీముఖంలో ఆనందపు వెలుగుకిరణాలు తళుక్కుమన్నాయి. ఆక్షణంలో లోపలినుంచి హాస్యపు ఉచ్ఛ్వాసధ్వని బిగ్గరగా ప్రతిధ్వనించింది.

మర్నాడు మళ్లీ ఏదో ఉపద్రవం ప్రారంభించే ఉద్దేశంతోనే పటల్ యతీంద్రుని గదిలోకివెళ్ళింది. కాని గది ఖాళీగావుంది. ముక్కాలిపీటమీద ఒకచిన్నకాగితం కన్పించింది. దానిలో 'ఇహచాలు, పారిపోతున్నాను- యతీన్' అని వ్రాసివుంది.

'ఓకంగలీ! ఇదుగో, నీపెండ్లికుమారుడు పారిపోయాడు. నువ్వుఅతనిని ఆపనేలేకపోయావు' అంటూ పటల్ కంగలీ జడపట్టుకొని ఊపింది, ఆతరువాత తనపనిమీద తానువెళ్ళిపోయింది.

కంగలీ విషయాన్ని కొంచెం ఆలస్యంగా అర్థంచేసుకొంది. ఆమె చిత్రంలోని బొమ్మవలె చలనంలేకుండా నిలబడి రెప్పవేయకుండా ఎక్కడో చూడసాగింది. తర్వాత మెల్లగా యతీంద్రుని గదిలోకి వెళ్ళిపోయింది. గది ఖాళీగా కన్పించింది నిన్న సాయంత్రం కానుకానుకగా ఇచ్చిన మాలఎండిపోయి ముక్కాలిపీటమీద పడివుంది.

వసంతపు స్నిగ్ధమధుర ప్రభాతసమయం, బాలభానుని కిరణాలు కదులుతూవున్న గులివెంత చెట్టు ఆకులసందులనుంచి సన్నగావరండాలో పడుతున్నాయి. రెండుఉడుతలు తోకలు వీపుమీదకెత్తుకొని అటుఇటు దుముకుతున్నాయి. అసంఖ్యాకంగావున్న పక్షులు నానావిధాల స్వరాలతో తాము చెప్ప దలచినదానిని ఎంతపాడినా పూర్తిచేయలేక పోతున్నాయి. మేఘములు-చిగురుటాకులు, వెలుగునీడలతో రచించబడిన భూమియొక్క ఈచిన్నభాగమందు సజీవమైన ఆనందం వికసించినట్లుంది. వీటన్నిటిమధ్యను నిలబడివున్న ఆ తెలివితక్కువ బాలిక, తనజీవితమూ చుట్టూవున్న వాతావరణంయొక్క- పసాంగత్య అర్థాన్ని తెలుసుకోలేకపోయింది. ఇంతకూ ఇదంతా ఏమిటి-చిక్కుసమస్యా? ఏంజరిగింది? ఈవిధంగా ఎందుకు జరిగింది? అందుకు ఈఉదయము, ఈతోట, ఈఇల్లు సమస్తమూ హఠాత్తుగా ఎందుకు ఇలాగు శూన్యమయింది? అర్థంచేసుకోగలశక్తిలేని ఆమెను ఈవిధంగా హృదయపు అతలవేదనా రహస్యగర్భంలో, చేతికి వెలుగునిచ్చేదీపమేదీ ఇవ్వకుండా ఆకస్మాత్తుగా ముంచివేసిందెవరు? ఇప్పుడిక ఆమెను అక్కడినుండి బయటకుతీసి జగత్తులోని సహజ

ఉచ్ఛ్వాసిత ప్రాణరాజ్యంలోకి, ప్రకృతియొక్క ఆత్మని స్మృత కలవరంలోకి తిరిగి ఎవరుస్థాపిస్తారు?

పటల్ గృహకార్యాలన్నీ ముగించుకొని కంగలీని వెతుక్కుంటూవచ్చింది. యతీంద్రుడు వుండిపెట్టినగదిలో అతనిమంచంకోసుకు పట్టుకొని కంగలీ నేలమీదపడివుంది కాళీగావున్న శయ్యను కాళ్లుపట్టుకొని బతిమలాడుతూ వున్నట్టుగావుంది. ఆశూన్యపు పాదాలకింద వ్యర్థదిలాసాతో తనహృదయంలో దాగివున్న, సుధాపాత్రను బోర్లించి గుమ్మరిస్తున్నట్టుంది. చెదిరినముస్తులు. రేగినజుట్టుతో నేలమీదపడి వున్న ఆస్త్రీ నిశ్శబ్ద ఏకాగ్రతతో 'నన్నుస్వీకరించండి స్వీకరించండి నన్నుస్వీకరించండి! మీరుఎక్కడున్నారు? నన్ను స్వీకరించండి' అనిచెప్తూ వున్నట్టుగావుంది.

పటల్ ఆశ్చర్యంతో స్తంభించిపోయింది. ఆమెనెమ్మదిగా కంగలీదగ్గరకువెళ్ళి 'ఏమిటిదికంగలీ!' అని అడిగింది. కాని కంగలీ లేవలేదు. అలాగేపడివుంది. పటల్ దగ్గరకువెళ్ళి మీదచేయివేసేసరికి వెక్కి-వెక్కి-ఏడ్వసాగింది.

ఆమెపరిస్థితినిచూచి పటల్ భ్రుళ్లిపడింది.

'అయ్యో, పాపుదానా, సర్వనాశనం చేసివేశావు కదే? చంపేశావు!' అనిఅంది పటల్

● పటల్ విషయమంతా హరకుమారబాబుతో చెప్పి ఎంతఆపద సంభవించిందో చూడండి. నేను ఆవిధంగా చేయకుండా మీరైనా నిరోధించాల్సింది. నేనుచేస్తూవుంటే మీరు చూస్తూ ఎలావూరుకున్నారు?' అని అంది.

'నీమాటను కాదనేఅలవాటుకు నువ్వునాలో వుండ నిచ్చిందెక్కడ? అయినా, కాదనిఅంటేమాత్రం నువ్వు వింటావనే గ్యారంటే ఏముంది?' అన్నాడు హారకుమారబాబు.

పటల్ కొంచెం క్షుభితురాలై 'అయినా నువ్వేలాంటి భర్తవు? నేనేదైనా తప్పుచేస్తూవుంటే జబర్దస్తీగా నన్ను ఆపలేవూ? ఆవిధంగా ఎందుకు చేయనిచ్చారునన్ను?' అని అంది.

తర్వాత పరుగెత్తుకొంటూ కంగలీ దగ్గరకువచ్చి ఆమెను కౌగిలిలోకి తీసుకొంటూ 'నాముద్దుచెల్లివిగదూ! నీమనస్సులో వున్నదేమిటో నాతోచెప్పమ్మా!' అని అడిగింది.

అయ్యోపాపం! తనహృదయంలోని అవ్యక్తరహస్యాన్ని మాటలద్వారా చెప్పగలిగేభాషఆమెలోఎక్కడుంది. ఆమె ఒకఅనిర్వచనీయమైన వేదనను సంపూర్ణహృదయంలో అణుచుకొని పడివుంది. ఆవేదన అంటేఏమిటి, ప్రపంచంలో మరెవ్వరికైనా ఇటువంటిది సంభవిస్తుందా, దానిని ప్రజలు ఏమనిఅంటారు, అనేవిషయాలేవీ కంగలీకి తెలియవు. ఆమె ఏడుపుద్వారా ఏదైనాచెప్పగలిగితే తప్ప మనసులోవున్న విషయాన్ని వ్యక్తంచేయటానికి ఆమెకు మరో ఉపాయమేదీ లేదు.

పటల్ ఆమెవీపును నిమురుతూ 'నీఅక్క చాలాదుష్టురాలమ్మా! నామాటను నువ్వింతగాఢంగా నమ్ముతావని కలలోకూడా అనుకోలేను. నామాటలు ఎవరూనమ్మరు,

నువ్వేలా పొరపడ్డావమ్మా! కంగలీ. ఒక్కసారి తలపైకెత్తి అక్కవేపు చూసి తల్లీ- నన్ను క్షమించు’ అని అంది.

కాని కంగలీమనస్సు అప్పటికే విముఖత చెందింది, ఏవిధంగానూ ఆమె పటల్ ముఖంవైపు చూడనే లేదు. పైగా మరింత తలవంచుకొని కూర్చుంది. విషయాలన్నీ పూర్తిగా అర్థంచేసుకో లేకపోయినప్పటికీ ఒకవిధమైన మూఢభావంతో పటల్ మీద కోపంగానేవుంది పటల్ నెమ్మదిగా తన బాహుపాశాన్ని వదిలించుకొని లేచికిటికీవద్దకు వెళ్ళినిల్చుంది. శిలా విగ్రహంవలె స్తబ్ధంగానిలబడి ఫాల్గుణపుఎండలో మిలమిల మెరుస్తున్న పోకచెట్ల చిగురుటాకుల్ని చూస్తూవుంది. ఆమె కళ్ళనుంచి జరజర కన్నీళ్లుకారాయి.

మర్నాడు ఉదయంలేచి చూచేసరికి ఇంట్లో కంగలీ జాడఎక్కడా కన్పించలేదు పటల్ చాలాప్రేమతో రకరకాల ఆభరణాలతోనూ, దుస్తులతోనూ కంగలీని అలంకరిస్తూవుండేది. తనవిషయంలో మాత్రం ఆమె చాలా నిర్లక్ష్యంగావుండేది. తనముస్తాబును గురించి ఆమె ఎంతమాత్రం పట్టించుకొనేదికాదు. కంగలీని అలంకరించి ఆమె తనముద్దుముచ్చటలన్నీ తీర్చుకొనేది. అదే ఆమెకు సంతృప్తి. బహుకాల సంచితమైన ఆదుస్తులూ, ఆభరణాలూ కంగలీగదిలో కిందపడివున్నాయి. కంగలీ తనచేతిగాజులు, ముక్కుపుడకతో సహాఅక్కడవదలి వెళ్లిపోయింది. పటల్ దీదీయొక్క ఇన్నాళ్ళ ప్రేమను తనశరీరంనుంచి పూర్తిగా తుడిచివేసుకొని వెళ్ళినట్టనిపించింది.

కంగలీ తప్పిపోయిందని హారకుమారబాబు పోలీసు రిపోర్టుకూడా ఇచ్చాడు. కాని, ప్లేగుభయంకరంగా వ్యాపించి వుండటంవల్ల ఎటుచూచినా జనం గుంపులు గుంపులుగా పారిపోతున్నారు. పారిపోతున్న అంతమందిజనంలో ఒక వ్యక్తిని వెతికిపట్టుకోవటం పోలీసులకు సాధ్యం కాలేదు. రెండు మూడుసార్లు కంగలీకిబదులు మరెవరినో తీసుకువచ్చారు. పోలీసులు, హారకుమారబాబుకు దుఃఖమూ సిగ్గూకూడా కలిగాయి. చివరికి కంగలీనిగురించి ఆశవదులు కొన్నాడు. ఏ అజ్ఞాతపు ఒడిలో మొదట కంగలీ దొరికిందో, మళ్లీ ఆ అజ్ఞాతపు ఒడిలోకే వెళ్లిపోయింది.

*　　　*　　　*

ఇటు యతీంద్రుడు అనేక ప్రయత్నాలుచేసి ప్రభుత్వపు ప్లేగు హాస్పటల్లో డాక్టరుగాచేరాడు. ఒకనాడు మధ్యాహ్నం అతను భోజనంచేసి హాస్పటలుకువెళ్ళాడు. స్త్రీల వార్డులో ఒకకొత్త పేషెంటు చేరిందని తెలిసింది. తెలివి లేకుండా రోడ్డుమీదపడివుండగా పోలీసులుచూచి ఆమెను ఇక్కడకు చేర్చారట.

యతీన్ ఆమెనుచూడటానికని వెళ్ళాడు. ఆ స్త్రీముఖం చాలావరకు దుప్పటితో కప్పివుంది యతీన్ ముందునాడిని పరిశీలించాడు. జ్వరం అంత ఎక్కువగా లేదు కాని బహుసీరసంగావుంది. ముసుగుతీసి పరీక్షించాలని ముఖంమీదముసుగు తొలగించి చూచేసరికి యతీన్‌కు చాలావిస్మయం కలిగింది. ఆమెఎవరో కాదు, కంగలీ!

పటల్ ద్వారా ఎప్పటికప్పుడు కంగలీ సమాచార మంతా యతీన్‌కు అందుతూనేవుంది. అవ్యక్తహృదయ భావంతో ఛాయాచ్ఛన్నమైన కంగలీ లేడికన్నులు, పని నుంచి అవకాశందొరికిన సమయాల్లో యతీంద్రుని ధ్యాన దృష్టియందు అశ్రుహీనమైన పిరికితనాన్ని ఆదేపనిగా వర్షించేవి.

ఇవాళ ఆనేత్రాలలోని రోగనిమీలిత సుదీర్ఘ కీసల ములు కంగలీయొక్క జీర్ణకపోలములపై ఆ దేవోనల్లని రేఖను చిత్రించాయి. చూచీచూడగానే యతీంద్రుని హృదయంలో పెద్దపర్వతంఏదో పాతుకుపోయి నట్టనిపించింది. ఈ బాలికను ఆ సృష్టికర్త ఇంతయత్నంతో సుకుమారమైన పుష్పంవలె సృష్టించి, దుర్భిక్షంనుండి ఈమహామారిలోకి ఎందుకు విసరి వేశాడో! పేలవమైన ఈ ప్రాణాలుఅత్యంతక్లిష్టమైరోగశయ్యా శాయియై, ఈకొద్దిరోజుల ఆయువులోనే ఇన్ని ఆపదల దెబ్బలు, ఇంత వేదనాభారాన్ని ఎలాసహించగలిగాయి! ఆమె ఇదంతా ఎలాభరించగలిగింది? పైగా దానికితోడు ఈ యతీంద్రుడు ఆమెజీవితంలో మరొక తృతీయసంకటమై ఎక్కడి నుంచో వచ్చిపడ్డాడు! రుద్ధ దీర్ఘనిశ్వాసము యతీంద్రుని హృదయద్వారాన్ని మోదసాగింది. కాని ఆ ఆఘాతపుతాడ నంతో అతని హృదయతంత్రిలో ఒక సుఖకరమైన స్వర విన్యాసం పలకసాగింది. ప్రపంచంలో ఏ ప్రేమయితే దుర్ల భమో అదంతా యతీంద్రునికి అయాచితంగానే, ఫాల్గుణమాసపు ఒక మధ్యాహ్నమందు, పూర్ణవికసితమైన మాధవీ మంజరివలె, అకస్మాత్తుగా అతనిపాదాలచెంతకువచ్చి జారువా

రింది. ఏ స్త్రీ మైతే మృత్యుద్వారం వరకువచ్చి ఈవిధంగా మూర్ఛిల్లి పడిపోతుందో, అటువంటి ఈ దైవభోగ్యమైన నైవేద్యముపై అధికారముగలవాళ్ళే ప్రపంచంలో ఎవరున్నారు!

యతీంద్రుడు కంగలీచెంతకూర్చొని ఆమెకు కొంచెం కొంచెంగా వెచ్చనిపాలు త్రాగించసాగాడు పాలుత్రాగి చాలాసేపటికి రోగిగట్టిగా ఊపిరిపీల్చుకొని కళ్ళు తెరిచింది. యతీంద్రుని ముఖంలోకిచూచి, అదేదో దూరపుకలగా భావించి అతనిని గుర్తుతెచ్చుకో యత్నించింది. యతీంద్రుడు ఆమె తలనిమురుతూ 'కంగలీ' అనిఅన్నాడు. ఆపిలుపుతో రోగికివున్న ఆఖరిసంశయాస్త్రా విడిపోయింది. ఆమెయతీంద్రుడుని గుర్తించింది. ఆక్షణంలో ఆమెకన్నుల్లో అశ్రువులతో కూడిన పొగమంచులాంటి మోహపుతెర ఒకటిఅడ్డువచ్చింది. ప్రథమ మేఘసమాగమంతో గంభీరమైన ఆషాఢపు ఆకాశం వలె కంగలీయొక్క శ్యామనయనాలలో దూరదూరములకు వ్యాపించిన సజలస్నిగ్ధత్వం ఆవరించింది.

యతీంద్రుడుకరుణతోకూడినస్నిగ్ధభావంతో 'కంగలీ' ఇంకాచాలాపాలు మిగిలిపోయాయి. ఇవికూడా త్రాగు' అని అన్నాడు.

కంగలీ కొద్దిగాలేచి దిండునుఆనుకొని కూర్చుంది. మిగిలివున్న పాలనుత్రాగుతూ గ్లాసుపైనుంచి యతీన్ ముఖం వైపు రెప్పవేయకుండా చూస్తుంది.

డాక్టరు హాస్పటలులోని ఏరోగివద్దనైనా నిరంతరం కూర్చొని వుండటం అంతఅవసరమూకాదు, అదిఅంత శోభించనూశోభించదు. ఇతరపనులుకూడా అనేకంవుంటాయి

కనుక యతీంద్రుడు లేచివెళ్ళాడు. అప్పుడు కంగలీనేత్రాలు భయనిరాశలతో వ్యాకులపడ్డాయి. యతీంద్రుడు వెళ్ళే ముందు కంగలీచేతినిపట్టుకొని ధైర్యంచెప్తూ కంగలీ నువ్వేమీ భయపడకు, నేనుత్వరగానేవస్తాను' అని అన్నాడు.

'పోలీసులు తీసుకొనివచ్చి చేర్పించినరోగికి ప్లేగుకాదు సరియైన ఆహారంలేకపోవటంవల్ల చాలా బలహీనతగావుంది. ఆమెనుఇక్కడ ప్లేగువచ్చినరోగులతోపాటు వుంచటం చాలా అపాయం' అని యతీంద్రుడు హాస్పటలు అధికారులతో చెప్పాడు.

చాలాప్రయత్నంచేసి కంగలీనిహాస్పటలునుంచి తీసుకు వెళ్ళటానికి అనుమతినిపొంది యతీంద్రుడు ఆమెను తన ఇంటికి తీసుకువెళ్ళాడు.

## 3

ఆనాడుసాయంత్రం గదిలోరోగి, వైద్యుడు తప్ప మరెవ్వరూలేరు. తలవేపున రంగుకాగితంచుట్టిన దీపంవెలుగుతూవుంది. గోడగడియారం టిక్ టిక్ తప్ప గదిలో నిశ్శబ్దంగావుంది. యతీంద్రుడు కంగలీ తల నిమురుతూ 'ఇప్పుడు ఎలావుంది కంగలీ!' అని అడిగాడు.

కంగలీ యతీంద్రుని ప్రశ్నకేమీ జవాబుచెప్పలేదు. కాని అతనిచేతిని తనతలపై గట్టిగాఅదిమి పట్టుకొంది 'కొంచెం కులాసాగా వున్నట్లుందా!' అని యతీంద్రుడు తిరిగి ప్రశ్నించాడు.

కంగలీ కళ్ళుమూసుకొని 'ఆఁ!' అనిఅంది.

'నీమెడలో ఇదేమిటి కంగలీ!' అనిఅడిగాడు యతీంద్రుడు.

కంగలీ గబగబ దుప్పటిపైకిలాక్కొని దానిసిదాచుకోటానికి ప్రయత్నించింది. అది ఎండిపోయిన పొగడపూలమాల అని యతీంద్రుడు గమనించవకపోలేదు. అది ఏనాటిదో కూడా ఇప్పుడతనికి లీలగా గుర్తొచ్చింది. గడియారపు టిక్ టిక్ శబ్దంమధ్యను యతీంద్రుడు మౌనంగాకూర్చొని ఆలోచించసాగాడు - 'దాచుకోవటానికి' కంగలీ ప్రయత్నించటం ఇది ప్రథమప్రయాసే. లేడిపిల్లవంటి ఆమె వ్యాకుల భారంతో నిండిన హృదయంగల యువతీలలామ అయిందెప్పుడో! ఏసూర్యలోకతాపంతోనో ఆమె బుద్ధిపైన ఆవరించివున్న పొగమంచు విడిపోయి ఆమెలోసిగ్గు, సంకోచము వేదన ఆకస్మికంగా ఇలాగు ప్రకాశించాయి.

రాత్రి చాలాపొద్దుపోయింది. రెండు రెండున్నర గంటల సమయానికి యతీంద్రుడు అలాగేకుర్చీలో కూర్చొని నిద్రపోయాడు. హఠాత్తుగా తలుపు తెరిచిన చప్పుడువిని ఉలిక్కిపడిలేచాడు. చేత్తో పెద్దసంచీ ఒకటిపట్టుకొని హరకుమార బాబు అతని వెనుక పటల్ గదిలోకి వచ్చారు.

హరకుమారబాబు సంచీకిందపెడుతూ 'రాత్రి నీఉత్తరంచూచి ఉదయంబయలుదేరి వద్దామనుకున్నాను. కాని, పటల్ అలావీల్లేదు, ఉదయంవెళ్తే కంగలీ కన్పించదు, ఇప్పుడే వెళ్ళాలి అంటూ కూర్చుంది. పటల్ విషయం నీకు తెలిసిందేగా! అప్పటికిప్పుడు కారునా నేనే నడుపుకొని వచ్చాను' అని చెప్పాడు.

అప్పుడు పటల్ హారకుమార బాబుతో 'పదండి, ముందు మిమ్మల్ని యతీన్ గదిలోని దబుచ్చివస్తాను' అని అంది.

మొట్టమొదట హారకుమార బాబు కొంచెంసంకోచించి నప్పటికీ తర్వాత ఆయన నిద్రపోవటానికి వెళ్ళారు. త్వర గానే గురకలుకూడా ప్రారంభించాడు. పటల్ అక్కడినుంచి యతీన్ దగ్గరకువచ్చింది. అతనిని పక్కకుపిలిచి 'ఏమైనా ఆశ వుందంటావా?' అనిఅడిగింది.

యతీంద్రుడు కంగలీనాడిచూచి ఏమీఆశలేదన్నట్లు సైగచేశాడు.

పటల్ అక్కడవేమీ మాట్లాడకుండా యతీన్‌ను మరొకగదిలోకి తీసుకవెళ్ళి 'యతీన్, నిజంచెప్పు, నువ్వు కంగలీని ప్రేమించటంలేదా?' అని అడిగింది.

యతీన్ పటల్ అడిగినదానికి జవాబేమీ చెప్పలేదు. తిరిగి కంగలీ మంచందగ్గరకువచ్చి చూస్తున్నాడు. తరువాత కాస్సేపాగి ఆమెచేతిని పట్టుకొని 'కంగలీ, కంగలీ' అని పిలి చాడు.

కంగలీ నెమ్మదిగా కళ్ళుతెరిచి ముఖంలోకి శాంత మైన మధురహాసాన్ని తెచ్చుకొని 'ఏమిటి బాబూ!' అని అంది.

కంగలీ, నీమెడలోనిమాల నామెడలో వెయ్యి' అని అన్నాడు యతీన్.

కంగలీ అనిమేష అజ్ఞాతనేత్రాలతో యతీంద్రుని ముఖంలోకి చూడసాగింది.

'నీకూలను నాకివ్వవూ?' అని మళ్ళీ యతీంద్రుడు కంగలీని అడిగాడు.

యతీంద్రుని ప్రేమలో ఇంతఆసరాలభించేసరికి గతంలో జరిగిన అనాదరణకు కంగలీమనస్సులో కొంచెం అభిమానం తలెత్తింది. 'దానివల్ల ఏమిజరుగుతుంది, బాబూ?' అని అడిగింది.

యతీంద్రుడు ఆమెచేతుల్ని తనచేతుల్లోకి తీసుకొని 'నేను నిన్ను ప్రేమిస్తున్నాను కంగలీ!' అనిఅన్నాడు.

ఆమాటవినేసరికి కంగలీ క్షణకాలంపాటు స్తబ్ధురాలై పోయింది. తరువాత ఆమెకళ్ళనుంచి జరజరకన్నీటిప్రవాహం సాగింది. యతీంద్రుడు ఆమెపరుండివున్న మంచంప్రక్క మోకాళ్ళపై కూర్చొని ఆమెచేతులముందు తలవంచి చాలా సేపు వున్నాడు. కంగలీ తనమెడలోని మాలతీసి యతీంద్రుని మెడలో వేసింది.

ఇకఅప్పుడు పటల్ ఆమెదగ్గరకువచ్చి 'కంగలీ' అని అంది.

కంగలీయొక్క శుష్కించిన జీర్ణముఖం కాంతివంత మయింది. 'ఏమిటి, అక్కా?' అనిఅంది.

పటల్ దగ్గరగావచ్చి ఆమె చెయ్యిపట్టుకొని 'చెల్లీ, ఇప్పుడునీకు ఇకనామీద కోపంలేదుగా?' అని అడిగింది.

స్నిగ్ధకోమలదృష్టితో కంగలీ తన అక్కకళ్ళల్లోకి చూస్తూ 'లేదక్కా!' అనిఅంది.

పటల్ యతీంద్రునితో 'యతీన్, నువ్వోకసారి ఆ పక్కగదిలోకివెళ్లు' అనిఅంది.

యతీంద్రుడు పక్కగదిలోకి వెళ్ళిపోయాడు. ప్రత్యేకంగా తాను కంగలీకోసం తెచ్చిన దుస్తులనూ, ఆభరణాలనూ పటేల్ సంచిలోనుంచి పైకితీసింది. చాలా జాగ్రత్తగా, దానికి ఏమాత్రం కష్టంకలుగకుండా ఆమెధరించివున్న దుస్తులపైనే బెనారసుపట్టుచీరనుచుట్టి ఆభరణాలన్నీ ఒక్కొక్కటీ అలంకరించింది. అదంతా ముగిసిన తరువాత యతీన్‌ను రమ్మనిపిలిచింది. యతీంద్రుడు అక్కడికిరాగానే అతనిని కంగలీముందు దగ్గరకూర్చోబెట్టి, అతనిచేతికి ఒకబంగారు హారాన్నిఇచ్చింది. యతీంద్రుడు కంగలీతలను నెమ్మదిగా కొంచెం పైకెత్తి ఆ హారాన్ని ఆమెమెడలో అలంకరించాడు.

ప్రాతఃకాలపు వెలుగుకిరణాలు కంగలీముఖంపై ప్రకాశించినప్పుడు ఆ వెలుగును కంగలీ చూడలేకపోయింది. ఆమె ముఖంలోని నిర్మలమైనకాంతిని చూచినప్పుడు, ఆమెఏదో అతలస్పర్శసుఖస్వప్నంలో నిమగ్నమైవుందేగాని చనిపోలేదు అనిపించింది.

శవవాహనం కదిలేసమయంఅవగానే పటేల్ కంగలీపై బడి రోదించసాగింది – 'చెల్లీ, నువ్వు అదృష్టవంతురాలవమ్మా! జీవితంకంటే నీకు మరణమే సుఖకరమైందమ్మా'!

యతీంద్రుడు కంగలీయొక్క ఆ స్నిగ్ధకాంతి మృత్యుచ్ఛలివైపుచూస్తూ 'ఎవరిధనమో వారేతీసుకొన్నారు-నన్ను కూడా వేరుపర్చలేదు' అని ఆలోచించసాగాడు.

# అప్పగింత

ఒకనాడు బృందావనకుండు చాలాకోపంతో తండ్రి వద్దకువచ్చి 'ఈఇంట్లో నేనిక ఒకక్షణంకూడావుండను వెళ్ళి పోతున్నాను' అని చెప్పాడు.

'కాస్తయినా కృతజ్ఞతలేదు, పరమదుర్మార్గుడు. పుట్టి నప్పటినుండి వీడితిండికీ, బట్టకూ ఎంతఖర్చయిందో అదేమీ తెలియదు, ఎందుకూ చేతగాని సౌకుమంచూపిస్తాడు' అని అన్నాడు యజ్ఞనాథ్.

ఆఇంటి విషయాలతో పరిచయంవున్న ఎవరికైనా వాళ్ళతిండి గుడ్డలకుఅయ్యేఖర్చు చాలా స్వల్పమని తెలుస్తుంది. పూర్వకాలంలో ఋషులు తిండిగుడ్డలకోసం ఏమీఖర్చుపెట్టే వారు కారనివింటూవుంటాం. ఆవిషయాలలో యజ్ఞనాథ కుండు ఆపూర్వపుఋషుల అడుగుజాడల్లో నడుచుకొనేవాడు. అయితే, ఋషులవలె యజ్ఞనాథ్ తనఆదర్శాలను పూర్తిగా పాటించలేక పోవటానికి కారణం లేకపోలేదు. ఆధునికయుగ దోషంవల్ల కొంతశారీరకవిషయాలలో ప్రకృతిఏర్పరచిన కొన్ని నియమాలవల్ల కొంత అతను ఆ ఆదర్శాలను తప్పి నడవవలసి వచ్చింది.

వివాహం కానంతకాలంనూ కొడుకుచాలాఅణిగిమణిగి వుండేవాడు. కానివివాహం అయిననాటినుంచి అతినిర్మల మైన తండ్రిఆదర్శాలకూ, అతనిఆదర్శాలకూ విరోధభావం ఏర్పడసాగింది - కుమారుని ఆదర్శాలు ఆధ్యాత్మికంవైపు

మొగ్గుతుంటలానికి బసుఖు అవిశ్రాంతం వేళ్ళు ముగ్గసాగాయి. శీతోష్ణస్థితిగతులన్నా, ఆ లిపిపిచ్చికలను మన్నించివుండే ఐహిక మానవసుఖాన్ని అనుభవించటంవల్ల, తిండితిప్పల పరిమాణం ఆరోజుకారోజుకు హెచ్చుతూవుంది.

ఏ జబ్బుగురించి తండ్రికొడుకులు తమ మతగా దాపరిస్తూ కేకలు వేసుకొనేవారు. ఒకసారి బృందావన్ భార్యకు పెద్ద జబ్బుచేసింది. డాక్టరుచాలా ఖరీదుగల మందులుచెప్పాడు. అందుకని డాక్టరుకు ఏమీ తెలియదని గ్రహించి యజ్ఞనాథ్ అతనిని సాగనంపాడు. కానిఏమీ లాభం లేకపోయింది.

చివరకు బృందావన్ భార్యచనిపోయింది. అప్పుడు తండ్రిని 'హంతకుడా, నాభార్యను నువ్వే చంపేశావు' అని అతను ఎన్నో తిట్టాడు.

అందుకు తండ్రి చెప్పినసమాధానం ఏమంటే—మందులు తినేవాళ్ళెవరూ చావటంలేదా? ఖరీదుగలమందులు వేసినంత మాత్రాన చావురాకుండా చేయగలిగితే రాజులు, మహా రాజులు ఎందుకుచనిపోతారు? మీఅమ్మా, అమ్మమ్మా ఇలాగే చనిపోయారు, నీభార్య అంతకంటె గొప్పగా చావాలని నీవుద్దేశమా?'

దుఃఖంవల్ల మతిస్థిమితం లేక గాని బృందావన్ శాస్త్ర స్థిమితంగా ఆలోచించగలిగితే ఇంతబాధ వుండేదికాదు. అతనితల్లి, అమ్మమ్మ ఒక్కగుండుమాత్ర అయినా తినకుండానే చనిపోయారు. ఆమాట అబద్ధం కాదు. పూర్వంనుంచి ఈ కుటుంబంలో ఆచారమేమంటే, చావటానికైనాసరే పూర్వాచారాలను అంగీకరించనంటారు ఆధునికులు. ఇది బ్రిటిష్‌వారు

మనదేశానికి కొత్తగా వచ్చినవాటిసంగతి. అనాటి పూర్వాచార పరాయణులు కొత్తగావచ్చిన అప్పటిపద్ధతులనుచూచి మతిచెడి పాశ్చాత్యమరింత జోరుగాపీల్చేవారు.

ఏవిధంగానైతేనేమి, అప్పటి ఆధునిక బృందావన కుంటు, సనాతన యజ్ఞనాథకుంటుతో పోట్లాడి 'నేనిక ఈఇంట్లో ఉండటంపుండను, వెళ్ళిపోతున్నాను' అనిఅన్నాడు.

యజ్ఞనాథ్, కొడుకును తక్షణమే పొమ్మన్నాడు. పొమ్మనిచెప్తూ ఇకముందెన్నడైనా వాడికిఒక్కకానీ ఇస్తే తాను గోహత్య చేసినట్టే అని అందరి ముందూ ఒట్టుపెట్టుకున్నాడు. 'మాతండ్రి డబ్బులో నేను ఒక్కదమ్మిడీ ఆశిస్తే మాతృహత్య చేసినట్టే' అని బృందావన్ కూడా శపథం పట్టాడు. ఈవిధంగా తండ్రికొడుకులు ఋణానుబంధాలు తెంచేసుకొన్నారు.

చాలాకాలంనుంచి చప్పబడి నిస్సారంగా వుంటున్న గ్రామస్థుల మనస్సులు ఈచిన్నవిప్లవంతో కొంత ఉత్సాహాన్ని పొందాయి.

తండ్రిఆస్తిమీద తనకున్నఅధికారాన్ని వదులుకొని బృందావన్ వెళ్ళిపోగానే ఆగ్రామస్థులు యజ్ఞనాథ్ కు కల్గిన పుత్రవియోగదుఃఖాన్ని తగ్గించాలని శక్తివంచనలేకుండా ప్రయత్నించారు. 'భార్యపోయినమాట నిజమే అయినా ఈస్వల్పవిషయంకోసమని తండ్రితో దెబ్బలాడటం ఈకాలానికి తగిపోయింది' అని అన్నారు ఆశ్చర్యపోతూకొందరు.

వారిలో కొందరుయుక్తిపరులు అన్నదేమంటే 'భార్యపోతే మళ్ళీఇంకొకభార్య వెంటనేవస్తుంది. తండ్రిపోతే తల

బద్ధకం చేసుకుంటేమాత్రం మరొకతండ్రిరావటం సాధ్యమా! ఈవాదనలో పసలేకపోలేదు. కాని ఆమాట బృందావన్ వినివుంటే సంతోషించేవాడో, దుఃఖించేవాడో చెప్పలేము.

బృందావన్ ఇల్లువిడిచి పోవటంవల్ల తండ్రికి అంతగా బాధ కలిగినట్టులేదు. బృందావన్ వెళ్లిపోవటవల్ల కలిగిన ఒక లాభం ఖర్చుతగ్గిపోవటం. రెండోది, కొడుకు ఏవిషప్రయోగమోచేసి తననుచంపుతాడని యజ్ఞనాధ్‌కు చాలాభయంగా వుండేది – ఇప్పుడు అటువంటి భయమేమీలేదు అతను తినే తిండి చాలాస్వల్పం. భోజనంచేసే సమయంలో ఎప్పుడూ ఆవిషభయం అతనిని వెన్నంటేవుండేది. కోడలుచనిపోయిన తరువాత ఆభయం కొంతతగ్గింది, ఇప్పుడది పూర్తిగా పోయింది.

ఇప్పుడిక యజ్ఞనాధ్‌కు కల్గినదుఃఖం ఏమంటే, బృందావన్ తనతోకూడా అతనినాలుగేళ్ళకొడుకు గోకులచంద్రుని తీసుకుపోయాడు. వాడి తిండిగుడ్డలకు చాలాతక్కువ ఖర్చుఅవుతుంది. మనమడియందు ఎంతప్రేమవున్నప్పటికీ దానివల్ల డబ్బుఖర్చువుండేదికాదు. బృందావన్ తనకొడుకును తీసుకువెళ్ళటంవల్ల యజ్ఞనాధ్‌కు మనమడులేడనిదుఃఖం కల్గినమాట నిజమేకాని ఒక్కక్షణకాలం లాభనష్టాలసంగతి అతడు ఆలోచించకపోలేదు – వాళ్లిద్దరూ వెళ్లిపోవటంవల్ల నెలకు ఎంతమిగులుతుంది, ఆవిధంగా సంవత్సరానికి ఎంత లాభం వాళ్లిద్దరూ వెళ్లిపోవటంవల్ల ఆలాభం తానుసంపాదించినట్టేకదా!

అయినా గోకులచంద్ర అల్లరితో కలకలలాడుతూ వుండే ఇల్లుఇప్పుడు శూన్యంగా వెలవెలబోతూవుంది. యజ్ఞనాథ్‌కు ఇంట్లోవుండటమే కష్టమనిపించింది. నిజంగా ఇదిఅతనికి కష్టకాలమే అనుకోవాలి. తానుపూజచేసుకొంటూవుండే మధ్యన వాడువచ్చి అల్లరిచేసేవాడు; భోజనంచేస్తూవుంటే పళ్లెంలోనుంచి ఏదోఒకటి లాక్కుపోతూవుండేవాడు, తను వ్రాసుకొంటూవుంటే సిరాబుడి తీసుకుపారిపొయేవాడు, ఇటువంటి అల్లరిపనులేమీ లేకుండా నిశ్శబ్దంగా ఇప్పుడు ఆపనులన్నీ చేస్తూవుంటే తాతమనస్సుకు బాధగావుండేది.

ఎటువంటి ఉపద్రవమూలేని సంపూర్ణశూన్యత మానవునికి చనిపోయినతరువాతగాని లభించదని యజ్ఞనాథ్‌కు అనిపించింది. ఆపిల్లవాడు పరుపులోచేసిన కన్నాలూ, సిరాతో చాపమీదగీసిన బొమ్మలు చూచినప్పుడు తాతకు చాలా దుఃఖంకలిగేది. కొత్తచొక్కాకుట్టిస్తే రెండుసంవత్సరాలైనా తొడగడని తాతచేత చీవాట్లుతినేవాడు. వాడిపాతచొక్కా మురికి ముక్కలు గదిమూలచూచి తాతకళ్లుచెమర్చాయి. దానితో దీపంవత్తులుచేయకుండా జాగ్రత్తగాతీసి పెట్టెలో దాచాడు. పిల్లవాడు తిరిగివస్తే వాడుసంవత్సరాని కొక చొక్కాచింపేసినా వాడినితిట్టకూడదని మనస్సులో అనుకొన్నాడు.

అయినా గోకుల్ తిరిగిరాలేదు. యజ్ఞనాథ్ పూర్వంకంటె త్వరగావృద్ధుడైపోతున్నాడు. ఆశూన్యగృహం అతనికి మరింతశూన్యమైపోతున్నట్టనిపించేది.

అపరిచితుడైన ఈపిల్లాడు కనపరచిన ఆకొత్తరకం ఆదరణ యజ్ఞనాథ్‌కు ఆనందం కలిగించింది. నిర్భయంగా ఇటువంటి బాంధవ్యాన్ని ఎంతోకాలంనుంచి ఎవరూ కనపరచలేదు. వాడికిఏవేవోమాటలుచెప్పి, ఎన్నోఆశలుచూపించి యజ్ఞనాథ్ ఆకుర్రాడిని కొంతవరకు వశపర్చుకొన్నాడు.

'అబ్బాయీ, నీపేరేమిటి?'

'నిత్యపాల్.'

'మీ ఇల్లెక్కడ?'

'నేను చెప్పను.'

'మీనాన్న పేరేమిటి?'

'చెప్పను.'

'ఎందుకని చెప్పవు?'

'నేను ఇంటినుంచి పారిపోయివచ్చాను.'

'ఎందుకని?'

'మానాన్న నన్ను బడికి పంపుతానన్నాడు.'

ఇటువంటి పిల్లాడిని బడికిపంపటం అనవసర ఖర్చుఅనీ, ఇతనిని బడికిపంపదలచుకొన్న ఆ తండ్రికి ఏమాత్రం విషయ జ్ఞానం లేదనీ యజ్ఞనాథ్ అనుకున్నాడు.

'మాఇంట్లోవుంటావా?' అనిఅడిగాడు యజ్ఞనాథ్.

ఆకుర్రాడు అందుకేమీ అభ్యంతరపెట్టకుండా ఒప్పుకొన్నాడు, రోడ్డుప్రక్కచెట్టుక్రింద ఏసంకోచమూలేకుండా మనం వుండగలుగుతామో అదేవిధంగా ఆకుర్రాడు అంత నిస్సంకోచంగా ఆవృద్ధునిఇంట్లోమకాంవేసుకూర్చున్నాడు.

అంతేకాదు – తన తిండికి గుడ్డలకు ఆ సొమ్ము ఖర్చు అంతకు ముందే తాను అస్పృశ్యునిగా సంపాదించిన తనకష్టం వచ్చినవన్నీ అడుగుతూ వుండేవాడు పైగా తనకష్టం తీర్చక పోతే ముసలాయనతో పోట్లాడేవాడు. తన కుమారుడు అడిగినప్పుడు లేదుపొమ్మన్న యజ్ఞనాథ్ ఈ పరాయిపిల్లాడి కోర్కెలన్నీ తప్పకుండా తీర్చేవాడు.

యజ్ఞనాథ్ నిత్తెపాల్‌ను ఇంత ప్రేమతో చూస్తాడని ఎవరూ అనుకోలేదు. అటువంటివారికి, ఇతనిమీద అంత ప్రేమేమిటా అని ఆశ్చర్యం కల్గింది. ముసలివాడు ఇక ఎన్నో రోజులు బ్రతకడు. చస్తూ చస్తూ ఆస్తిఅంతా కుర్రాడికి ఇచ్చిపోతాడని అందరికీ అనుమానం కల్గింది. దానితో అందరూ ఆపిల్లాడిమీద ఈర్ష్యపడసాగారు. వాడికేదైనా కీడుచేయాలని గ్రామస్తులందరూ పరస్పరం నిశ్చయించుకొన్నారు కాని యజ్ఞనాథ్ కుర్రాడిని కడుపులో పెట్టుకొని కాపాడుతూ తిరిగేవాడు.

మధ్యమధ్య కుర్రాడు వెళ్ళిపోతానని బెదిరిస్తూవుండే వాడు. వృద్ధుడు తనఆస్తిఅంతా నీకే ఇస్తానని అతనిని బుజ్జగిస్తూ వుండేవాడు. వయస్సులో చిన్నవాడయినప్పటికీ ఆ కుర్రాడు ముసలివాడి ఆ స్థితిని బాగా గ్రహించ గలిగాడు.

గ్రామస్తులు ఆకుర్రాడి తల్లిదండ్రులజాడ తెలుసుకోటానికి ప్రయత్నం ప్రారంభించారు. ఆపిల్లాడిమీదకోపం వచ్చినప్పుడు వాళ్ళు 'పాపం, ఆతల్లిదండ్రులు కుర్రాడికోసం ఎంతదుఃఖిస్తున్నారో' అనేవారు. ఈకుర్రాడు తక్కువ వాడేమీ కాదు, చాలా పాపాత్ముడుఅని ఆపిల్లాడిని తిట్టుతూ వుండేవారు. ఆతిట్లనొక్క తీవ్రతనుబట్టిచూస్తే అది ఆపిల్లాడి తల్లిదండ్రుల యందుండే న్యాయబుద్ధివల్లగాక వాడంటే

అసూయవల్ల అని స్పష్టం అయేది.

దామోదరపాల్ అనేవాడెవడో ఇంటినుంచి చెప్ప కుండా పారిపోయిన తనకొడుకు కోసం వెతుక్కుంటూ తిరిగితిరిగి చివరకు ఈ గ్రామానికి వస్తున్నాడని ఒకనాడు యజ్ఞనాథ్ ఎవరో చెప్పగా విన్నాడు.

ఇదివిని నిత్తై చాలా కంగారుపడ్డాడు. ఆ సంగతి దేవుడెరుగు, ముందుఇక్కడినుంచి పారిపోవాలనుకొన్నాడు.

యజ్ఞనాథ్ నిత్తైతో 'దాగుంటానికి నీకు నేను మంచి స్థలమొకటి చూపిస్తాను. ఈ గ్రామస్థులకుకూడా ఎవరికీ దాని సంగతి తెలియదు' అని ధైర్యం చెప్పాడు.

నిత్తై బహుకుతూహలంతో 'అయితే ఆస్థలంచూపించు'అని అడిగాడు.

'ఇప్పుడుచూపిస్తే అందరూ తెలుసుకొంటారు, చీకటి పడగానే చూపిస్తాను' అనిఅన్నాడు యజ్ఞనాథ్.

ఆకొత్తస్థలం చూడాలని నిత్తై చాలాసరదాపడ్డాడు. నిరాశచెంది తనతండ్రి ఇక్కడినుండి వెళ్ళిపోయిన తరువాత ఆ గ్రామపుపిల్లలతో పందెంవేసి దాగుడుమూతలు ఆడాలని ఆలోచించుకొన్నాడు. ఆకొత్తస్థలంలో దాక్కుంటే - బలే తమాషాగావుంటుంది - తననెవరూ కనుక్కోలేరు. తండ్రి వచ్చి వూరంతా వెతుకుతాడు, తానెక్కడా కన్పించకుండా వుండటం, అదీతమాషాగానే వుంటుంది.

మధ్యాహ్నం నిత్తైని ఇంట్లోనే దాచి యజ్ఞనాథ్ ఎక్కడికో వెళ్ళి సాయంత్రమయేసరికి ఇంటికి తిరిగివచ్చాడు; వచ్చీరాగానే నిత్తై రకరకాల ప్రశ్నలతో ముసలాయనను విసిగించేశాడు.

ఇంకా బాగా చీకటిపడకముందే నిత్తై 'వెళ్దామా!' అని అన్నాడు.

'ఇంకా చీకటిపడలేదు' అన్నాడు యజ్ఞనాథ్.

మరి కాస్సేపటికి నిత్తై 'తాతా చీకటిపడింది. ఇక వెళ్దామా' అన్నాడు.

'మన బజారువాళ్ళింకా నిద్రపోలేదు' అని చెప్పాడు యజ్ఞనాథ్. మళ్ళీ కాస్సేపటికి నిత్తై 'అందరూ నిద్రపోయారు, ఇక వెళ్దాం' అని అన్నాడు.

చీకటిపడింది, పొద్దుపోయింది. నిత్తై కునుకుపాట్లు పడుతున్నాడు; ఎంత ప్రయత్నించినా నిద్ర ఆపుకోలేకపోతున్నాడు. సరిగ్గా అర్ధరాత్రి అయినతరువాత యజ్ఞనాథ్ బయలుదేరాడు. ఆచీకట్లో నిత్తైని చేయిపట్టుకొని నిశ్శబ్దంగా తీసుకువెళ్తున్నాడు. అక్కడకూడా మధ్యమధ్య కుక్కలుమాత్రం మొరుగుతున్నాయి. నిత్తైకి భయంవేసింది. వృద్ధునిచేయి గట్టిగాపట్టుకొని నడుస్తున్నాడు.

ఈవిధంగా నడిచి నడిచి ఒక అడవిమధ్యనున్న పాడుబడిన దేవాలయంలోకి చేరుకున్నారు. నిత్తైకి చాలానిరుత్సాహం కల్గింది - 'ఇదేనా!' అన్నాడు. ఈస్థలం అతను ఊహించుకున్నట్టుగాలేదు. ఇందులో అతడు అనుకున్నంత రహస్యమేమీ కన్పించలేదు.'

నిత్తై అప్పుడప్పుడు ఇంటినుంచి పారిపోయి రాత్రుళ్ళు ఇట్లాంటి పాడుపడ్డ దేవాలయాల్లో గడిపేవాడు. ఈస్థలం దాగుడుమూత ఆటకు బాగుండవచ్చునేమోగాని ఇక్కడ దాక్కున్నవాళ్ళను కనుక్కోవటం అసాధ్యం ఏమీకాదు.

యజ్ఞనాథ్ ఆలోపల మధ్యనవున్న రాతిపలకను పైకి

ఎత్తాడు. అక్కడ చిన్న ద్వారం ఒకటి ఏర్పడింది. దానిలో నుంచి కిందికి మెట్లూ ఒక గదిలాంటిది కన్పిస్తుంది.

ఆ గదిలో ఒక దీపం కూడా వెలుగుతూ వుంది. అది చూసి నిత్తైకి ఆశ్చర్యం, కుతూహలం కలిగాయి. కొంచెం భయం కూడా కలిగింది. యజ్ఞనాథ్ ఒక నిచ్చెన తెచ్చి వేశాడు, అతను ముందు, అతని వెనుకనే నిత్తై మెల్లగా క్రిందికి దిగారు. నిత్తైకి ఎందుకో భయం భయంగా వుంది.

ఆ గదిలో చుట్టూ ఇత్తడి బిందెలున్నాయి. మధ్యను ఒక ఆసనం, దానిముందర సింధూరం, చందనం, ఒక పూల మాల, ఇంకా ఇతర పూజాసామగ్రి వున్నాయి. నిత్తై కుతూహలం కొద్దీ గబగబ ఆ బిందెల దగ్గరకు వెళ్ళి చూచాడు. ఆ బిందెల నిండా రూపాయలూ, బంగారు నాణాలూ వున్నాయి.

అప్పుడు యజ్ఞనాథ్ కుర్రాడితో 'నిత్తై, నా ఆస్తంతా నీకిచ్చివేస్తానని చెప్పాను గుర్తుందా? నాకున్న ఆస్తి అంతా ఇదే, పెద్దగా ఏమీ లేదు - అదుగో, ఆ బిందెలలో వున్నదే- ఇదంతా ఇప్పుడే నీకు అప్పగించేస్తున్నాను.

నిత్తై సంతోషంతో గంతులు వేస్తూ 'నిజమేనా! ఇక ఇందులో ఒక్క రూపాయి కూడా తీసుకోవా?' అని అడిగాడు.

'తీసుకొంటే నాకు కుష్ఠరోగం వచ్చినట్టే! కాని ఒక సంగతి మాత్రం గుర్తుంచుకో. పారిపోయిన నా మనవడు గోకుల్ చంద్ర గాని, వాడి కొడుకు గాని, వాడి మనమడు గాని, వాడి మునిమనమడు గాని ఆ వంశంలోని వాడెవడు వచ్చినా సరే ఇదంతా వాడికి పూర్తిగా అప్పగించాలి' అని జవాబు చెప్పాడు యజ్ఞనాథ్.

నిత్తై యజ్ఞనాథ్‌కు పిచ్చెక్కిందనుకొన్నాడు. 'సరే,

అలాగే!' అని అన్నాడు ముసలాయనతో.

'అయితే, ఈఆసనంమీదకూర్చో' అని అన్నాడు యజ్ఞనాథ్ నిత్యైతో.

'ఎందుకు?'

'పూజచేయాలి'

'ఎందుకు?'

దానిపద్ధతి అ...

కుర్రాడు ఆ ఆసనంమీద కుర్చున్నాడు.

యజ్ఞనాథ్ ఆపిల్లాడి నుదుట చందనంపూసి సింధూరం బొట్టు పెట్టాడు. మెడలో పూలదండవేశాడు. ఎదురుగా కూర్చొని ఏవో మంత్రాలు చదవనారంభించాడు.

దేవతవలె కూర్చొని మంత్రాలు వింటూవుంటే నిత్యైకి భయంవేసింది. 'తాతా!' పిలిచాడు.

ముసలాయన అందుకు జవాబుచెప్పకుండా ఏకవరుసను మంత్రాలు చదువుతున్నాడు.

బహుకష్టంమీద ఒక్కొక్కబిందెనే కుర్రాడిముందుకు లాక్కొచ్చిపెట్టాడు. ఒక్కొక్క బిందెనూ అతనికి అప్పగిస్తూ అతనిచేత ఈవిధంగా అనిపించసాగాడు - 'యుధిష్ఠరకుండు కుమారుడు గదాధరకుండు, అతని కుమారుడు ప్రాణకృష్ణకుండు, అతనికుమారుడు పరమానందకుండు, అతనికుమారుడు యజ్ఞనాథ్కుండు, అతనికుమారుడు బృందావనకుండు, అతనికుమారుడు గోకులచంద్రకుండుకుగాని అతనికుమారునికిగాని, అతనిమనమడు లేదా మునిమనమడుగాని ఆవంశములో మరేవారసుడువచ్చినా ఈడబ్బంతా లెక్కపెట్టి పూర్తిగా అప్పగించేస్తాను.'

బింబెబింబెకూ ఆకు్రాడిచేత ఈమాటలన్నీ అనిపిం చాడు. కు్రాడికిమతిపోయినట్టయింది. రామరాను నాలుక పిడచకట్టిపోయింది. ఈతంతులంతా ముగిసేసరికి ఆచిన్న గుహ దీపం పొగతోనూ ఆఇద్దరూ విడిచిన బొగ్గుపులుసుగాలి తోనూ నిండిపోయింది. కు్రాడిగొంతు తడిఆరిపోయింది. కాళ్ళుచేతులు మంటపుట్టసాగాయి. ఊపిరిఆడక ఉక్కిరి బిక్కిరై పోతున్నాడు.

దీపంతగ్గితగ్గి అకస్మాత్తుగా ఆరిపోయింది. ముసలా యన నిచ్చెనఎక్కి పైకివెళ్ళిపోతున్నట్లు నిత్రైకి ఆచీకట్లో విన్పించింది.

'తాతా, ఎక్కడికివెళ్తున్నావు!' అని నిత్రై భయ పడుతూ అడిగాడు.

'నువ్విక్కడేవుండు, నేనువెళ్లిపోతున్నాను. ఎంత ప్రయత్నించినా నిన్నెవ్వరూ కనుక్కోలేరు. కాని, యజ్ఞ నాథ్ కొడుకు, బృందావన్, వాడి కుమారుడు గోకులచంద్ర గుర్తుంచుకో!' అంటూ వృద్ధుడుపైకివెళ్లి నిచ్చెనలాగేశాడు.

నిత్రైకి నోటివెంట మాటరావటంకూడా కష్టంగావుంది. 'తాతా, నేను నాన్నదగ్గరకు వెళ్లిపోతాను' అని అతిప్రయా సతో అనగలిగాడు.

యజ్ఞనాథ్ తిరిగి ఆద్వారాన్ని రాతిపలకతో మూసి వేశాడు. దానిమీద చెవి ఆనించివిన్నాడు, అడుగున రుద్ధ కంఠంతో 'నాన్నా' అని పిలుస్తున్నట్లు విన్పించింది. తరు వాత ఏదో కిందపడిపోయినశబ్దం విన్పించింది. ఆ తర్వాత మరేమీ విన్పించలేదు.

యజ్ఞనాథుడు తనధనాన్ని ఈవిధంగా అప్పగించి

ఆరాతిపలకమీద మన్ను. ఇసుక, ఇటుకలుపోసి సర్దాడు. నాలుగు అడవి మొక్కలు తెచ్చి దానిమీద పాతాడు.

ఇదంతా జరిగేసరికి ఉదయం కావచ్చింది. కాని యజ్ఞనాథ్ ఆస్థలం వదలి వెళ్ళలేక పోతున్నాడు. ఉండిఉండి నేలమీద చెవిఆనించి వింటున్నాడు. చాలాదూరంనుంచి, చాలాలోతున భూగర్భంలోనుంచి ఏదోఏడుపు విన్పిస్తుందని పించేదతనికి. ఆఏడుపుతో ఆకాశమంతా నిండిపోయినట్లు, ఆఏడుపువిని భూమిమీద నివసించే మానవకోటి నిద్రలేచి ఆఏడుపును వింటూవున్నట్లు అతనికి అనిపించింది.

యజ్ఞనాథ్ గాబరాపడుతూ మరింత మట్టితెచ్చి అక్కడ గుట్టపెడుతున్నాడు. ఈవిధంగా పృథ్వీ నోటిని మూయాలని కాబోలు ప్రయత్నంచేస్తున్నాడు.

అదిగో ఎవరో 'నాన్నా' అని పిలుస్తున్నారు.

వృద్ధుడు నేలమీదతన్ని 'నోరుమూసుకో, అందరూ వింటారు' అని అన్నాడు.

అదిగో మళ్ళీ ఎవరో 'నాన్నా' అన్నారు.

అప్పటికే బాగా పొద్దెక్కింది. యజ్ఞనాథ్‌కు భయం వేసింది. అక్కడినుంచి బయటమైదానంలోకి వచ్చాడు.

అక్కడకూడా ఎవరో 'నాన్నా' అనిపిలిచారు. యజ్ఞనాథ్ త్రుళ్ళిపడి వెనక్కితిరిగిచూచాడు. బృందావన్!

బృందావన్ అతనితో 'నాకొడుకు నీయింట్లోవున్నాడని విన్నాను. వాడినినాకు ఇచ్చెయ్యి' అని అడిగాడు.

వృద్ధుడుకళ్ళప్పగించిచూస్తూ నోరు తెరచి 'నీకొడుకా! అని అడిగాడు.

'అవును, నాకొడుకే. ఇప్పుడు వాడిపేరు నిత్తై.

నా పేరు దామోదర్. మేము పేర్లు మార్చుకొన్నాము' అని చెప్పాడు బృందావన్.

యజ్ఞనాథ్ చేతులు రెండూ ఆకాశం వైపు చాచి ఏదో పట్టుకోవాలని తడవుతున్నాడు. గాలిని పట్టుకోవాలనా అతని ప్రయత్నం? ఆవిధంగా తడువుతూ తడువుతూ కిందపడిపోయాడు.

కాస్సేపటికి తెలివివచ్చింది. యజ్ఞనాథ్ బృందావన్ ను వెంటబెట్టుకొని ఆ దేవాలయంలోకివచ్చి 'నీకువేదం వినిపిస్తున్నదా?' అనిఅడిగాడు.

'వినిపించటంలేదు' అన్నాడు బృందావన్.

'జాగ్రత్తగావిను. 'నాన్నా' అని ఎవరైనాపిలుస్తున్నారేమో!'

'లేదు' అన్నాడు బృందావన్. వృద్ధుని మనస్సుకు శాంతి కలిగింది.

ఆనాటినుంచి ఎవరు కన్పించినా 'ఏమ్చవినబడుతున్నదా?' అని అడుగుతూ వుండేవాడు. అతనికి పిచ్చెక్కిందని నవ్వుకునేవాళ్లు అందరూ.

నాలుగు సంవత్సరాలు ఈవిధంగానే గడిచిపోయాయి. ముసలివాడికి మృత్యుఘడియలు సమీపించాయి. కళ్లముందు చీకట్లు కమ్ముకుతున్నాయి ఊపిరిఆడటంలేదు. మంచంమీదలేచి కూర్చొని చేతులతోతడువుతూ 'నిచ్చెనతీసేశా రా?' అన్నాడు.

గాలి, వెలుగులేని ఆభూగృహంలోనుంచి బయటికి వచ్చే నిచ్చెన దొరకక దభీమని మంచంమీద పడిపోయాడు.

మన ప్రాణాలు ఆడే దాగుడుమూతల ఆటలో ఎక్కడ దాక్కుంటే మన నెవ్వరూపట్టుకోలేరో యజ్ఞనాథ్ అక్కడికి అదృశ్యమైపోయాడు.

# యుక్తవయస్సు

ఇంతవరకు నాకు వివాహదేవత అనుకూలించలేదు, కాని ఒక్కసారి నా మానసపద్మంమీద విరాజిల్లకపోలేదు. అయినా అప్పుడు నావయస్సు పదహారేళ్లు. నిద్రపట్టా పట్టా వున్నవాడిని లేపితే ఇకతరువాత ఎంత ప్రయత్నించినా అతనికి నిద్రరాదు. సరిగ్గా నాదీఅటువంటి అవస్థే. నాబంధుమిత్రులు భార్యాపరిగ్రహణంలో రెండో తరగతికి ప్రమోషను పొందినవారు కొందరు, మూడో తరగతిలోకి ప్రమోషను పొందనవారు మరికొందరు పోగా ఇకనాది కౌమారదశలో చివరిబెంచీ, శూన్యసంసారంలో వాసాలు లెక్కపెడుతూ కూర్చొని కాలం గడిపాను.

పద్నాలుగోఏట నేను ఎంట్రెన్సు పరీక్ష పాసయిన ఆరోజుల్లో ఎంట్రెన్సు పరీక్ష విషయంలోగానీ, వివాహవిషయంలోగాని వయస్సు పట్టింపు వుండేదికాదు. ఇరవైనాలుగ్గంటలూ క్లాసుపుస్తకాలు కొరుక్కుతినే అలవాటు నాకెన్నడూ లేదుగనుక శరీరక, మానసిక అస్వస్థతలేవీ నన్ను బాధపెట్టలేదు. కోరేవస్తువు లభిస్తేచాలు — అదితినదగినదా కాదా అనే విచక్షణలేకుండానే ఎలుక దానిని కొరుకుతుంది. అదేవిధంగా చిన్నప్పటినుంచీ దొరికిన పుస్తకమల్లా చదవే స్వభావం నాది. నాపుస్తకాల సూర్యమండలంలో చదవదగిన పుస్తకాలు భూమిన్నీ, చదవదగని పుస్తకాలు సూర్యుడున్నూ — మరి సూర్యుడు భూమికంటె పద్నాలుగు కోట్ల

రెల్లు పెద్దకదా! నేను పరీక్ష పాసవటంతో మాసంస్కృత పండితుని కఠోర భవిష్యద్వాణి ఫలించకుండా పోయింది.

మా నాన్నగారు డిప్యూటీకలెక్టరుపదవిలో వున్నారు. అప్పుడు మేము సాకాక్షీరాంగోన్లో, జహానా బాదులోనో లేక అటువంటిదే మరొకచోటెక్కడో వుండేవాళ్ళం. ఒక విషయం ముందే స్పష్టంచేయటం మంచిది. ఈచరిత్రలోని దేశకాల పాత్రలు చాలా స్పష్టంగా చెప్పినప్పటికీ అవి కేవలం కల్పితాల్లు వట్టిమిథ్య, కనుక సరస రచనద్వారా ఆనందం పొందాలనుకొనే వాళ్ళకు, కథాపాత్రలను గురించి నిజాన్ని తెలుసుకోవాలని ఎంతోకుతూహల పడేవాళ్ళకు పూర్తిగా నిరుత్సాహం కలుగకమానదు.

మానాన్న తనిఖీకి ఎక్కడికో వెళ్ళాడు. అమ్మ ఏదో వ్రతం చేస్తున్నది. వ్రతాలు మొదలైన పుణ్యకార్యాలకు బ్రాహ్మణార్థానికి అంటే దక్షిణలు, భోజనాలు పుచ్చుకునేందుకు బ్రాహ్మణుడు చాలా అవసరం – ఇటువంటి విషయాలలో అమ్మకు మాసంస్కృత పండితుడు చాలా సాయం చేసేవాడు. అందువల్ల మాపండితుడంటే అమ్మకు చాలా కృతజ్ఞతభావంవుండేది. మానాన్న గారికిమాత్రం అతడంటే సదభిప్రాయం ఏమీలేదు.

ఆవాళ భోజనానంతరం జరగనున్న దానధర్మాలలో మాఅమ్మ నన్నుకూడా చేర్చింది. అప్పుడు ముఖ్యంగా నన్ను గురించి జరిగిన చర్చసరళి ఈవిధంగా వుంది.

కాలేజీలో చదివేందుకుగాను నేనిక కలకత్తా వెళ్ళిపోవాలి. అప్పుడు మాఅమ్మ పుత్రవియోగదుఃఖాన్నిభరించ

లేదు గనుక దానిని తొలగించుటకు గాను మంచిఉపాయ మేదైనా ఒకటి ఆలోచించవలసిన అవసరం ఏర్పడింది. అప్పుడు అమ్మా పండితుడూ కలిసి, అబ్బాయిస్థానంలో ఒకశిశు వధువును గనుక తెచ్చుకుంటే ఆబిడ్డను పెంచిపెద్ద దానిని చేస్తూ అమ్మ కాలక్షేపం చేస్తూ వుండవచ్చునని నిశ్చయించారు. ఈ అవసరాన్ని మాసంస్కృత పండితుని కుమార్తె చాలా చక్కగా తీర్చగలదు - ఆమె శిశువు, గుణవంతురాలున్నూ, ఇతర విషయాలలోకూడా మాయిద్ద రికీ చక్కగా కుదిరిందట - వీటన్నిటికంటే మరొక ప్రధాన మైన సంగతివుంది - ఒకకన్యను భార్యగా స్వీకరించి ఆమె తండ్రిఅయిన బ్రాహ్మణుని రక్షించటం ద్వారా పారమార్థిక ఫలం పొందవచ్చును - అంతకంటే కోరదగింది మరేముం టుంది!

అమ్మకు చాలా సంతోషం కల్గింది. ఒక్కసారి పిల్లను చూస్తే మంచిదేనూ అని అమ్మసూచనగా అనేసరికి పండి తుడు 'అమ్మాయిని తీసుకొని నాభార్య నిన్ననే వచ్చింది' అని అన్నాడు.

అమ్మకి చూడగానే పిల్లనచ్చింది - మరేసందేహమూ లేదు. మంచికిమంచీ, పుణ్యానికి పుణ్యమూ రెండూ వున్నా యి - రెండూకలిసి బాగాతూనికవచ్చింది. 'లక్షణాలన్నీ బాగావున్నాయి' అందిఅమ్మ పిల్లనుచూచి. అంటే పిల్ల అంతరూపవతి కాకపోయినా మిగిలిన విషయాలనుబట్టిచూస్తే విచారించవలసిన పనిలేదు అని అమ్మ ఉద్దేశం.

ఈ ఏర్పాట్లు జరుగుతూ వున్నట్టు నాకూ తెలియవచ్చింది. ఏ పండితులవారి ధాతురూపాలను చూచి నేను హడలిపోయేవాడినో వారి కుమార్తె ఇవి బాహాటంగా పాడబోతున్నానిప్పుడు — వీటిలో వున్న పరస్పర వైరుధ్యం బోధపడగానే నా మనస్సు తీవ్రంగా ఆకర్షించబడింది.

ఒకనాడు మధ్యాహ్నం అమ్మ నన్ను పిలిచి 'నాయనా సంస్కృత పండితులవారు మామిడిపళ్లు, మిఠాయి పంపారు, కొద్దిగా తినుబాబూ' అని అంటె రెండు డజన్ల మామిడిపళ్లు తినమని ఇస్తే ఇంకో రెండు డజన్లు అడిగితీసుకొని తినేసే నా తత్వం మా అమ్మకు తెలుసు. కనుకనే నా నాలుకకు రుచిగా వుండే మార్గం ఆలోచించి నా హృదయాన్ని ఆహ్వానించింది మా అమ్మ. నేను లోపలికి వెళ్ళేసరికి కాశీశ్వరి అమ్మ ఒళ్ళో కూర్చొనివుంది. అంతా ఇప్పుడు నాకు స్పష్టంగా గుర్తు లేదు కాని ఆ పిల్ల జడకు ఎర్రరిబ్బను కట్టివుంది. ఆ అమ్మాయికి కలకత్తా షాపుల్లో అమ్మే సాటిన్ జాకెట్టు తొడిగారు — దానినిండా రకరకాలు లేసూ, రంగురంగుల గుడ్డలు వేసికుట్టారు. పిచ్చివాడి మాటలవలె ఆ జాకెట్టుకూడా ఆ రంగులు పరస్పర విరుద్ధంగా పిచ్చిగా కన్పిస్తుంది. నాకు గుర్తున్నంతవరకు ఆమె శరీరం శ్యామవర్ణంగా వుండే దనుకుంటాను. చిక్కని కనుబొమ్మలు రెండూ మధ్యను కలిసి పోతున్నాయి. పెంపుడు జంతువువలె నిర్భయంగా చూస్తూ కూర్చుంది. మిగిలిన వివరాలేవీ నాకు అంతగుర్తులేవుగాని అప్పుడామెను చూచి సృష్టికర్త యొక్క కార్ఖానాలో పూర్తిగా తయారు కాకుండానే ఈపిల్ల వచ్చివుంటుందని పించిందినాకు. అచ్చుపోయడం

అయిందేకాని తనపాత మెరుగులు పెట్టలేదింకా ఏదేలా
వున్నప్పటికీ. ఆపిల్ల చాలా అమాయకంగా కన్పించింది

జడకు ఎర్రరిబ్బను వేసుకున్న ఈఅమ్మాయి, రంగ
రంగుల జాకెట్టు తొడిగిన ఈపిల్ల, పూర్తిగా, అంటే నూటి
నూర్రుపాళ్లూ నాసొత్తే అని నేను లోలోపల మురిసిపోయాను
నేను ఆమె ప్రభువును, ఆమె దేవతను నేను. నాకు ప్రప
చంలో మరేది కావాలన్నా కొంత ప్రయత్నమనేది అవస
ముంటుంది, కాని ఈపదార్థముకోసం నేనేవిధమైన ప్రయ
త్నమూ చేయనవసరంలేదు - నేను కొంచెం సైగచేస్తేచాల
నేనుకోరినపని అయితీరుతుంది. ఈవరము నాకు ఇవ్వాల
భగవంతుడు నావెంటేతిరుగుతున్నాడు. మాఅమ్మనునిత్యము
చూస్తూనే వున్నాను గనుక భార్య అంటేఏమిటో నాకు
బాగా తెలుసు. నాన్నకు ఏవ్రతమన్నా కోపం, సావిత్రీవ్రత
అంటేమాత్రం పైకి ఏమీఅన్నప్పటికీ లోలోపల చాల
సంతోషపడేవాడు. నాన్న అంటే అమ్మకు ఎంతోభక్తి
అమితమైనప్రేమ అని నాకు తెలుసు. ప్రతివిషయంలోను
నాన్నకు ఎక్కడ కోపంవస్తుందో, ఎక్కడచిరాకు పడతార
అని అనుక్షణమూ అమ్మ భయపడుతూ నేవుండేది. నాన్న
లోని పురుషత్వం ఈవ్రతంలోని రసాన్ని మనసార అనుభ
వించేది. మనుష్యుడు చేసే పూజలవల్ల దేవతలకు వచ్చే
గాని పోయేదిగాని ఏమీ వుండదనుకుంటాను - ఎందువ
నంటే మనుష్యుడు ఆపూజను విధిగాచేస్తాడు. మానవుని
అవిధంగా పూజ అందుకొనే అధికారం లేదుగనుకనే అ
నిలో ఆ అధికార వాంఛ తప్పనిసరి అయిపోతుంది. ఆవా

ఆపిల్ల యొక్క రూపురేఖాలేవీ నేను గుర్తించలేను కాని ఆపద్నాలుగేళ్ళ వయస్సులోకూడా నేను పూజనీయుడననే సంగతి నాలోని పురుషరక్తాన్ని గర్వంతో ఉప్పొంగచేసింది. ఆనాడు బహుఘనంగా మామిడిపళ్ళు తిన్నాను. ఎంతో గర్వంగా మామిడిపళ్ళు ఆకులో వదిలేశాను -పుట్టి బుద్ధెరిగిన తరువాత అటువంటిపని నేనెన్నడూ చేయలేదు. నేడావిధంగా చేసినందుకు మధ్యాహ్నమంతా విచారిస్తూ కూర్చున్నాను.

నాకూ తనకూ ఎటువంటి సంబంధమో అప్పటికింకా కాశీశ్వరికి తెలిసివుండదు. కాని ఇంటికి వెళ్ళగానే తెలిసి వుంటుంది.

అప్పటినుంచీ నేను కంటబడితేచాలు కంగారుగా అటూఇటూ పరుగెత్తేది, దాక్కోటానికి ఎక్కడాచోటు దొరికేదికాదు. ఆభయము, ఆకంగారుచూస్తే నాకు చాలా సర్దాగావుండేది. ఈ విశాలప్రపంచంలో నేను కన్పించినంత మాత్రాన ఏదోఒకచోట, ఒకపదార్థంలో చలనం కల్గిందన్న మాట. ఈజీవ రసాయనిక రహస్యం నామనస్సుకు ఎంతో మనోహరంగా కన్పించేది. నన్నుచూచి ఒకరు భయపడటం, సిగ్గుపడటం మరింకేమైనా చేయటం ఇటువంటివి ఎన్నడూ నేనెరుగని, వూహించి వుండని సంగతులు. కాశీశ్వరి తన పారిపోవటం ద్వారా తాను పూర్తిగానూ, రహస్యంగానూ, ప్రత్యేకంగానూ నాదని వ్యక్తం చేసేది.

ఊరుపేరులేకుండా వున్న నేను హఠాత్తుగా క్షణంలో ఇటువంటి గౌరవ స్థానాన్ని పొందేసరికి రక్తం నాతలకు

ఎగదన్నింది. అమ్మ చేసే ఏపనుల్లోనైనాసరే అటువంటి లోపాలే ఇటు ఇతరపనుల్లోనూ ఏమాత్రం లోపం కన్పించినా నాన్న ఎంతో గందరగోళం చేసేసేవాడు. నేనుకూడా లోలోపల అటువంటి దృశ్యాన్నే వూహించుకొంటూ. నాన్న అనే మాటలు గుర్తు చేసుకొంటూ వుండేవాడను, నాన్న ఏదైనా కష్టమైనపని ప్రారంభించినప్పుడు అమ్మ అందుకు ఉపాయాలెన్నో ఆలోచించి నాన్నకు సహాయపడే సూచనలివ్వగా చేయ ప్రయత్నించేది కాళీశ్వరికూడా అటువంటి ప్రయత్నాలే చేస్తున్నట్లు నాలో నేను వూహించుకొనేవాడను. అప్పుడప్పుడు నా వూహా ప్రపంచంలో అకస్మాత్తుగా అతిలెక్కలేని తళంగా పెద్దపెద్ద కరెన్సీ నోట్లకట్టలు మొదలు విలువైన వజ్రాలవరకు ఆమెకు దానంచేస్తూవుండేవాడను. ఒక్కొక్క రోజున భోజనంముందు కూర్చొని నావూహాలోనే తనతో కాళీశ్వరి భోజనం చేయకుండా కిటికీముందు కూర్చొని పైటకొంగుతో కన్నీరొత్తుకొంటున్నట్లు చూచేవాడను - జాలిగొలిపే ఆదృశ్యం నామనస్సును కరిగించేదని చెప్పలేను. పిల్లలకు ప్రతివిషయంలోనూ స్వయంకృషి విధిగావుండాలని నాన్న అభిప్రాయం. అందువల్ల గది సర్దుకోవటమూ, బట్టలు శుభ్రంగా ఉంచుకోవటమూ మొదలగు పనులన్నీ నేనే చేసుకోవలసివచ్చేది. కాని నా వూహానేత్రానికి ఎంతో స్పష్టమైన రేఖలతో కన్పించుచున్న గృహస్థ జీవిత చిత్రాన్నొకదానిని ఇక్కడ ఉదహరిస్తాను. అది ఒకనాడు మానాన్న జీవితంలో జరిగిన దానిననుసరించి చిత్రించబడిందనేది నేను ప్రత్యేకించి చెప్పనవసరంలేదు.

ఆ రాత్రి [illegible] భోజనం చేసి దిండుకు ఆనుకొని మంచంమీద పడుకొని పత్రిక చదువుతూ వుంటాను. చేతిలో హుక్కాగొట్టం వుంటుంది. కొంచెం కన్ను మూతలుబడి హుక్కాగొట్టం చేతిలోనుంచి జారి కింద పడిపోతుంది. కాశీశ్వరి వసారాలో కూర్చుని లెక్కబెట్టి చాకలికి బట్టలువేస్తూ వుంటుంది. నా కేక వినగానే కాశీశ్వరి గబగబ లేచివచ్చి హుక్కాగొట్టము నా చేతికి అందిస్తుంది. అప్పుడు నేనామెతో 'ఇదిగో చూడు. బయటిగదిలో ఎడమ మూలనుండే బీరువాలో మూడోవరుసలో నీలిరంగు అట్ట వేసిన పెద్ద ఇంగ్లీషు పుస్తకంవుంది తీసుకురా' అని అంటాను. ఆమె వెళ్ళి ఒ నీలిరంగు పుస్తకం తెస్తుంది. అదిచూచి నేను 'కాదు, ఈ పుస్తకం కాదు. దీనికంటె లావుగావుండి వెనకపక్క [illegible] అక్షరాలతో పేరువుంటుంది' అని చెప్తాను. ఈసారి ఆకుపచ్చరంగు పుస్తకం తెస్తుంది. ఆ పుస్తకాన్ని నేలకేసి కొట్టి నేనే లేచి వెళ్తాను. కాశీశ్వరి ముఖం చిన్నబోతుంది, కళ్ళల్లో నీళ్లుతిరుగుతాయి. నేను వెళ్ళి చూడగా మూడోవరసలో ఆకుపచ్చ పుస్తకాలేవున్నట్లు, నాకు కావల్సిన ఆపుస్తకం రెండోవరుసలో వుంటుంది. అది తీసుకొనివచ్చి మొదలకుంటా మంచంమీద చదువుకుంటాను. నేను పొరపాటుపడినట్లు కాశీతో చెప్పను. ఆమె తలవంచుకొని చాకలిపద్దు రాస్తూ తన తెలివితక్కువవల్ల భర్తకు నిద్రాభంగం కల్గిందని విచారిస్తూవుంటుంది. ఎంతకీ ఆమె ఆ అపరాధాన్ని మర్చిపోలేకుండా వుంటుంది.

యావత్తు కర్చులు శామే భరిస్తామన్నారట. మావూరి ఎంట్రెన్స్ స్కూలు సెక్రటరీ అయిన వీరేశ్వరబాబుగారి మూడో కుమారుడు తొమ్మిదో క్లాసులో చదువుతున్నాడు- అక్రూరుడు 'చంద్రుడు తెల్లకలువ' అని ఏవో పద్యాలు వ్రాశాడు. సెక్రటరీగారు కన్పించిన వాళ్ళందరికీ ఒక్కరైనా విడిచిపెట్టకుండా ఆ పద్యాలు చదివి వినిపిస్తున్నాడు- గ్రామస్థులందరికీ అక్రూరుడి శక్తిసామర్థ్యాలను గురించి చాలా ఆశకల్గింది.

ఈ ఉత్సాహముయొక్క ఫలితంగా గ్రామంలోకి అడుగుపెట్టగానే, ఇంకా ఇంటికైనా రాకముందే, ఈశుభవార్త నాన్నకు తెలిసింది. ఇక అలిగి వారి అమ్మ నిరాహారవ్రతంపట్టి ఏడుస్తూ కూర్చోవటమూ, ఇంట్లోని వాళ్ళందరూ భయకంపితులై పోవటమూ, నౌకర్లకు అకారణ జరిమానాలూ, కోర్టులో కేసులు డిస్మిస్ కావటమూ, అపరాధులకు కఠినశిక్షలూ, పండితులవారికి ఉద్వాసనా, జడకు ఎర్రరిబ్బను కట్టుకొని సాటిన్ జాకెట్టు వేసుకొన్న అపిల్ల అదృశ్యమవటమూ అన్నీ వరసగా జరిగిపోయాయి ఇంకా శలవులైనా ముగియకుండానే నాన్న నన్ను బలవంతాన అమ్మకు దూరంగా కలకత్తా పంపివేశారు. నాహృదయం పగిలిపోయిన బంతివలె చప్పబడిపోయింది - నాకిక వూహా గగనంలో ఎగిరే ప్రాప్తిలేకుండా పోయింది.

౨

నావివాహ మార్గంలో మొట్టమొదటే ఈవిఘ్నం తటస్థించింది ఆతరువాత వివాహదేవత మాటిమాటికి నాపై ఎన్నిసార్లు కరుణించినా అది ఫలవంతంకాలేదు. ఇప్పు డావివరాలన్నీ చెప్పటం నాకిష్టంలేదుగనుక ఒకటిరెండు ముఖ్యవిషయాలు మాత్రం ఉదహరిస్తాను: ఇరవైఏళ్ళు నిండకముందే నేను ఎం. ఏ. పాసై, కళ్ళద్దాలు ధరించి మీసం సవరించుకుంటూ బయలుదేరాను. అప్పుడు మానాన్న నవాఖిలీలోనో రాంపూరు హాట్‌లోనో వుండేవాడు, లేదా అటువంటిదే ఏబారాసత్ లాంటి ప్రదేశంలోనే వుండేవాడు. నేనిప్పటివరకూ చేసింది శబ్దసాగర మథనం దానివల్ల డిగ్రీలు లభించాయి, ఇప్పుడిక ధనసాగరమథనం చేయాలి. అప్పుడునాన్న తన శ్రేయోభిలాషులైన గొప్ప హోదాలోవున్న వారిని గుర్తుచేసుకోసాగాడు. నాన్నకు తప్పక సహాయం చేయవలసిన వాడున్నా అందరిలోకి అతిముఖ్యుడు అయిన ఒకరు పరలోక యాత్రచేశారు. అంతకు కొంచెం తక్కువవాడు పెన్షను పుచ్చుకొని ఇంగ్లండు వెళ్ళిపోయాడు. మరొక మెట్టుక్రిందివాడు బదిలీఅయి పంజాబు వెళ్ళిపోయాడు. ఇహపోతే బెంగాలులో శేషించివున్న చిన్నవారిలో పెద్దవాళ్ళు ఆశ్రితులకు ఇచ్చింది ప్రథమంలో ఆశ, ఉపసంహారంలో సంహారము. మాతాత డిప్యూటీ కలెక్టరుగా వున్నరోజుల్లో సిఫార్సు మార్కెట్టు ఇంతమందంగా వుండేదికాదు. ఆ రోజుల్లో ఒకరు ఉద్యోగించేసి పెన్షను పుచ్చుకుంటేఅంటేనే

ఆవంశంలో మరొకరు ఉద్యోగంలో ప్రవేశించేవారు - ఈ విధంగా నదిని దాటించే పడవలవలె ఉద్యోగాలు ఇటునుంచి అటూ అటునుంచి ఇటూ నిర్విరామంగా తిరిగేవి. ఇప్పటి రోజులు అంత అనుకూలంగా లేకపోవటంవల్ల నన్నుగురించి ఏంచేయాలాఅని మానాన్నకు దిగులుగావుండేది. ఉన్నత స్థానంలోవుండే ప్రభుత్వపు ఉద్యోగ పంజరం వదులుకొని క్రిందనుండే వ్యాపారుల ఆఫీసుల్లోకి దిగిరావటమా లేదాఅని నాన్న సతమతమయ్యే సమయాన, ఒక ధనిక బ్రాహ్మణుని ఏకైక పుత్రిక దృష్టిలోకి వచ్చింది. ఆబ్రాహ్మణుడు ఒకపెద్ద కంట్రాక్టరు. ప్రత్యక్షమార్గాల ద్వారాకంటె అతనికిఅదృశ్య మార్గాల ద్వారా వచ్చే ఆదాయం చాలా అధికం. క్రిస్మస్ రోజుల్లో అతడు అర్హులైన వాళ్లందరికీ కమలాఫలాలు వగైరా కానుకలు పంపే సందడిలో వున్నప్పుడు నేను వారి పేటలో వారింటిముందు వెలిశాను.

అతని ఇంటికి ఎదురుగానె మజిల్, మధ్యలోడ్డు మాత్రమే అడ్డం పెళ్ళికాని ఆడపిల్లల తండ్రులకు ఎం. ఏ పాసయిన వరఫలం అందాలంటే బాగా పొడవైన చేతులు వుండాలి. కనుకనే కంట్రాక్టరుగారు నావైపు చేతులు చాచారు. అంటే ఆయన చేతులు మిక్కిలి పొడవైనవని పాఠకులు గ్రహించే వుంటారు. అతిసునాయసంగా డిప్యూటీ కలెక్టరుగారి హృదయసీమ అందుకోగలగాలి. కాని అప్పటికి నాహృదయం చాలా పైకివెళ్ళిపోయింది.

నావయస్సప్పటికి ఇరవైకి మించీ మించకుండావుంది. నేనప్పుడు కోరేది అసలైన శ్రీలక్ష్మిగాని ఇంకేరత్నమూ

కంటే చిన్నదిఅయినా అమ్మాయి అందంగా బొమ్మవలె వుంటుంది, చిన్నది. చూచిన వాళ్ళకు ఆమె సహజంగా పుట్టి పెరిగిన అమ్మాయి అనిపించదు - ఒక్కొక్క వెండ్రుక సాపుచేసి కనుబొమ్మలు అద్ది, అమ్మాయిని ఎవరో అచ్చు పోసినట్లుంటుంది. ఆమె సంస్కృతంలో గంగాస్తోత్రం వర్ణించ గలదు. ఇక ఆమెతల్లి బొగ్గులను గంగాజలంతో శుద్ధిచే యనిదే వాటిని వంటకు ఉపయోగించేదికాదు. జీవులకు ఆధారమైన ఈభూమి నానా జాతులను మోస్తున్నది గనుక ఆమె భూ ఃని ముట్టుకోటానికి ఎల్లప్పుడూ సంకోచిస్తూ వుండేది. ఆమెపనులన్నీ ఎక్కువ భాగం నీటితోనే, జల చరములైన చేపలు ఏమహమ్మదీయ జాతికో చెందినవి కాదుగనుక ఆమెకు చేపలు నిషేధంకావు. ఉల్లిపాయలు నీటిలో జన్మించవుగనుక వాటిని నిషేధించింది. దేహము, గృహము, బట్టలు, బిందెలు చెంబులు, మంచము పరుపు మొదలగు సామానులను శుద్ధిగా శుభ్రంగా వుంచుకొంటూ వుండటమే ఆమె జీవితంలో విశ్రాంతిలేకుండా చేసేపనులు. మధ్యాహ్నం రెండున్నర గంటలవేసరికి ఈనిత్యకృత్యా లన్నీ పూర్తవుతూవుండేవి కుమార్తెను కూడా తన అడుగు జాడల్లోనే నడిపించుకొచ్చింది - తనేస్వయంగా కుమార్తె సంరక్షణా భారాన్ని వహించింది. స్వంత అభిప్రాయాలు, కోర్కెలు వుండటం అనే ప్రమాదమేమీ లేకుండా ఆపిల్లను చాలా పరిశుభ్రంగా తయారుచేసింది. ఎంత కష్టంకలిగే పద్ధ తులనైనాసరే తేలిగ్గా భరించేది - సబబుగా కన్పించే కార ణాలు ఎవరైనా చెప్పగల్గితే ఆమె భోజనం చేసేటప్పుడు

శుభ్రమైన బట్ట ఎప్పుడూ కట్టుకొనేదికాదు, బట్టశుద్ధి ముఖ్యముగాని శుభ్రత ముఖ్యంకాదు. నీతిని గురించికూడా మంచిచెడులు ఆమెకు తెలిసేవి. ఆమె పల్లకీలో కూర్చొనే గంగాస్నానంచేసేది. ఎంతస్వల్ప విషయమైనాసరే అష్టాదశపురాణాల ననుసరించే ఆమె సంసారయాత్రచేసేది. మాఅమ్మకు విధివిధానాలంటే కూడా భక్తివుండేది, పట్టుదలవుండేది. ఆవిషయాల్లో తనకంటె మించిన వాళ్లున్నారనివిన్నా, వున్నందుకెవరైనా గర్వపడుతున్నా అమ్మ సహించలేకపోయేది. అది తెలిసి నేను అమ్మతో 'ఆ అమ్మాయికి నేను తగిన వాణ్ణికాదమ్మా' అన్నాను అమ్మనవ్వుతూ 'ఈ కలియుగంలో ఆమెకు తగిన వరుడు లభించటం దుర్లభం' అని అంది.

'అయితే నన్నిక వదిలేయండి అమ్మా' అన్నాను నేను

'ఎందుకనినాయనా, పిల్లఅంత అందంగా వుందికదా, నీకు నచ్చలేదా?' అని అడిగిందిఅమ్మ.

'భార్యాఅంటే చూచి మెచ్చుకొంటూ కూర్చోటానికేనా? జ్ఞానం అనేది వుండాలికదా!' అన్నానునేను

'అదేమిటినాయనా? ఆమెకు జ్ఞానం లేనట్లు ఇంతలోనే నువ్వెలాకనిపెట్టావు?' అనిఅడిగిందిఅమ్మ.

'జ్ఞానమ్ము తెలిసినవాళ్లు రాత్రింబగళ్లు అటువంటి అర్థంలేనిపనులు చేస్తూకూర్చోరు, ఒకవేళ చేయవలసి వచ్చినా ఊపిరి ఆడక చచ్చిపోతారు' అన్నానునేను.

నాజవాబువిని అమ్మముఖం వాడిపోయింది. ఈసంబంధంవిషయంలో నాన్న ఆడపిల్ల పక్షంవారికి మాటఇచ్చినంత

గట్టిగా చెప్పారని అమ్మకు తెలుసు. ఇతరులకు హాతాకోర్కా-
అనే ఒక అనవసర పదార్థం వుండవచ్చునని నాన్నకుగుర్తుండ
దని అమ్మకు తెలుసు. కాని మానాన్న అగ్నిహోత్రుడై
వత్తిడిచేయకుండావుంటే కొద్దిరోజుల్లో నేను అష్టాదశపురాణాల
మధ్య నివసిస్తూవున్న ఆబామ్మను వివాహమాడి, బహు
తీవంగా స్నానపానాదాలు చేస్తూ, వ్రతాలూ ఉపవాసాలతో
గంగాతీరాన సద్గతి పొందివుండేవాడను. అనగా ఈ వివాహ
బాధ్యతను నాన్న అమ్మకు వదిలివేసివుంటే, అమ్మ సమ
యంకనిపెట్టి మెల్లిగా నాచెవిలో మంత్రోపదేశంచేస్తూ
తగినవేళ గమనించి కంటతడిపెట్టుకొంటూ ఆ కార్యాన్ని
సాధించగలిగివుండేది. నాన్నగద్దిస్తూ పెళ్ళికి ఒప్పుకుంటావా
లేదా అని అడిగేసరికి ఏం జరిగినాసరే అని ధైర్యంచేసి
'అన్నంతినటం, బట్టకట్టుకోవటం మొదలుకు చిన్న విషయా
లలో స్వాధీనత అలవర్చుకోవాలని చిన్నప్పటినుంచి నాకు
ఉపదేశించారు. మరి ఈపెళ్లివిషయంలో ఆ స్వాధీనత పనికి
రాదంటారా?' అని అనేశాను

కాలేజీలో నేర్చుకొనే న్యాయతర్క శాస్త్రాల
మూలంగా పరీక్షలు పాసవటం తప్ప నాకు తెలిసినంతవరకు
ఎవరూ ఏదీ సాధించలేరు కుతర్కంమీద సరియైన తర్కం
నిప్పులోవనీళ్లుపోసినట్లుగా గాక మంటలోపోసిన నూనెవలె
పనిచేస్తుంది. నాన్నవాళ్ళకు మాటఇచ్చాడు గనుక పెళ్లి
జరిగి తీరాల్సిందే. నాన్నగారి ఉద్దేశంలో ఈ వివాహం
న్యాయమైనదనటానికి ఇంతకంటె ప్రబలమైన నిదర్శనమేదీ
వుండదనే. ఆనాడు అమ్మ సంస్కృతపండితునికి మాట

ఇచ్చినా వివాహంజరగలేదు, పైగా పండితుని జీవనోపాధికి కూడా నష్టం కల్గింది.

జ్ఞానము, వివేకము, సురుచి మొదలగు వీటన్నిటి కంటే శుచి, మంత్రతంత్రాలు, క్రియా-కర్మలు చాలా గొప్పవనీ, వాటిలోవుండేసారం చాలాఘనమైనదనీ, వీటి ఫలంకూడా చాలాఉత్తమమైనదనీఅంటూవుండేవాడునాన్న. ఈమధ్య నాన్న రోజూ ఎప్పుడుపడితే అప్పుడు అవసరమైనా లేకపోయినా 'లాక్షణికవాదమే' 'ఆదర్శవాదం' అని నాకు వినిపించేటట్లు అంటూ వుండేవాడు. నేను నోటికి మూత వేసి వుంచానేకాని మనస్సును అదుపులో వుంచలేకపోయాను. ఉండి ఉండి ఒకమాట నాలికచివరవరకువచ్చి అక్కడే ఆగి పోయేది-వీటియందు మీకునిజంగానే అంతభక్తిశ్రద్ధలువుంటే ఆచరణలోకి వచ్చేసరికి వాటిని ముట్టకూడని పదార్థంగా చూస్తారెందుకు?' మరొక విషయంకూడా గుర్తొచ్చిందినాకు- తనకేదో ఇబ్బంది కల్గిందనో లేక కష్టం కల్గిందనో ఒకనాడు నాన్న, ఈ దాన ధర్మాలనూ, తిథివారాలనూ, వ్రతాలనూ మన్నించేవాళ్లు పశుప్రాయులని అమ్మను తీవ్రంగా దూషించాడు. ఏదో తప్పు జరిగిందని అమ్మ అంగీకరించి, సహజంగా స్త్రీలు అజ్ఞానులనిఅంటూ తలవంచుకొని ఈసారి ఇంకా గొప్పగా బ్రాహ్మణులకు సంతర్పణచేయాలని నిశ్చయించుకొని తినకల్గిన చీవాట్లూ, దుఃఖాన్నీ మర్చిపోయింది. నాన్నకు ఇవన్నీ గుర్తుచేయటంవల్ల ఏమీ ప్రయోజనం వుండదని నాకు తెలుసు. సృష్టికర్త మనుష్యులను తర్కాపు అచ్చుల్లో పోసి తయారుచేయటంలేదు, కనుక మనం ఎవరికద్ద

కైనా వెళ్ళి 'మీరు చెప్పేదానికీ చేసేదానికీ ఇంత పరస్పర విరుద్ధం వున్నదెందుచేత?' అని గనుక అడిగితే వాళ్లు కళ్లు తెరిచి చూడరు సరేకదా, కళ్ళుమూసుకొని కోపంతో మండి పడతారు. న్యాయదేవతను తోడ్పడమని వేడుకొంటే అన్యాయం తీవ్రరూపంతో లేస్తుంది - రాజకీయంగాగాని, సాంసారికంగాగాని ఆందోళన చేయదలచుకొన్నవాళ్ళు ఈ విషయం తెలుసుకొనివుండాలి. తనను బండికి కట్టడం అన్యాయమని తలచి గుర్రం బండిని తన్నటంవల్ల, ఆ అన్యాయం పోదు సరేకదా కాళ్ళకు దెబ్బలు తగులుతాయి. యువకత్వంలో వుండే ఆవేగం కొద్దీ నేనూ కొంచెం వాదించబోయేసరికి నాస్థితి అంతే అయింది - ఆ పురాణాల పెళ్ళికూతురు బాధ నుంచి తప్పించుకో గల్గింది నిజమే కాని మా నాన్న ఖాతా పుస్తకంతో నాకున్న సంబంధం కాస్తా తెగిపోయింది. 'మంచిదే, నువ్వు స్వతంత్రంగానే వుండు' అన్నాడు నాన్న. నేను నమస్కరించి 'సరే' అన్నాను. అమ్మ మూలకూలబడి ఏడ్వ నారంభించింది.

నాన్నగారు పూర్తిగా విముఖత వహించినా అమ్మ మధ్యనుండటంవల్ల ఆమె నుంచి మనియార్డర్లు వస్తూనే వుండేవి. మేఘం వర్షించటము మానిందే కాని రాత్రులందు రహస్యంగా శిశిరాభిషేకం జరుగుతూవుండేది. దానిని ఆధారంగా చేసుకొని సరిగా డెబ్భైతొమ్మిది రూపాయలతో వ్యాపారానికి పునాది వేశాను. ఆ వ్యాపారంలో నేను తిరుగుతున్న డబ్బు, అందరూ ఈర్ష్యతో అతి తక్కువగా లెక్కవేసి ఇరవై లక్షలు అంటారు.

వివాహ దేవత భటులు నా చుట్టూ తిరగటం ఆరంభించారు. ఇప్పటివరకు తలుపులుమూసివుండేవి కాని ఇప్పుడా విధినిషేధాలేవీ లేవు. యౌవనంలోవుండే ఆశ దుర్నివారమైనదవటంవల్ల, ఆ ఆశచొప్పున ఒక పదహారేళ్ళకన్యవైపు పోనిచ్చాను మనస్సు-పూర్వాచారపరాయణుల మనస్సులకు నొప్పికల్గుతుందేమో అని వయస్సు తగ్గించి పదహారేళ్ళకన్య అని చెప్పాను. కాని ఆపిల్లతాలూకు పెద్దలు ఎవడైనా ఐ. సి. ఎస్. వారుపట్టాడేమోనని చూస్తున్నారట. ఐ. సి. ఎస్. వారకనప్పుడు అధమపక్షం బారిష్టరైన వాడైనా కావాలట - అంతకుతక్కువవాళ్ళవైపు వాళ్ళదృష్టి పోనే పోదట. వాళ్ళకొలబద్ద ప్రకారం నేను జీరోపాయింటు కంటె దిగువనే వున్నాను. కాని కొద్దిరోజులు పోయిన తరువాత ఆయింటికి టీ తాగటానికే కాకుండ ఫలహారానికికూడా వెళ్ళటం జరిగింది. ఒకనాడు రాత్రి విందు అయినతరువాత ఆఇంటి యువతులతో కలిసి చీట్లాట ఆడాను. వాళ్ళనోట విన్న ఇంగ్లీషు మాటలూ, ఆధోరణి అచ్చు దొరల పద్ధతిగా వున్నాయి. ర్యాసిల్లాస్; డిజెర్టెడ్ విలేజ్ మొదలైనవీ ఎడిసన్, స్టీల్ వ్రాసినవి చదివి ఇంగ్లీషులో నేనెంతబాగా ప్రవీణత సంపాదించినా ఆయువతులతో కలిసి సంభాషించటం నాకు చేతనైనపనికాదు. దొరలవలెనేనూ 'ఓమై, డియర్, ఓడియర్' అనిఅనబోతే సరిగ్గా అనలేక పోగా విన్నవాళ్ళకు బహు అసహ్యంగా వుంటాయి. నాకు చేతనైన ఇంగ్లీషుతో బజారుకువెళ్ళి ఏదైనా బేరమాడి కొని తీసుకు రాగలనేగాని ప్రేమసంభాషణ ఆరంభిస్తే వున్నప్రేమ

కూడా ఎగిరిపోకతప్పదు. ఆ ఇంట్లో మాతృభాష కరువువచ్చి చచ్చిపోయింది. చక్కని మాతృభాషతో ఆ అమ్మాయిలతో సంభాషణ చేయటానికి ప్రయత్నించటం వృధా శ్రమే అవుతుంది. సరే, అదంతా ఎలావున్నప్పటికీ విదేశీగిల్టు పూతవేసిన ఆ ఇంటమ్మాయి నాకు సులభసాధ్యమైన వస్తువైంది, కాని తలుపులుమూసి వున్నంతసేపు ఆసందులోనుంచి కన్పిస్తూవున్న స్వప్నలోకం తలుపుతెరవగానే అదృశ్యమైపోయింది. అప్పుడు, పూర్వం నాకిచ్చి పెళ్ళిచేస్తానన్న వ్రతధారిణిసంగతి జ్ఞప్తొచ్చింది. వ్యర్థనియమ నిష్ఠలతో రాత్రింబగళ్లు ఎడతెరపిలేకుండా ప్రదక్షిణలు చేయటంద్వారా ఆమె తనచైతన్య రహితమైన బుద్ధిని తృప్తిపర్చుకొంటూ వుండేది. ఈ యువతుల మనస్సులు కూడా అటువంటివే, వీళ్ల బుద్ధీ అటువంటిదే. పూర్తిగా సారహీనమైన దొరల పద్ధతులన్నీ అలవర్చుకొని, ఉదయం మొదలు సాయంత్రం వరకు వాళ్ళ నియమాలలో మునిగి తేలుతూ సంవత్సరాల తరబడి విసుగు విరామం లేకుండహాయిగా కాలంగడుపుతున్నారు. స్నానము శుద్ధివిషయాల్లో ఏకొద్దిలోపంకల్గినా వాళ్ళకెలాసహించదో అదే విధంగా వీళ్ళకుకూడా మనమాటల ఉచ్చారణలో ఏవిధమైన లోపము కన్పించినా, లేక చంచాలు, ఫోర్కులతో భోజనం చేయలేకపోయినా మన మనుష్యత్వాన్ని గురించి సందేహం కలుగకమానదు. వాళ్లు దేశవాళీబొమ్మలయితే వీళ్ళు విదేశీబొమ్మలు. వీళ్లుకూడా తమ మనస్సుల్లోని శక్తి వల్ల నడవలేరు — లోనపాతుకొనివున్న అభ్యాసమనే యంత్రం వల్లనే వీళ్ళకీ నడక ప్రారంభమవుతుంది.

వీటన్నిటికి పర్యవసానంగా నాకు స్త్రీజాతి అంటే ఏమాత్రం గౌరవములేకుండాపోయింది. వాళ్ళల్లో జ్ఞానం లోపించినకొద్దీ, స్నానాలు, ఉపవాసాలు, నియమాలు హెచ్చుతూవుంటాయి, లేనిచో వాళ్ళు జీవించి వుండలేరని నేనుసిద్ధాంతీకరించాను. ఒకవిధమైన జీవాణువు వుందనీ, అదిఎప్పుడూ చుట్టూ తిరుగుతూవుంటుందనీ ఎక్కడో పుస్తకంలో చదివాను. మానవుడు తిన్నగా నడుస్తూ వుంటాడే కాని ఆవిధంగా తిరుగుతూవుండడు. ఆ జీవాణువుయొక్క పరివర్తిత సంస్కరణమే మానవజాతి - ఈపరివర్తిత సంస్కరణముగాని ప్రతులలో ఒకదానిని. అనగా స్త్రీ నొకర్తెను ఎన్నుకొని వివాహం చేసుకొని జీవితమంతా గడపాలని బ్రహ్మ పురుషుని నొసట వ్రాశాడు.

ఇటువంటివిధంగానైతే నావయస్సుపెరుగుతూ వచ్చిందో అటు పెళ్ళిఅంటే కల్గిన సందిగ్ధభావం కూడా నానాటికీ బలపడుతూ వచ్చింది. మానవజీవితంలో ఒక వయస్సు వుంటుంది - ఆవయస్సులో వున్నప్పుడు ఎవరైనాసరే ఏవిధమైన ఆలోచనా, సందేహమూ లేకుండా వివాహం చేసుకోగలడు. ఆ వయస్సు మించిపోయిన తరువాత వివాహమాడాలంటే చాలా సాహసించాల్సి వుంటుంది. నేను అటువంటి సాహసం గలవాడనుకాను. అంతేకాక, స్వాభావిక పద్ధతిని పెరుగుతూ వున్న ఏ అమ్మాయైనా నన్నుచూచీ చూడగానే ఏవిధమైన కారణమూ లేకుండా పెళ్ళాడ కోరుతుందని నేను విశ్వసించను. ప్రేమకు కళ్ళుండవని విన్నానుకాని అంధప్రేమకు పెళ్లితో సంబంధంలేదు. సంసారయాత్రకు కావలసిన వివేకా

నికి రెండు కళ్ళకంటె అధికం వుంటాయి. ఎటువంటి నిషా గాని ఉన్మత్తతగాని లేకుండా నావైపు చూచినప్పుడు ఆక ళ్ళకు నాలోకన్పించగల గొప్పవేముందీ అనే ఆలోచిస్తు న్నాను. నాలో ఏమియువలేకపోలేదు. కాని చూడగానే అది కంటపడేది కాదు, దానిని గ్రహించటానికి కొంతసమయం కావాలి. నాకున్న చప్పిదైన లోటును నామనస్సులో వుండేటుట్టిపూర్తి చేసిందని నాకు తెలుసు అయితేనేం, ఆభగ వంతుడు ముక్కును కంటికి కల్పించేస్తు, మనస్సును నిరాకా రంగానూ చేశాడు. కనుక ఈడువచ్చిన అమ్మాయి ఎవరైనా నన్ను పెళ్ళాడటానికి వెంటనే అంగీకరించిందని తెలిసినప్పుడు స్త్రీ జాతియందు నాకున్న గౌరవం మరింత తగ్గిపోయేది. నేనేస్త్రీనయివుంటే శ్రీయుత సనత్ కుమార్‌గారి ఆశా. అహాంభావాలు అతని పట్టికుక్కలోనుంచి వస్తూవుంటే నిట్టూర్పులతోనే వ్యర్థమైపోయి వుండేవి.

ఈవిధంగా నా వివాహానావ మధ్యమధ్య దిబ్బలకు పడుతూవుండేకాని రేవుకుమాత్రం చేరలేదు నా వ్యాపారం అభివృద్ధిచెందినకొద్దీ దానితోపాటు ఒక్కభార్యతప్ప సంసా రానికి కావలసిన మిగిలిన ఉపకరణాలన్నీ పెరుగుతూ వచ్చాయి. వయస్సు పెరుగుతూవున్నసంగతికూడా మరచి పోయాను, కాని ఒక చిన్నఘటనజరగటంవల్ల అదిగుర్తొ చ్చింది. అభ్రకంగనులు తనిఖీకోసమని ఛోటానాగపూరు ప్రాంతంలోవున్న ఒకపట్టణానికి వెళ్ళాను. అక్కడ పట్టణం బయటవున్న వనము సమీపాన మకాంచేశాను. ఆవనంలోనే ఒక చిన్ననదీతీరాన కొద్దిపాటి కుటీరం నిర్మించుకొని

మహాసంస్కృతపండితుడు హాయిగా కాలం గడుపుతున్నాడు. అతనికొడుకు అప్పట్లోనే ఉద్యోగం చేస్తున్నాడట. నేను గొప్ప ధనికుడనన్న విషయం దేశమంతటా వ్యాపించింది. ముందుముందు నేనొక అసామాన్య పదవిలోకి వస్తానని సంస్కృతపండితునికి ముందుగానే తెలుసునట. ఆవిషయాన్ని అతి రహస్యంగావుంచాడు. అయితే అతను నాతో వేటిని ఆధారంగా ఆవిషయం చెప్పగలిగాడో మాత్రం నాకు తెలియదు - ఈవిధంగా అసామాన్య పదవిలోకివచ్చేవాళ్ళకు చిన్నప్పుడు వస్త్రసమయం తిన్నగా రాదేమో. బహుశా దానిని బట్టే సంస్కృతశాస్త్రాను ఉపాంగాలు తెల్పుకొనివుండవచ్చును కాశీశ్వరి అత్తగారింటికి వెళ్ళిపోవటంవల్ల నేను శాస్త్రులు గారింట్లో వారింటి అబ్బాయివలెనే స్వేచ్ఛగా వుండగలిగాను. శాస్త్రులుగారిభార్య రెండ్రుసంవత్సరాలక్రితం చనిపోయింది. ఇప్పుడా ఇంటినిండా మనుమరాళ్ళు గుంపొకటిచేరి వుంది. వారిలో ఇద్దరు పరలోకగతుడైన అతని అన్నగారి మనుమరాళ్ళు శాస్త్రులుగారు వృద్ధులైపోయారు. వార్థక్యపు అంత్యభాగాన్ని ఆపసివిద్దలతో కలిసి వివిధరంగులతోచిత్రించుకొని శాస్త్రులు హాయిగా కాలంగడుపుతున్నారు కొండ పైనుంచి వచ్చే నదీప్రవాహం రాళ్ళమధ్యనుంచి వంకలు తిరుగుతూ హోరుపెడుతూ ప్రవహిస్తూవస్తుంది. ఆమాదిరిగానే సంస్కృతపండితుని అమరకోశము, ఆర్యాసప్తశతి మొదలైన వాటిలోని శ్లోకాలు ఆపిల్లలనవ్వులతో కలిసి చుట్టూ ఒకశబ్ద ప్రవాహాన్ని కల్పిస్తున్నాయి. అదిచూచి నేను 'ఇదేమిటి శాస్త్రులుగారూ!' అని అడిగాను నవ్వుతూ మీ అంగ్ల

విజ్ఞానశాస్త్రం ప్రకారం చంద్రగ్రహాల ఒకటి శని గ్రహం చుట్టూ వుంటుంది. అలాగే ఇది నాచంద్రమాల' అని చెప్పాను మాస్టారు.

ఆదరిద్ర కుటీరములోని ఈదృశ్యం చూడగానే హఠాత్తుగా 'అయ్యో! నేను ఏకాకినే!' అని తట్టిందినాకు. నన్ను నేనే మోస్తూ శ్రమపడుతున్నాను అని అప్పుడు నాకు అర్థమయింది. తాను ముసలివాడై పోతున్నట్లు మాస్టరుగారికి తోచటం లేనేలేదు కాని నాకు వయస్సుముదిరిపోయిందని నాకు స్పష్టంగా తెలుస్తూనే వుంది. వయస్సు ముదిరిపోవటం అంటే మనచుట్టూవుండే వస్తువులతో సంబంధంవదలి ఎదిగి పోవటమే – అలా ఎదగటంవల్ల మనచుట్టూ ఖాళీ ఏర్పడుతుంది. ఆఖాళీని ఏనకీను పట్టాలతో గాని, ధనంతో గాని నింపలేము. ప్రపంచానుంచి నేను కేవలం వస్తువులను కూడబెట్టుకుంటున్నానే గాని రసముపొందలేకపోతున్నాను నేను చేస్తూవున్నపని ఎంత నిస్సారమైనదో, ఎంత వ్యర్థమైనదో అలవాటుపడటంవల్ల నేను గ్రహించలేక పోవచ్చు; మాస్టరుగారి ఇల్లుచూచినప్పుడు నాజీవితమెంత నిస్సారమైనదో ఎంతశూన్యమైనదో బోధపడిందినాకు. నేను లెక్కలేని గొప్ప అదృష్టవంతుడనని మాస్టరుగారు నిర్ణయించేసుకొన్నారు. ఆమాట తలచుకొన్నప్పుడు నాకు చాలానవ్వొచ్చింది. మన ప్రపంచం చుట్టూ వున్న అదృశ్యలోకమే ఆనందలోకం, ఆ ఆనంద లోకంతో మనల్ని కలిపివుంచే సూత్రమేదీ లేనప్పుడు మనం వున్న ప్రపంచము ప్రతిశంకు స్వర్గమే అవుతుంది, మన

జీవితం శూన్యము ఆలోకముతో నాకు సంబంధం లేదు. మాష్టరుగారికివుంది - పడకకుర్చీమీద కూర్చొని కాళ్లు చాచుకొని ఆలోచిస్తున్నాను. పురుషుని జీవితంలోని నాలుగు అవస్థలకు నలుగురు అధిష్ఠాన దేవతలున్నారు -బాల్యావస్థలో తల్లి! యౌవనమందు భార్య, ప్రౌఢావస్థలో కుమార్తె, వార్ధక్యములో మనమరాళ్లు, మనమలభార్యలు. ఈవిధంగా పురుషుడు స్త్రీలద్వారా పూర్ణత్వం పొందుతూ వుంటాడు. చెట్లఆకుల గలగలలు వింటూ కూర్చుండగా ఈ తత్వములోవున్న నిజము నామనస్సు నాక్రమించింది. నాకు రానున్న వార్ధక్యదశయొక్క తొలిపాదంమొదలు చివరి పాదంవరకు నాకళ్ళముందు మెదిలింది. ఆ రసహీనతను తల చుకొని నామనస్సులో ఒకవిధమైన ఆందోళన బయలు దేరింది. సంపాదించిన డబ్బునంతా నెత్తిన కట్టుకొని ఆమకు భూమిమధ్య ఎక్కడో దిక్కులేని చావు చావబోతున్నానని తట్టిందినాకు. నావయస్సు ఇప్పటికే నలభై దాటిపోయింది. ఇక మరిఆలస్యం చేయకూడదు. నాలో మిగిలివున్న యౌవ నాన్ని కాస్తా దులిపివేద్దామని యాభై [illegible] కాచుకొని కూర్చుంది - దాని చేతికర్ర కొన ఇక్కడినుంచే కన్పిస్తుంది. డబ్బు సంగతి దూరంగావుంచి ఇప్పుడిక కొంచెం జీవితాన్ని గురించి ఆలోచించాలి. కాని జీవితంలో తగిన సమయంలో చేయకుండా వాయిదావేసిన పని ఇప్పుడు చేసూలంటే వీలు పడదు. కాని ముక్కల్ని ఏరి అతికి సరిచేసుకొనేవేళ ఇంకా పూర్తిగా మించిపోలేదు.

వ్యాపారాన్ని గురించి నేనక్కడికుంచి పశ్చిమ ప్రాంతానికి వెళ్ళాను. అక్కడ విశ్వపతి బాబు అనే ఒకవర్తకుడు వున్నాడు. చాలా ధనవంతుడు, ఆయనతో నాకుపనివుంది. అతను అతిజాగ్రత్తగలమనిషి కావటంవల్ల అతనితో వ్యాపార విషయమేదైనా అనుకున్నంత త్వరగా తెమిలేదికాదు. చాలా రోజులుపడుతుంది. దానితో విసుగుపుట్టి, ఇతనితో కూడినపని తెమలదనుకొని ఒకనాడు నౌకరుతో ప్రయాణానికి సిద్ధంచేయమనిచెప్పాను. ప్రయాణసన్నాహం జరుగుతూ వున్నసమయంలోనే ఒకనాటి సాయంత్రం విశ్వపతిబాబు నాబసకువచ్చి 'మీకు అనేకమందితో పరిచయం వుంటుంది. మీరు కాస్త శ్రద్ధవహించి సహాయం చేశారంటే ఒకవితంతువును కాపాడినవారవుతారు' అనిఅన్నాడు.

విషయం ఏమనగా – నందకృష్ణబాబు అనే అతను బరేలీకివచ్చి ఒకహైస్కూలులో హెడ్‌మాష్టరుగా చేరాడు. చాలాబాగా చదువు చెప్పేవాడు. అంతపెద్దచదువు చదివినవాడు, అంతమంచిమనిషి తనకు దగ్గరచోట్లు వదలి స్వల్ప జీతంమీద ఇంతదూరం ఎందుకు వచ్చాడా అని అందరూ ఆశ్చర్యపడేవారు. బాగాచదువుచెప్పి కుర్రాళ్లను పరీక్షల్లో పాసుచేయించటమే కాకుండా ఇంకా ఎన్నోమంచి పనులు చేయాలని ప్రయత్నించేవాడు. ఇంతలో, అతనిభార్య ఎంత అందమైనప్పటికీ తక్కువ జాతిదనే సంగతి బయటపడింది. ఆమె తాకినీళ్లు తాగితే పాపమట – నీటిలోవుండే సాత్విక గుణమంతా ఆమె ముట్టుకుంటేనే పోతుందట – ఆమె అంత హీనమైనజాతికి చెందినదట. అవూరివాళ్లందరూ అతనిని

నిలేసి అడిగినప్పుడు 'అవును, ఆమె తక్కువజాతికి చెందినదే కాని ఆమె [illegible], భార్య అని చెప్పాడట అతను. అటువంటిది శాస్త్ర [illegible] కనుక అది పెళ్లి ఎలాఅవుతుంది అనే సందేహం కలిగింది అందరికీ. వారిలో ఒకడు నందకృష్ణబాబుని [illegible] కూడా అడిగాడట. అందుకు అతను 'మీరా? శ్రీమహావిష్ణువు ఎప్పుడు ఒక స్త్రీ తరువాత ఒక స్త్రీని పెళ్లాడుతాడు - మీలో మరికొందరు రెండిటితోనే సంతృప్తిచెంది పూరుకోవటానికి కావలసినన్ని నిదర్శనాలున్నాయి. శ్రీమహావిష్ణువు విగ్రహంసంగతి నేను చెప్పలేనుగాని మాపెళ్లి సవ్యమైనదే అని భగవంతుడికు గుప్త-మా వివాహం అనుదినమూ, అనుక్షణమూ కూడ బలీయమైనది, ఈవిషయాన్ని గురించిమీతో ఇంతకంటే ఎక్కువ వాదించదలచుకోలేను. అని జవాబుచెప్పాడు. ఆపెద్దమనిషికి ఈజవాబువిని ఏమాత్రం సంతోషం కలగలేదు. ఆపెద్ద మనిషిలో ఇతరులకు అపకారం చేయగలశక్తికూడా చాలా వుందట. దానిఫలితంగానే నందకృష్ణబాబు బరేలీ వదలి ఇప్పుడు వుంటున్న వూరికివచ్చి ప్లీడరీ ప్రాక్టీసుపెట్టాడు. అబద్ధాలు అన్యాయాలూ పనికిరాని నందకృష్ణబాబు ఉపవాసాలు వుండేవాడుగాని, దొంగకేసులు తీసుకొనేవాడుకాదు మొట్టమొదట దీనివల్ల అతనికి కొంతఇబ్బంది కలిగినా క్రమక్రమంగా మెజిస్ట్రేట్లకూ, కలక్టర్లకు అతనంటే మంచినమ్మకం ఏర్పడింది. దీనివల్ల లాభమే కలిగింది. ఒకఇల్లుకొన్నాడు, కొద్దిగా డబ్బుకూడా కూడబెట్టాడు కాలం ఇలాహాయిగా గడుస్తూవుండగా దేశంలో కరువువచ్చింది. తిండిదొరకక

దేశమంతా గందరగోళంగా వుంది. ప్రభుత్వం ప్రజలకు సహాయపడేందుకు కొంతడబ్బు కేటాయించింది. దానిని ప్రజలకు అందజేసేందుకు ప్రభుత్వం నియమించిన వాళ్లు ఆసొమ్మును అపహరించసాగారు. ఒకనాడు నందకృష్ణబాబు కలెక్టరుతో ఈమాటే అన్నాడు. అందుకు కలక్టరుగారు 'మంచి వాళ్ళు ఎక్కడ దొరుకుతారు మనకు!' అన్నారు.

'మీకు నాయందు నమ్మకంవుంటే ఆభారం కొంత వహించటానికి నేను సిద్ధంగా వున్నాను' అన్నాడు నందకృష్ణ బాబు. ఆభారాన్నితనే వహించాడు, కాని అదినిర్వహిస్తూ నిర్వహిస్తూ ఒకనాటి మిట్టమధ్యాహ్నం వూరిబయటపొలంలో చచ్చిపడివున్నాడు. హఠాత్తుగా గుండె ఆగి చనిపోయాడని డాక్టరు చెప్పాడు.

ఇంతవరకు ఈకథనేను ఎప్పుడో విన్నాను. అప్పుడు అతనియందు నాకు గౌరవభావం ఏర్పడింది, ఆవిషయమై ఒకనాడు నేను మాక్లబ్బులో 'నందకృష్ణబాబు ప్రపంచంలో ఏమీ సాధించలేకపోయి వుండవచ్చును. ఊరుపేరులేకుండా ఎండకు మాడి చనిపోయి వుండవచ్చును – కాని అటువంటి వాళ్ళే భగవంతునికి సహకారులై మనప్రపంచాన్ని ఇంత ఉన్నతికి –' అని మహాజోరుగా మాట్లాడుతూ అకస్మాత్తుగా అతివేగంగా పోతూపోతూ దిబ్బకుతగిలి ఆగిన నావవలె ఆగి పోయాను. ధనవంతుడని ప్రసిద్ధిచెందిన ఒకానొక మాక్లబ్బు మెంబరు, అంతవరకు పత్రిక చదువుతూ వున్నవాడల్లా కళ్ళద్దాలమీదినుంచి నావైపుచూస్తూ 'హియర్, హియర్'

యించండి' అన్నాను నేను విశ్వపతి బాబుతో.

'పిల్లను చూడకుండానే —'

'చూడ నవసరం లేదు.'

'డబ్బు ఆశవున్నవాళ్ళు మాత్రం ఆ తరువాత చిక్కులు రావచ్చు. తల్లి తదనంతరం ఆ ఇల్లు మిగిలితే కొద్దిడబ్బు వస్తుంది. అంతకుమించి మరేమీ ఆశించకూడదు.'

'పెళ్ళికుమారునికి చాలా డబ్బుంది, ఆవిషయాన్ని గురించి మనం ఆలోచించ నవసరం లేదు.'

'అతని ఊరూ పేరూ, పనీపాటా - వాటిని గురించి కొంచెం వివరంగానాతో —'

'అవన్నీ ఇప్పుడు చెప్పినందువల్ల నలుగురికీ తెలుస్తుంది, ఆ తరువాత పెళ్ళికి ఆటంకం కలుగవచ్చును.'

'అమ్మాయి తల్లితోనైనా చెప్పాలికదా —'

'పెళ్ళికుమారుడు అందరివంటివాడే అని చెప్పండి. లోపాలూ వున్నాయి గుణాలూ వుంటాయి. అతనితో మనసు భయపడాల్సినంత చెడూ లేదు, పెద్ద ఆశపెట్టుకో దగినంత మంచీ లేదు. పెళ్ళిచేసుకొనే అమ్మాయి మనస్సుకు ఏలాగు వుంటుందో చెప్పలేను కాని 'మా అమ్మాయికి ఇటువంటి వరుడు దొరికితే ఎంత బాగుండును' అని తల్లి దండ్రులు మాత్రం అనుకుంటారని చెప్పగలను.'

నా యెడల విశ్వపతిబాబుకు కల్గిన కృతజ్ఞతను చూచి నాకు అతని యెడల చాలా భక్తిభావం కల్గింది. ఇంతకు ముందు నాకూ అతనికీ షరతులు కుదరక వ్యాపారసంబంధం వదులుకోవాలని నిశ్చయించుకున్నాను, కాని ఇప్పుడు

నష్టానికైనాసరే అంగీకరించి ఆవిషయం ఖ్యాపపర్చాలనీ, త్వరగా విజ్ఞప్తి చేయాలనీ ఉత్సాహం కల్గింది. అతను వెళ్తూ వెళ్తూ 'పదివేలాగున్నా ఇంతగుణవతి ఎక్కడా దొరకదని పెళ్ళికుమారునితో చెప్పండి' అనిఅన్నాడు.

సంఘంలో చోటివ్వక అందరూ వెలివేసిన స్త్రీని ఆదరంతో నాహృదయంలో చోటిచ్చినట్లైతే ఆమెనాకు తన సర్వమూ అర్పించటానికి సంకోచించదని నావిశ్వాసము. పెద్దపెద్ద ఆశలుపెట్టుకొన్న స్త్రీ ఆశకు అంతుండదు. కాని దీపాలిది ప్రమిదలోని దీపము, కనుక నాఇట్టియింట ఆమెకు అనాదరణ కలగదు.

ఆ సాయంత్రం దీపంవెలిగించి ఏదో ఇంగ్లీషుపత్రిక చదువుతూ కూర్చున్నాను, ఎవరోఒక స్త్రీ నాతో మాట్లాడాలని వచ్చినట్లు నౌకరుచెప్పాడు. ఇంట్లో ఆడవాళ్ళెవరూ లేరు, ఆమెను లోనికి రమ్మని చెప్పటం ఎలాగాఅని కంగారు పడుతున్నాను. ఉపాయమేమీ కన్పించటం లేదెంతకూ, అంతలో ఆమె ఇంట్లోకివచ్చి నమస్కరించింది. నామాట ఎవరూ నమ్మరేమోగాని నాకు అమితమైనసిగ్గు నేను ఆమె ముఖంవైపూ చూడలేదు, ఏమీ మాట్లాడనూలేదు. 'నాపేరు దీపాలి' అని ఆమే పరిచయం చేసుకొంది.

ఆమెకంఠం అతిమధురంగావుంది. ధైర్యం తెచ్చుకొని ఆమెముఖంవైపుచూచాను. ఆముఖంలో కోమలత్వమూ జ్ఞానమూ ప్రకాశం పొందుతూవున్నాయి. తెల్లని చీరధరించింది, తలపైని ముసుగులేదు. సంభాషణ ఎట్లా ఆరంభించాలా అని నేను ఆలోచిస్తూవుండగా 'నా వివాహాన్ని

గురించి మీరేమీ ప్రయత్నించకండి' అని అన్నాను.

దీపాలి వచ్చి ఈవిధంగా అభ్యంతరం తెలియచేస్తుందని నేను వూహించనైనాలేదు. వివాహం సంగతి తెలియగానే ఆమె మనస్సూ హృదయమూ కృతజ్ఞతతో నిండిపోతాయనుకొన్నాను నేను.

'తెలిసిన వారినిగానీ, తెలియని వారినిగానీ – ఎవర్నీ పెళ్లాడరా?' అని అడిగాను నేను.

'ఎవర్నీ పెళ్లాడను.'

మనస్తత్వం కంటె వస్తుతత్వం బాగా ఎరిగినవాడను నేను; అటువంటిది స్త్రీ చిత్తం తెలుసుకోవడం నాకు ఇంగ్లీషు స్పెల్లింగుకంటె కష్టమైనది. ఆమె అంతస్పష్టంగా చెప్తూవున్నప్పటికీ, వినగానే తోచే అర్థం, ఆమె మాటలయొక్క నిజమైన అర్థంకాదేమో అనే అనిపించింది.

'మీకోసం నేను ఖాయపర్చిన సంబంధం మీరువదులుకోతగింది కాదు. వరుడు మీకు తగినవాడే' అన్నాను నేను.

'అంటే నా వుద్దేశం అతని మొహలనాకు ఆదరణలేకపోవటంకాదు, నాకు వివాహమేవద్దు–' అంది దీపాలి.

'మీయందు అతనికి చాలా గౌరవభావంవుంది.'

'అయినా, నన్ను పెళ్లాడమని అతనితో చెప్పకండి'

'సరే, వివాహం సంగతి వదిలేయండి – మీకేదైనా సహాయం చేసే అవకాశాన్నివ్వండి.'

'నన్ను కలకత్తా తీసుకువెళ్ళి అక్కడేదైనా ఆడపిల్లల బడిలో ఉద్యోగం ఇప్పించగల్గితే చాలా ఉపకారం చేసినవారవుతారు.'

'ఒక అవకాశం వుంది, అదిమీకు ఇప్పించగలను' అన్నాను. కాని అదంతా నిజంకాదు నేనరిగిన ఆడపిల్లల స్కూలేలేదు. ఆడపిల్లల స్కూలొకటి ఎందుకు స్థాపించ కూడదు, అదేమీతప్పుకాదే అని నాలోనేనే అనుకున్నాను.

'మాయింటి కొకసారివచ్చి అమ్మతో ఈవిషయం మాట్లాడగలరా?'

'రేపుపుదయం వచ్చి మాట్లాడతాను.'

దీపాలి వెళ్ళిపోయింది. నాపత్రికాపఠనం కూడా ఆగి పోయింది. డాబామీదికి వెళ్ళికుర్చీలో కూర్చుండిపోయాను. నక్షత్రాల వైపుచూస్తూ, వాటినుద్దేశించి- 'ఎన్నోకోట్ల యోజనాలదూరానవుండిమీరుమానవుని జీవితసూత్రాలనూ, కర్మసూత్రాలనూనడిపిస్తూవుంటారటనిజమేనా?' అనిఅడిగాను.

ఇంతలో విశ్వపతిబాబు రెండోకుమారుడు శ్రీపతి చెప్పకుండా హఠాత్తుగా డాబామీదికివచ్చి నాఎదుట నిల్చు న్నాడు. మా యిద్దరి సంభాషణవల్ల తేలిన సారాంశంఇది.

సంఘం బహిష్కరించినాసరే శ్రీపతి దీపాలిని వివా హమాడటానికి సిద్ధంగా వున్నాడు. ఆపెళ్ళిచేసుకొంటే ఇంట్లోనుంచి బయటికి తరిమేస్తానంటాడు విశ్వపతి. శ్రీపతి తనకోసం అంతదుఃఖమూ, అవమానమూ, అన్యాయమూ భరించి వుండటానికి తనకు అంతయోగ్యత లేదంటుంది దీపాలి. అంతేకాక, శ్రీపతి ధనవంతులఇంట గారాబంగా పెరిగినవాడవటంవల్ల సంఘం గనుక బహిష్కరిస్తే ఇల్లువాకిలీ లేక దరిద్రంతో బాధపడలేడని దీపాలి అభిప్రాయం, దీనిని గురించి దీపాలికీ శ్రీపతికీ జరిగేవాదన ఎంతకూ తెగదుగా

వుంది–అదేసమయంలో మధ్య నేనొచ్చిపడ్డాను. దానితో సమస్య మరింత చిక్కుపడింది. కనుక చిత్రగుప్తుడో గీత గీసి కొట్టిపారేసిన పదంవలె, ఈనాటకంలోనుంచి నన్ను నిష్క్రమించమని కోరటానికి శ్రీపతి నావద్దకువచ్చాడు.

'ఎలాగునో రానేవచ్చాను, కనుక ఇక వెళ్ళను. అంత వెళ్ళవలసినఅవసరమేవస్తే చెప్పివెళ్తాను' అనిఅన్నాను.

ముహూర్తం మార్చాల్సిన అవసరం కలుగలేదు, పెళ్లికొడుకుమాత్రం మారాడు విశ్వపతిబాబు కోరినపని నెరవేర్చాను కాని అందుకు ఆయన సంతోషించలేదు. దీపాలి కోర్కె నెరవేర్చలేదు కాని ఆమె సంతోషించింది. ఆడపిల్లల స్కూలులో కాలీవుందోలేదో నేనెరుగను కాని నాకు కుమార్తెలులేనిలోటు దీపాలి తీర్చింది. సంతానం లేక పోవటంవల్ల ఏర్పడిన శూన్యత ఇప్పుడిక నాయింట లేదు. పేరులేని నావంటివాడి జీవితంకూడా కేవలం వ్యర్థంకాదని నాధనసంపదద్వారా శ్రీపతి తెలుసుకొన్నాడు. తగిన వయస్సులో పెళ్ళిచేసుకోనందువల్ల కలిగిన లోటును ఇప్పుడు పెళ్ళాడి భర్తీచేసుకోవాల్సి వస్తుందేమో అనుకొన్నాను, కాని ఈశ్వరకృపవల్ల ఒకేసారి డబుల్ ప్రమోషనుపొంది ఒక దాటున రెండుక్లాసులు ఎక్కిపోవచ్చునని తెలిసింది.

నాకు యాభై అయిదోఏడు వచ్చేసరికి మనమరాళ్ళతో నాఇల్లు కళకళలాడింది. ఒక మనమడుకూడాను. విశ్వపతి బాబుతో కలసి నేను చేయదలచిన వ్యాపారంమాత్రం ఆగిపోయింది. నేను కుదిర్చిన పెళ్లికొడుకు ఆయన ఇష్టపడకపోవటమే అది ఆగిపోడానికి కారణం.

# బాలవితంతువు

మా పొరిగింటిలో ఒకబాల వితంతువు వుంటూ వుండేది. శిశిరపు కన్నీటితో నిండి రెమ్మవిరిగి కిందపడిపోయిన నల్లవాకిలివలె వుండేదిఆమె. శోభనపు గదిలోని పుష్ప శయ్యాసుఖాలు అనుభవించటానికి ఆమె సృష్టించబడలేదు; ఆమె కేవలం భగవంతునికి అర్పించటానికే సృష్టింపబడింది.

ఆమెను నేను మనస్సులో పూజిస్తూవుండేవాడను. ఆమెయందు నాకున్న భావాన్ని తెలియజేయు సరైన పదం 'పూజ'. ఇతరుల ముందెప్పుడూ 'పూజ' అనే ఆమాటను వ్యక్తపర్చే వాడనుకాదు, అదిఇతరులెవ్వరికీ తెలియనూ తెలియదు. నాలోనేను పూజించుకొన్నప్పుడు మాత్రం అందుకు మరేపదమూ ఉపయోగించలేక పోయేవాడను.

నవీన మాధవుడు నా ప్రాణమిత్రుడు, అతనికి కూడా నాభావం తెలియదు. అత్యంత ప్రబలమైన నా హృదయావేగాన్ని రహస్యంగానే వుంచి, దాని పవిత్రతనుకాపాడుతూ, అందుకు ఎంతో గర్వపడుతూ వుండేవాడను.

తానుపుట్టిన పర్వత శిఖరంలోనే కట్టుబడి వుండటానికి ఇష్టపడక పర్వతంమీద పడుతున్న నదివంటిదే నాహృదయావేగం. ఏదోవిధంగా మార్గంచేసుకొని బయటకు వచ్చివేయాలని ప్రయత్నం చేస్తుంది. ఆకోర్కె నెరవేరనప్పుడు మనస్సులో బహుబాధ కల్గుతుంది. అందుకని నా మనోభావాన్ని కవిత్వం రూపంలో వ్యక్తం చేయాలనుకున్నాను, కాని కవిత్వం సాగిందికాదు.

అప్పుడు ఒకవిచిత్రం జరిగింది. నాప్రాణమిత్రుడైన నవీన మాధవునికి సరిగ్గా అదేసమయంలో కవిత్వం రాయా లనే ఉత్సాహం కల్గింది. - అకస్మాత్తుగా భూకంపం కల్గి నట్టుగా అతనిలో ఆకోర్కె పుట్టింది.

అతనిజీవితంలో ఇటువంటి ఉ్రదవాలు ఇంతకు ముం దెప్పుడూ జరిగివుండలేదు. ఆ కొంగ్రొత్త ఆందోళనకుఅతడు ఎంతమాత్రం సిద్ధంగా వుండలేదు వీనులకింపుగా వుండే టట్లు ఎన్నడూ రెండుమాటలైనా వ్రాసివుండలేదు. అయినా అతని వుత్సాహం ఏమీ తగ్గకపోవటం చూడగా నాకు చాలా ఆశ్చర్యం కల్గింది. ముసలితనంలో రెండోపెళ్ళి చేసు కున్న భర్తను పట్టుకొన్న భార్యవలె కవిత్వం నామిత్రుని పట్టుకొంది.పద్య రచనకు నవీనుడు నన్నాశ్రయించాడు.

కవిత్వం కేవలం కొత్తవిషయాలను గురించి అనిగాని లేక పాతవిషయాలను గురించి అనిగాని చెప్పలేము. కనుక వాటిని నిత్యనూత్నములనో, బహుకాల నూత్నము లనో అనవచ్చును. లేదా నూత్న పురాతన విషయాలనీ అన వచ్చు. అవి ప్రియురాలిని గురించి ప్రియుడువ్రాసిన ప్రణయ గీతాలు. సంతోషంతో అతనిని చేత్తోపొడుస్తూ 'ఎవ రామె!' అని కూడా ప్రశ్నిచాను.

'ఇప్పటివరకు ఇంకా ఎవరూ కన్పించలేదు' అని జవాబిచ్చాడు నివీనుడు.

నవీనునికి రచనా కార్యంలో సహాయపడటం నాకు చాలా ఆనందం కల్గేది. ఇప్పటివరకు నాలోదాగివున్న ఆవే గాన్ని నామిత్రుని వూహాప్రేయసిపై ప్రయోగించాను. తన

గుడ్లను పోగొట్టుకొన్న కోడి, బాతుగుడ్లు దొరికినా ఎంతో ఆనందంతో తన హృదయంలోని వేడిని ఇచ్చి పొదుగుతూ వుంటుంది. ఆభాగ్యుడనైన నేనుకూడా అదేవిధంగా నవీన మాధవుని భావాలపైన నాహృదయ తాపాన్ని ఒలికించ నారంభించాను. నామిత్రునికి కవిత్వం పూర్తిగా చేతకాదు. అందువల్ల దానిని నేను చాలా ప్రయాసంతో పూర్తిగా మార్చి వ్రాసేవాడను. ఆదిద్దినగీతాలలో మూడువంతులు నాకవిత్వమే వుండేది.

నేను దిద్దిన తరువాత నవీనుడు ఆశ్చర్యపడుతూ, అరే, నేనూ సరిగ్గా ఇదే వ్రాయాలనుకున్నాను, అయితే నాకు చేతనయిందికాదు. ఆమాటల పొందిక నీకెలా కుదురు తుంది!' అని అనేవాడు.

అందుకు నేనొక గొప్పకవివలె జవాబుచెప్పేవాడను-వూహా మూలంగానే ఈవిధంగా వ్రాయగల్గుతున్నాను. వాస్తవికతకు మాటలపొందిక కుదరదు, వూహా టపాకాయ వంటిది. వాస్తవంగా జరిగిన ఘటనను వున్నదున్నట్లే తీసు కుంటే అది భావప్రవాహానికి ముందుకు సాగనీయకుండా బండలవలె అడ్డుపడుతుంది. అప్పుడు వూహామాత్రమే ఆ ప్రవాహ మార్గాన్ని నిరాటంకం చేస్తుంది

నవీనుడు ముఖం గంభీరంగాపెట్టి కాస్సేపాలోచించే వాడు. 'అవును, చూడగా నువ్వుచెప్పిందేనిజం' అని మళ్ళీ కాస్సేపాగి' నిజంగా అంతేసుమా! అదేనిజం' అనేవాడు.

నాప్రేమలో సంశయమూ, బిడియమూ వుండేవని నేను మొదటనే చెప్పాను. అందుకే నానోటితో నేను కవిత్వం

చెప్పగలిగేవాడను కాను అందుకే నా పేరుతో నేనేదీ వ్రాయలేక పోయేవాడను నవీనమాధవ్‌ను ఇప్పుడు మధ్య తెరగా వుంచి బయటకువచ్చే అవకాశం నాకవిత్వానికి లభించింది. రసభరితమైన మధురగీతాలెన్నో నిరాటంకంగా నాలోనుంచి వెలువడేవి.

వాటిని చదివి 'ఇవి నేను వ్రాసినవి కావు, పూర్తిగా ఇవి నీగీతాలే. వీటిని నీపేరుతోనే ప్రచురిద్దాం' అన్నాడు నవీనుడు.

'మహా బాగుందోయ్ నీవరస! రెండుమూడు మాటలు ఎక్కడైనా మార్చానేమోగాని ఇక అంతా నువ్వు వ్రాసిందే అని జవాబు చెప్పాను.

కానురాను ఈమాటే నిజమనే నమ్మకం కల్గింది నవీనునికి.

నక్షత్రోదయానికి ఎదురుచూచే జ్యోతిశాస్త్రజ్ఞునివలె నేనెప్పుడూ పొరుగింటి కిటికీ వంకచూస్తూ కూర్చునేవాడను అనేది అంగీకరించకతప్పదు. అప్పుడప్పుడు ఈభక్తుని వ్యాకుల దృష్టి సార్థకమవుతూవుండేది, కాని కర్మయోగంలో మునిగి వున్న ఆ బ్రహ్మచారిణియొక్క సౌమ్యమైన ముఖంలో ప్రతిబింబించు ఉద్రేకరహితమైన ప్రశాంతత నామనస్సు లోని తృష్ణను అణచివేసేది.

కాని నేను ఆనాడు చూచినదేమిటి! చంద్రునిలోని వేడిఇంకా ఆరిపోలేదా! ఆ నిర్జనమైన చంద్రలోకంలో, సమాధిలోవున్న అక్కడి పర్వతగుహాలలో అగ్నిప్రవాహం పూర్తిగా చల్లారిపోలేదా!

కాకుండా అవసరమైనప్పుడు ధనసహాయం చేసికూడా వితంతు వివాహాలను ప్రోత్సహించాలని సంకల్పించుకొన్నాను.

'వైధవ్యంలో ఒకవిధమైన పవిత్రశాంతి వుంటుంది. క్షీణచంద్రుని కాంతిగల స్మశానభూమిలో వుండే గాఢమైన రమణీయత వైధవ్యంలో కన్పిస్తూవుంటుంది. వివాహాంసంగతి ఎత్తగానే ఆసౌందర్యం కాస్తా మాయమైపోతుంది' అని నవీన్ నాతో వాదన ఆరంభించాడు.

అటువంటి కవిత్వం విన్నప్పుడు నాకు ఒళ్ళుమండేది. కడుపునిండా తినివచ్చి, కరువుతో కడుపుకులేక మాడి చచ్చే వానియెదుట నిల్చొని తినటంలో వుండే జ్ఞానహీన తను తృణీకరిస్తూ, పుష్పాలపరిమళంతోనూ, పక్షులగానం తోనూ తన్మయత్వం చెందుతూవున్నవాని కడుపునింపకో వటం వంటిదే నామిత్రుని వాదం.

అందుకనేను కోపంగానే జవాబుచెప్పాను–' చిత్ర కారుని కంటికి కాలిపోయిన ఇంటిలో ఒకవిధమైన సౌందర్య కన్పించవచ్చు, అది ఆతని చిత్రలేఖనానికి అమూల్యమైన నమూనాకావచ్చు, కాని ఇల్లు చిత్రలేఖనాని కొరకే కాదు కదా! అది నివాసయోగ్యంగా వుండాలి గనుక చిత్రకారుని కొర్కె ఏదైనప్పటికీ కాలిపోయిన ఇంటిని మరమ్మత్తుచేయక తప్పదు. వైధవ్యాన్ని గురించి దూరంగా కూర్చొని కవిత్వం వ్రాస్తూవుంటానంటావు. కాని దానిలో ఆశాంతితో

నిండిన హృదయవేదన ఎంతవుంటుందో అది గుర్తించుకో వడం మన కర్తవ్యం.'

నవీన్‌ను విధవా వివాహ సంఘంలోకి ఆకర్షించటం సాధ్యంకాదనుకొనేవాడను. అందుకే ఆనాడు అంతకోపంతో వాదించాను కాని చివరికి జరిగిందేమంటే, నవీనుడు దీర్ఘంగా నిట్టూర్చి నేనుచెప్పినదంతా అంగీకరించాడు. నేను ఇంకా గట్టిగా వాదించాలని ఏవేవో అస్త్రాలను ఉపయోగించాలని సిద్ధపడుతున్నాను. కాని అతడు అంతవరకు రానివ్వనే లేదు.

వారంరోజులు గడిచిపోయాయి, ఒకనాడు నవీన్ నా వద్దకువచ్చి, 'నువ్వుగనుక నాకు సహాయం చేయగల్గితే నేను వితంతు వివాహం చేసుకోవాలని సిద్ధంగా వున్నాను' అని చెప్పాడు.

నాకు ఆక్షణాన మితిలేని ఆనందం కల్గింది, అతనిని గట్టిగా కౌగలించుకొన్నాను. కావలసినంత డబ్బు ఇస్తా నన్నాను. నవీన్ అప్పుడు తన కథయావత్తూ చెప్పకొచ్చాడు.

అతని ప్రేయసి పూర్వపరిచిత కాదు. ఒకానొక వితంతువును అతడు కొన్నాళ్ళుగా దూరాన్నుంచే ప్రేమిస్తూవున్నా డట. ఈసంగతి అతడెవ్వరికీ వెల్లడి చేయలేదు. పత్రికలో అతనిపేర వెలువడుతూవున్న నేను వ్రాసిన గీతాలు వగైరా వెళ్ళవలసిన చోటికి వెళ్తూనేవున్నవట. అవివ్యర్థంకాలేదట. ఇద్దరూ పరస్పరంగా తెలుసుకొనే అవకాశం కోసం ఇది నామిత్రుడు కనిపెట్టిన మార్గమట.

తానుచేసిన ఈపని కుట్రకాదన్నాడునవీన్, అనితంతు వృకు చెడవటం రాదనికూడా చెప్పాడు. అప్రతికలను ఆమె తమ్ముని పేర ఉచితంగాప్రచురించేవాడట. మనస్సును శాంతపర్చుకొనేందుకు చేసిన పిచ్చిపనిగా తప్ప మరేమీ కాదన్నాడు. భగవంతునికి పుష్పాంజలి నిస్తూ మనపని. అది ఆభగవంతునికి తెలియనీ, తెలియకపోనీగాక – అతడు దానిని స్వీకరించినా స్వీకరించకపోయినా దానితో మనకు నిమిత్తంలేదు.

అనేక ఉపాయాలుచేసి నవీనుడు ఆమె తమ్మునితో స్నేహం చేసుకొన్నాడు. ఆవిధంగా ప్రచురించటంలో కూడా తనకు వేరేవుద్దేశమేదీ లేదన్నాడు. మనం ప్రేమిస్తూ వుండేవాళ్ళ పరిసరాలన్నికూడా మనకు మధురమైనవే అవుతూవుంటాయికదా! చివరకు ఆతమ్ముని బలవంతంవల్ల నవీన్ ఆమెను ఏవిధంగా కలుసుకొన్నదీ ఇదంతా ఒకపెద్దకథ. ఎవరిని ఆధారంచేసుకొని ఆ కవిత్వ రచన జరిగిందో, ఆమెను కవి ప్రత్యక్షంగా కలుసుకొని అనేక విషయాలను గురించి సంభాషించటంకూడా జరిగిందట. అయితే, ఆసంభాషణ కవిత్వ విషయాలతో మాత్రమే ఆగిపోలేదు.

నవీన్ నాతో వాదనలో ఓడిపోయి ఆమెవద్దకు వెళ్ళి పెళ్లాడమని కోరాడట. ఎంతకూ ఆమె అంగీకరించలేదట అప్పుడు అతను నావాదనలన్నీ ప్రయోగించి, వాటితో తన అశ్రుజలంకలిపి, ఆమెనుఓడించి పెళ్ళికి అంగీకరింపజేశాడట.

ఆమెకు తండ్రిలేడట, పినతండ్రి సంరక్షణలో వున్నదట అత నికి కొంతడబ్బు ముట్టచెప్తేనేగాని పెళ్ళికి అంగీకరించకపోవ చ్చునట.

'అయితే, ఇప్పుడే డబ్బు తీసుకువెళ్ళు' అన్నాను నేను.

'అంతటితో అయిపోతుందనుకొన్నావా? నేను మరొక విధవను వివాహమాడితే మా నాన్న నాకు ప్రతినెలా పంపుతున్న డబ్బు పంపటం మానేస్తాడు. కనుక నా[illegible]గ్రైదు [illegible]ల వరకు నాకయ్యేఖర్చుకూడా నువ్వేభరించాలి' అని అన్నాడు నవీన్. అందుకు నేను నోటిమాటలతో కాకుండా చెక్కు వ్రాసిఇచ్చి జవాబు చెప్పాను.

'ఆ అమ్మాయి ఎవరో ఏమిటో చెప్పవేం? నీతో పోటీపడనులే, చేతిలోచేయివేసి చెప్తున్నాను భయపడకు నేను ఆమెమీద గీతాలువ్రాయను. ఒకవేళ వ్రాసినా ఆమె తమ్ముడికిమాత్రం పంపను, నీకే ఇస్తాను' అన్నాను నేను అతనికి కాస్త ధైర్యం చెప్తూ

'అటువంటిభయమేమీ నాకులేదు. విధవా వివాహమంటే సిగ్గువల్ల ఈసంగతి ఎవరికీ చెప్పవద్దని నన్నొంతో వేసుకొంది, కాని ఇక దాచిపెట్టటం అనవసరం—ఆఅమ్మాయి మరెవరోకాదు, మీపొరుగింట్లో, అంటే పదొమ్మిదో నెంబరు ఇంట్లోవున్న అమ్మాయే!' అన్నాడు నవీన్.

నాగుండె ఏ ఇనపబాయిలరో అయివుంటే తక్షణం పేలి ముక్కలైపోయి వుండేది.

'విధవా వివాహం అంటే ఆమెకు అభ్యంతరమేమీ లేదా!' అని అడిగాను.

'అటువంటి అభ్యంతరాలేవీ లేవిప్పుడు' అన్నాడు నవీన్ నవ్వుతూ.

'ఆమె ఆకవిత్వంమూలానే అంతర్ముఖురాలైపోయిందా!' అని అడిగాను మళ్లీ.

'అంటే నాకవిత్వం అంతనిస్సారమైన దంటావా!' అని ఆశ్చర్యంగా అడిగాడు నవీన్.

'ఛీ! ఛీ!' అనుకొన్నాను నాలోనేనే.

ఎవరికి ఆఛీ? నాకా? అతనికా? లేక ఆభగవంతునికా? ఛీ!

